శ్రీ వాసిష్ఠ గణపతిముని ప్రణీత

# ఇంద్రాణీ సప్తశతి

సరళమైన తెలుగు తాత్పర్య సహితం





సరళమైన తాత్పర్య రచన

డా॥ వి.వి. వేంకటరమణ

శ్రీ వాసిష్ఠ గణపతిముని ప్రణీత

# ఇంద్రాణీ సప్తశతి

సరళమైన తెలుగు తాత్పర్య సహితం

సరళమైన తాత్పర్య రచన

**డా॥ వి.వి. వేంకట రమణ**

శ్రీ అక్షర ధ్యాన రమణ కేంద్రం

18-3-24, శాంతినగర్ (ఖాదీ కాలని), కపిల తీర్థం రోడ్,

**తిరుపతి - 517 507**

*Kavya Kanta Vasishta Ganapathi's*

# INDRANI SAPTHA SATI

*SARALAMAINA TELUGU TAATPARYAM*



***First Edition***: October, 2013
***Copies***: 500

***Price***: ₹ **150**




***Cover Design***:
*Padmasri* Bapu

***For Copies***:

1. K. Venkata Lakshmi
   201, R.K. United Residency
   Saleem Nagar Colony
   New Malak Pet, Hyderabad - 500 036
   Phones: 040-24540574, 98661 32429
2. Akshra Ramana Dhyana Kendram
   18-3-24, Shanthi Nagar (Khadi Colony),
   K.T. Road, Tirupati - 517 507

***Designed and Printed at***:
Ratna Printing Works
Vijayawada - 520 002
Ph: 0866-6663666 / 9030 663666

# శ్రీ అక్షర ధ్యాన రమణ కేంద్రం

**18-3-24, శాంతినగర్ (ఖాదీ కాలనీ), కపిలతీర్థం రోడ్డు,**
**తిరుపతి - 517 507**
ఫోన్: 0877-2230139
మొబైల్: 98856 57156, 89854 29435

**కా**వ్యకంఠ గణపతిముని పేరు వినగానే ఆయన వ్రాసిన ఉమాసహస్రం, ఆ గ్రంథ పరిసమాప్తికి కారణభూతులైన భగవాన్ శ్రీరమణమహర్షులవారు గుర్తుకు రాని వారు ఉండరు. భగవాన్ రమణమహర్షులతో కలసిన అనంతరం గణపతిముని చేసిన రచనలలో ఆయనపై భగవాన్ ప్రభావం తెలుసుకోకపోతే వాటిని పూర్తిగా అవగాహన చేసికొనుట దుర్లభం. వాటిల్లో **ఇంద్రాణీసప్తశతి** గణనీయమైంది. గురుబోధతో జ్వలించిన చిన్మయ స్రవంతి ప్రతిరూపం ఇంద్రాణీసప్తశతి.

*జ్ఞానశిఖా జ్ఞాననిష్ఠా జ్ఞానయజ్ఞోపవీతినః ।*
*జ్ఞానమేవ పరా తేషాం పవిత్రం జ్ఞానముచ్యతే ॥*

- అథర్వవేదీయ బ్రహ్మోపనిషత్తు

"జ్ఞానమునే శిఖగాను, జ్ఞానమునే యజ్ఞోపవీతముగాను ధరించి, జ్ఞానమునందు చరించువానికి జ్ఞానమే పరాకాష్ఠ అగుటవలన అదియే ఉంగరపువేలికి ధరించు దర్భతో చేసిన పవిత్రం" అని దీని అర్థం.

ఇది భగవానునికి నిర్వచనం, ఉదాహరణ కూడా. కర్మకాండతో ప్రమేయం లేకుండా జ్ఞానియైన సాధకుడు రమణమహర్షి అయితే, కర్మకాండతో ప్రారంభించి జ్ఞానియైన వాడు కావ్యకంఠుడు. విజ్ఞానంతో కూడిన కర్మకాండను జ్ఞానకాండతో సమన్వయించి, "పూజనం జపశ్చింతనం క్రమాత్" అని ఉపదేశసారం (4) లో సాధకుని మార్గాన్ని నిర్దేశించిన రమణుల సిద్ధాంతాన్ని వివరించే గ్రంథం ఇంద్రాణీసప్తశతి.

రమణమహర్షి మౌనంగానే భక్తులను అలరించడంవల్ల అప్పుడప్పుడు పరోక్షులైన భక్తులకొరకు అప్రయత్నంగా వారి ముఖకమలాన్నుండి మాటలు ముత్యాల్లా జాలువారేవి. అవే యీనాటి సాధకులకు వేదశాసనాలు. అందువలన అయన కృతులు చాలా కొద్ది మాత్రమే కాక చిన్నవి కూడా. వారి బోధనలను సామాన్యులు ఎలా సాధనలో తెచ్చుకోవాలో విశదీకరించినవారు గణపతి ముని.

తన గురించి రమణులు ఇలా చెప్పుకున్నారు -

*ఎముకలరుగు దాసు మృదువాక్కు విను చెవిన్*
*గొనుమ నాయల్పోక్తులరుణచలా ॥*

- *అక్షరమణమాల, 106*

మనకు, ప్రపంచానికి మధ్యనున్న సంబంధం గురించి ఒకే ఒక్క పద్యంలో శ్రీ రమణులు ఇలా చెప్పారు -

> అణురూపు నిన్ను నే మిన్నురూపుం జేర
> భావోర్మ్మలెపు డాఁగు నరుణాచలా ॥
>
> - *అక్షరమణమాల, 57*

మానవుడు బిందురూపుడు (microcosm). దాని పరివర్తనమే పంచభూతాత్మక మైన ప్రపంచం (macrocosm). తైత్తిరీయ-నారాయణీయోపనిషత్తులో వర్ణించిన ఇంద్రియా గోచరమైన హృదయాన్ని (transcendental heart) ఎటువంటి శాస్త్ర పరిజ్ఞానంలేని రమణమహర్షి చింతన ద్వారా దర్శించారు. గణపతిముని లాంటి పండిత శిష్యులకు దర్శింప చేయించారు. ఆత్మదర్శనం పొందినవాడు జీవన్ముక్తుడై తన మనసుతోను, శరీరేంద్రియాలతో మాత్రమే కాక, తాననుగ్రహించినవారి మనసుతోను, ఇంద్రియాలతోనూ కూడా పని చేయించగలడనడానికి నిదర్శనాలే ఉమాసహస్రంలోని చివరి 250 శ్లోకాలు, ఇంద్రాణీ సప్తశతి.

లక్ష్యం ఒకటే అయినా సాధనలు పలురకాలు. రమణ మహర్షి సాధనా పద్ధతి వేరు. గణపతిముని సాధనా పద్ధతి వేరు. కానీ ఇద్దరి ఆత్మానుభూతి మాత్రం ఒకటేనని నిరూపిస్తుంది ఇంద్రాణీ సప్తశతి. అందుకే గణపతి ముని అంటారు -

> ఏతత్స్వాంతం హృదయాజ్జాతం
> శీర్షే వాసం పృథగాధాయ ।
> హార్దా హంతాం స్వయమాక్రమ్య
> భ్రాంతానస్మాన్ కురుతే మాతః ॥
>
> - ఇం.స. *4.4.16*

"జ్ఞానస్వరూపమైన ఆత్మ సర్వవ్యాపి అగుటవలన జ్ఞేయాలైన అన్ని ప్రాపంచిక వస్తువులు గోచరమగుటకు మనస్సు కాని ఇంద్రియాలు కానీ అవసరం లేదు" అన్నదే రమణమహర్షుల అంతిమ సందేశం. ఇదే ఇంద్రాణీసప్తశతికి మూలం.

గురుశిష్య సంబంధంలాగా ఇంద్రియాగోచరమైన ఆత్మమనస్సుల సంబంధం ఉంది. ఆత్మ స్వరూపం సూర్యుని వెలుతురులా ఇంద్రియాతీతమైన అనుభూతి. దానిని మాటల్లో చెప్పాల్సివస్తే ఉపమాన ప్రమాణం తప్ప వేరే మార్గం లేదు. అంతేకాదు. పరా వాగ్రూపమైన ఆత్మను అంచులదాకా నిండిన చైతన్యం, పశ్యన్తీ-మధ్యమా-వైఖరీ రూపంలో పరిణామం చెంది, భాషారూపంగా రూపుదిద్దుకోవాలంటే ఆత్మ మనస్సుతోను, మనస్సు పంచేంద్రియాలతోనూ కలసి ద్వైతరూపాన్ని పొందాలి. ఆ విజ్ఞాన రూపమైన ద్వైతం నుంచి జ్ఞానరూపమైన అద్వైతంలోకి చేరే సాధననే నివృత్తి మార్గం అంటారు. ప్రవృత్తి మార్గంలో కర్మచేసేవాడు పురుషుడైతే, కర్మఫలాన్ని ప్రసాదించేది స్త్రీ. అందువల్ల మనస్సు పురుషుడైన ఇంద్రుడు. ఇంద్రియాలకు అధిపతి ఇంద్రుడు. పద్మాకారహృదయంలో ఉన్న ఆత్మ చైతన్యం

ఇంద్రాణి. ఈ ఇంద్రాణీ సప్తశతిలో ఆమెను చేరటానికి కావలసిన ప్రణాళిక, సాధనా పద్ధతులు 700 శ్లోకరూపమైన సూత్రాలతో నిర్దేశించడం జరిగింది. అందువల్ల భగవద్రమణ మహర్షి అనుభవపూర్వకంగా నిక్షిప్తంచేసిన సూక్ష్మ తత్త్వపు పరమార్థమే ఇంద్రాణీతత్త్వం. సిద్ధులైన రమణులవంటి వారికి దేశకాలపరిధులు ఉండవని చెప్పిన కింది పద్యాన్ని చూడండి -

*రేయుంబవలు లేని బట్టబయటి యింట*
*రమియింపగా రమ్ము అరుణాచలా!*

– అక్షరమణమాల, *91*

సిద్ధులైనవారికి భూతభవిష్యద్వర్తమానాలనే కాలభేదం ఉండదు. అలానే దేశం యొక్క దిక్కులు పరిధులు కూడా ఉండవు. అందువల్ల దేవత, దేశం, సమాజం, వ్యక్తి, చైతన్యం, వెలుగు, నాదం, భాష వేరు కావు. దేశం గురించి, సమాజం గురించి ఆలోచించ లేని వాడు సాధకుడు కాలేదని, విజ్ఞానరూపంలో కనబడే కాలభేదం, దేశభేదం, వ్యక్తిభేదం – వీటిని ఆశ్రయంగా తీసికొని దేవతోపాసనతో ప్రారంభించి శుద్ధచైతన్య రూపాన్ని చేరే విధానాన్ని వివరించడం ఇంద్రాణీ సప్తశతిలోని విశేషాంశం.

*త్వం బ్రహ్మా త్వం పరాశక్తిః త్వం సర్వా అపి దేవతాః ।*
*త్వం జీవాః త్వం జగత్సర్వం త్వదన్యన్నాస్తి కించన ॥*

– ఇం.స. *3.1.20*

*ఏకక్రియాయాశ్చ ఫలప్రభేదాత్*
*పునర్విభాగః క్రియతే బహుజ్ఞైః ।*
*కాళీం చ తారాం స్వరమగ్ర్యమాహుః*
*ప్రచండచండీం లలితాం చ తేజః ॥*

– ఇం.స. *6.1.9*

అందువల్లనే అరుణాచలస్తుతి పంచకం (శ్లో. 5) లో శ్రీరమణమహర్షి అనుగ్రహించిన

*త్వయ్యర్పితమనసా త్వాం*
*పశ్యన్ సర్వం తవాకృతితయా సతతమ్ ।*
*భజతే ఽనన్యప్రీత్యా*
*స జయత్యరుణాచల త్వయి సుఖే మగ్నః ॥*

అనే శ్లోకరత్న వివరణమే ఇంద్రాణి సప్తశతి అని అనిపిస్తుంది.

మనస్సుతో ఏ వస్తువును చూచినా ఆ వస్తువును మాత్రమే కాక దాని జ్ఞాన హేతువైన ఆత్మచైతన్యాన్ని కూడ చూడటం కొరకే సాధన చేయవలసి ఉన్నది. అందుకే ఇంద్రియాల నుంచి మనస్సు గతిని నిరోధించి, ఆ మనస్సుతోనే ఆత్మను చూడటమే సాధన ఫలం.

మణుల సూత్రం బన మత మనేకములఁ
ప్రతిజీవి లోపల గతు డొక్కఁ డీవె

అని అరుణాచలాష్టకము (5) లో శ్రీరమణ చెప్పినట్లు సాధనా మార్గాలు చాలా ఉన్నాయి. పలు మార్గాలలో సాధకుల అభిరుచినిబట్టి, యోగ్యతనుబట్టి ఏదో ఒక మార్గాన్ని పట్టుకొని లక్ష్యాన్ని చేరాలన్నదే ఇంద్రాణీ సప్తశతి తాత్పర్యమని గణపతిముని అంటారు.

అమేయమమలం పురాణపురుషం
తదీయ విభవాభిదాయిభిరిమే ।
వదంతి కవయః పదైర్బహువిధైః
తథైవ భవతీం తతో మతభిదాః ॥

- ఇం.స. *7.2.7*

రమణమహర్షి బోధనల విశ్లేషణ చేయాలంటే ఆయన సమకాలీకుడైన గణపతి ముని నుంచే తెలుసుకోవటం సులభం, ఉత్తమం కూడా. ఉదాహరణకు రమణమహర్షి చెప్పింది చూడండి -

స్థలమగ్ని ఖం వాయు సలిలముల్ జీవ
ములు విరిపగు భూతములు భౌతికములు,
మిన్నువెలుగ! నిను విడిచి లే వవ్వి
యన్న వే ఱెవరు నేనైయుందు, విమల! ॥

- అరుణాచలపదికము *7*

దీనికి గణపతి వివరణ చూడండి -

వస్తుని వస్తుని సత్తాం యో భవతీం సముపాస్తే ।
మాతరముష్య వహేయం పాదయుగళం శిరసాహమ్ ॥

- ఇం.స. *3.3.23*

రమణమహర్షి అష్టాంగ యోగసాధన మాత్రమే చాలంటే గణపతి హఠయోగ ప్రక్రియను కూడా కలిపినాడు. హఠయోగ సాధన గురువు సమక్షంలోనే చేయాలి. అందువలన లంబికాయోగముచేత శిరో భేదనము పొందిన కావ్యకంఠులను స్వస్థితికి రమణులు తీసికొని రావటమేగాక, ఇది జరిగిన తరువాత కావ్యకంఠులు చాలాకాలం జీవించి ఉండటం అనేది అద్భుతమైన అనన్యసామాన్య సంఘటన. ఇదే గురుకృప. ఆత్మానందలహరిలో తేలియాడే రమణమహర్షి తన శరీరస్పృహను గూర్చి ఇలా చెప్పుకున్నారు -

భౌతికమౌ మేని పట్టార్చి యెప్పుడు నీ
మహిమఁ గనఁ గరుణిం పరుణాచలా ॥

- అక్షరమణమాల, *75*

అదే విధంగా రమణామృతధారలో మునిగి పునీతులైన గణపతిముని రేణుకాదేవి శిరోఖండనాన్ని భౌతికమైన క్రియగా కాక అంతరంగికమైన ఇంద్రియనాశనంగా దర్శించాడు.

> ఖలజనకల్పితదుష్టకథా
> శ్రవణవశాద్వ్యథితం హృదయమ్ ।
> అథచరితేఽవగతే విమల
> స్మృతివశతో మమ యాతి ముదమ్ ॥
>
> – ఇం.స. *6.4.10*

ఇలా పునరుద్ఘోషించటం గణపతియొక్క మహాతపస్విత్వానికి మచ్చుతునక.

గురుశిష్య సంబంధపు పరాకాష్ఠ సాధనానంతరం ఆ సంబంధం మనసా వాచా కర్మణా పూర్తిగా తెగిపోవటమే. శరీరపు వయసునుబట్టి రమణులు గణపతిమునిని "నాయన" అని పిలిచేవారు. గణపతిముని రమణునితో ఐక్యం చెంది ఎంతో భావగర్భితంగా ఇలా వర్ణించారు –

> అరుణాచలేశ్వరదరీ వసతేః
> తపతో మునేర్గణపతేః కుశలమ్ ।
> వివిధావతార విలసచ్చరితా
> వితనోతు సా విబుధరాడ్వనితా ॥
>
> – ఇం. స. *7.3.22*

ఇంతకంటే మధురంగా ఉంది తరువాతి శ్లోకం –

> అరుణాచలస్య వరకందరయా
> ప్రతిఘోషితం కలుషహారి యశః ।
> విభుధాధినాథరమణీ శృణుయాద్
> గణనాథగీతిమతిచారు నిజమ్ ॥
>
> – ఇం.స. *7.3.23*

"అరుణాచలం" అంటే ఎర్రని వర్ణంతో దేదీప్యమానంగా వెలుగుతూ ఉండే కదలని కొండ. చలమైనది సూర్యుడైతే అచలమైనది హృదయం. ఆ హృదయకుహరం అనే కొండ గుహలోంచి వచ్చిన వాయుప్రసార నాదమే శబ్దంగా వైఖరీరూపంలో రూపు దిద్దుకుంది. ఆ హృదయగత పరావాక్కే ఇంద్రాణి. వైఖరీవాక్కే ఇంద్రాణీ సప్తశతి. దేశకాలాల కతీతంగా భౌతికాతీత ఊర్ధ్వభూమికలోకి పయనిస్తే ఆ వైఖరీవాక్కు ఋగ్వేదకాలంలో ఋషులు సందర్శించినవడం వలన ఇంద్రాణీ సప్తశతి వేదసంప్రదాయానుశ్రుతమైన వైదికగ్రంథం.

తిరుపతిలో మహామనీషిగా, ఉత్తమ ప్రధానోపాధ్యాయుడుగా గుర్తింపు పొంది

రాష్ట్రపతి పురస్కార గ్రహీతయైన కీ॥శే॥ వి.ఎస్. వేంకటనారాయణ గారి పుత్రుడు డా॥ వి.వి. వేంకటరమణ సరళమైన తాత్పర్యంతో ఇంద్రాణీ సప్తశతిని ప్రచురించి జిజ్ఞాసులకు ఆత్మప్రచోదనచేయ యత్నించటం ముదావహం.

చి॥ రమణ ఉమాసహస్రానికి ఇంద్రాణీసప్తశతికి ఉన్న అభేదాన్ని చక్కగా ప్రదర్శిం చారు. స్థూలార్థముకన్న మిన్నైన కావ్యకంఠుల వారి వేదాంతతత్త్వం ఈ గ్రంథం ద్వారా తెలియవరచబడింది.

ఆంధ్రపాఠకులు వీరి రచనను శ్రద్ధతో చదివి, శ్రమను గుర్తించి ఆనందించటమే గాక దేశరక్షణకు, సమాజరక్షణకు కార్యోన్ముఖులు కాగలరని ఆశిద్దాం.

ఇతి నారాయణస్మృతిః !

**- శ్రీశ్రీశ్రీ అక్షరానంద భారతీస్వామి**



# కృతజ్ఞత

ఇంద్రాణీ సప్తశతి ఏమిటి, ఎలా ఉంటుంది, దీని విశేషమేమిటి?

నాకు అస్సలు తెలీదు. అలాటి శతకమంజరి ఒకటి ఉందని కూడా తెలీదు. 1998లో ఒక సందర్భంలో ఇంద్రాణీ సప్తశతి పేరు విన్నాను. అప్పటినుంచి ఇంద్రాణీదేవి ఎవరు, ఆ 700 శ్లోకాల సంగతేంటి? అని ఎందరినో అడిగాను. కానీ నాకు వివరాలు లభ్యం కాలేదు. 2012లో ఇంద్రాణీ సప్తశతిని కావ్యకంఠ శ్రీ వాశిష్ఠ గణపతి ముని వ్రాసిన కావ్యం మీ దగ్గర ఉందా? అని శ్రీ యామిజాల ఆనంద్‌ని అడిగాను. వారి తండ్రిగారు శ్రీ యామిజాల పద్మనాభస్వామి అఖండ ప్రజ్ఞావంతులు. నాయనతో ప్రత్యక్ష సాన్నిధ్యాన్ని అనుభవించి, నాయన జీవిత చరిత్రను, నాయన వ్రాసిన ఉమాసహస్రానికి వ్యాఖ్యానమూ వ్రాసిన ధన్యజీవి. నేనడిగినంతనే శ్రీ ఆనంద్ ఇంద్రాణీ సప్తశతి పుస్తకాన్ని నాకు ఇచ్చారు. పారాయణగా కాకపోయినా మొదటిసారి చదివినపుడు ఈ సప్తశతి గతంలో ఎపుడో చదివిన రీతిలో ఉండటం నాకు ఆశ్చర్యం కలిగింది. నేను ఇందులో కొన్ని శతకాలు చదివేటపుడు నాకే తెలీకుండా రాగయుక్తంగా పఠించడం జరిగింది.

ఇంద్రాణీ సప్తశతి అనేది పారాయణ చేయడంవల్ల అనారోగ్యాలు తొలగిపోతాయి, శత్రునాశనం కలుగుతుంది అని తెలిసింది. అంతే కాదు, భారత దేశానికి స్వాతంత్ర్యం లేని కాలంలో తన దేశానికి కష్టాలు తొలగాలని, దాస్యవిముక్తి కలగాలని, అరాచకం తొలగాలనీ గణపతిముని ఆ ఇంద్రాణీదేవిని వేడిన రీతి నన్ను కదలించి వేసింది. ప్రస్తుత దేశ కాల పరిస్థితుల్లో ఈ సప్తశతి పారాయణ ఎంతో అవసరం అని తోచింది. ఆ విషయాన్నే డా॥ పి.ఎస్. గోపాలకృష్ణ (విశ్రాంత స్టేషన్ డైరెక్టర్, ఆకాశవాణి, హైదరాబాద్) తోనూ, శ్రీ ఎం.వి.ఆర్. శాస్త్రి (ఎడిటర్, ఆంధ్రభూమి) తోనూ చర్చించాను. వారి ప్రోత్సాహం వెనక ఉన్న ఇంద్రాణీ శక్తి ఈ ఇంద్రాణీ సప్తశతిని ఆస్తిక లోకానికి పరిచయం చేసే భాగ్యాన్ని నాకు కలిగించింది. 700 శ్లోకాలకు భావాన్ని సరళంగా వ్రాయడం అతి తక్కువ వ్యవధిలోనే పూర్తి చేయగలిగానంటే అది ఆ దేవీ మహాత్మ్యమే కానీ వేరే కాదు.

ఈ రచన మీ అందరి ముందుకు రావడానికి కారణమైన శ్రీ ఎం.వి.ఆర్. శాస్త్రి, డా॥ పి.ఎస్. గోపాలకృష్ణ, అనేక విధాల తోడ్పాటునిచ్చి నా వెన్నంటే ఉన్న శ్రీ యామిజాల ఆనంద్ గార్లకు, డా॥ మంగళగిరి ప్రమీలాదేవికి, సదా ప్రోత్సాహాన్నిచ్చే శ్రీ వి.వి. వేంకట సుబ్రహ్మణ్య శర్మ గారికీ (ఈ పుస్తకం వెలువడేలోగానే వారు పరమపదించారు) నేనెంతో ఋణగ్రస్తుడను. ఆంధ్రభూమి దినపత్రికలో ఈ సప్తశతి వ్యాఖ్యానం రావడం చూసి ఎంతో సంతోషించి, మరిన్ని సూచనలిచ్చి ప్రోత్సాహించిన శ్రీ రావినూతల శ్రీరాములు గారికి ప్రత్యేక కృతజ్ఞతలు.

శ్రీ అక్షర ధ్యాన రమణ కేంద్రంలో శ్రీశ్రీశ్రీ అక్షరానంద భారతీ స్వామి వారితో పరిచయం కలగడమే భాగ్యం అనుకున్న నాకు, వారు ఈ పుస్తకానికి ఆశీస్సులనందించడం

నా గురుదేవులు శ్రీసుందరమూర్తి, గురుపత్ని శ్రీమతి సూర్యకళ, శ్రీ రావినూతల శ్రీరాములు, శ్రీ వై. కృష్ణకుమార్ - వీరందరి చలవే. వారందరికీ ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ పుస్తకానికి ఇంత అందమైన రూపాన్ని ఇవ్వడంలో ఎప్పటిలాగానే ఎంతో శ్రద్ధ తీసుకున్న శ్రీ ముత్యాల రామారావుగారికి కూడా నా కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి అడిగినంతనే ఇంద్రాణీదేవి చిత్రాన్ని వేసి ఇచ్చిన కళాతపస్వి, కళాప్రపూర్ణ, పద్మశ్రీ బాపుగారికి ఆజన్మాంతం ఋణగ్రస్తుడను.

ఈ సప్తశతికి నేనిచ్చిన సరళమైన భావం ఆంధ్రభూమి దినపత్రికలో ప్రచురించినంత కాలమూ అనేకానేకమంది పాఠకులు స్వయంగా ఫోన్లు చేసి అభినందించడం నాకు ఇంతకు ముందెపుడూ కలగనట్టి అపూర్వమైన అనుభవం. వారిలో కొందరు ఈ ఇంద్రాణీ సప్తశతి చదివాక వారికి కలిగిన అనుభూతులను నాకు చెప్పడం కూడా నాకు ఆనంద దాయకమైంది. ఈ విధమైన అభినందనాపరంపరను అందించి, నన్ను ఆశీర్వదించిన వారందరికీ నా కృతజ్ఞతలు.

మా నాయనగారు స్వర్గీయ వి.ఎస్. వేంకటనారాయణ దేవీశక్తినే ఆరాధించే వారు. నాకు తెలిసి మా నాయన గారి తొలి గురువు భగవాన్ రమణులే. అందుకే ఆ నాయన వ్రాసిన ఇంద్రాణీ సప్తశతికి నేను సరళమైన భావాన్ని వ్రాసి మా నాయన గారికే అంకితం చేస్తున్నాను.

**డా॥ వి.వి. వేంకట రమణ**
హైదరాబాద్



# విషయ సూచిక

## 4. బార్హతం శతకం



## 5. పాంక్తం శతకం



## 6. త్రైష్టుభం శతకం



## 7. జాగతం శతకం



భగవాన్ శ్రీ రమణ మహర్షి



కావ్యకంఠ శ్రీ వాశిష్ఠ గణపతి ముని



దేవీ ఉపాసకులు శ్రీ వి.ఎస్. వేంకటనారాయణ
మా నాయన. వారికి ఈ రచన అంకితం

- వి.వి. వేంకటరమణ

ఓమ్

# కావ్యకంఠ వాశిష్ఠ గణపతి ముని రచించిన
# ఇంద్రాణీ సప్తశతి

ఇంద్రాణీ సప్తశతి అనేది 700 శ్లోకాలున్న మహత్తరమైన (స్తోత్ర కావ్య) రచన. దీనిని వ్రాసిన వారు కావ్యకంఠ వాసిష్ఠ గణపతిముని. భగవాన్ రమణ మహర్షికి ఆ పేరు ఇచ్చింది గణపతి మహామునియే. ఆ మహర్షిచేత "నాయన" అని పిలిపించుకున్న మహానుభావుడాయన. గణపతి ముని 1878 నవంబరు 17న జన్మించారు. 1936 జూలై 25న సిద్ధిని పొందారు.

బొబ్బిలికి సమీపాన ఉన్న కలువరాయి గ్రామం ఎంతో పుణ్యం చేసుకుంది గనకే అది గణపతిమునికి జన్మస్థలమయింది. వీరి జననానికి ముందు వీరి తల్లిదండ్రులకు కొన్ని దివ్య సందర్శనాలు లభించడం వల్ల, వారు తమ పిల్లవానిని తమ ఇష్టదైవమైన గణపతి అంశగా భావించి, "సూర్యగణపతి శాస్త్రి" అని పేరు పెట్టారు. కాలక్రమంలో ఆ బాలుడు తన గోత్ర ఋషి పేరును కలుపుకుని తన పేరు "వాసిష్ఠ గణపతి శాస్త్రి" అని చెప్పుకోనారంభించాడు.

వంగదేశం (బెంగాల్) లోని నవద్వీప నగరంలో పాండిత్య పరీక్షల కోసం జరిగే పండిత సభలో పండితులందరినీ అబ్బురపరిచే రీతిలో గణపతి శాస్త్రి తన ప్రతిభను చూపాడు. అక్కడ ఒక వృద్ధ పండితుని చూసి ఎవరీయన అని తన పక్కన వారిని గణపతి శాస్త్రి అడిగాడట."అతడే పరీక్షాధికారి, ఆశుకవి, అంబికాదత్తుడు" అని పక్కనున్న వ్యక్తి బదులిచ్చాడట. ఇంతలో అంబికాదత్తుడే వచ్చి, "నేను ఆశుకవితా జనకుడను, గౌడుడను. నా పేరు అంబికాదత్తు" అని సంస్కృతంలో చెప్పగా, గణపతి దానికి ఏమాత్రం తడబడకుండా, "నేను కవికులానికి అధిపతిని. అతి దక్షుడను. దాక్షిణాత్యుడను. నా పేరు గణపతి" (నీవు కేవలం అంబికకు దత్తుడవు మాత్రమే. నేను సాక్షాత్తూ అంబికకు పుత్రుడను అని గణపతి శాస్త్రి చేసిన చమత్కారం అంబికాదత్తుడికి నాయన పాండిత్య ప్రతిభను తెలియకనే తెలిపింది) అని సంస్కృతంలోనే జవాబిచ్చాడు. ఆ తరువాత ఆ సభ పెట్టిన పరీక్షలన్నిటిలోనూ గణపతి శాస్త్రి తన ప్రతిభ చాటి, తన అసమాన ప్రతిభతో అందరినీ ముగ్ధుల్ని చేశాడు. ఆ విద్వత్పరిషత్తు గణపతి శాస్త్రికి కావ్యకంఠ బిరుదునిచ్చి సత్కరించింది. ఇది 1900 జూన్ 20న జరిగిన సంఘటన. అలా గణపతి శాస్త్రి పండితుల మహాసభలో తన అసమాన ప్రతిభను కనబరిచి "కావ్యకంఠ" బిరుదును పొందాడు. కావ్యకంఠ గణపతిగా ప్రసిద్ధికెక్కాడు.

తన 10వ ఏటనే పంచాంగ గణనలో విశుద్ధి ప్రకరణమనే కొత్త మార్గాన్ని కనిపెట్టాడు. జ్యోతిష్య ఫలాలను చెప్పడంలో సిద్ధహస్తుడైనాడు. "పాండవ ధార్త రాష్ట్ర సంభవం" అనే ఖండకావ్యాన్ని సంస్కృతంలో రచించాడు. తన గురువుకే గురువైనాడు. తల్లిదండ్రుల విశ్వాసానికి తగిన రీతిలో తన చిన్ననాడే గణపతి శాస్త్రి అసాధారణమైన వాక్సిద్ధినీ, ఆశు కవితా ప్రజ్ఞనూ ప్రదర్శించాడు. బాల గణపతి ఈశ్వరానుగ్రహం పొందాలని 16వ ఏట నుండి తపస్సు చేయనారంభించాడు. అచిరకాలంలోనే భువనేశ్వరీమాత అనుగ్రహాన్ని, ఈశ్వరానుగ్రహంతో నిర్విషయ ధ్యాన యోగాన్నీ పొందాడు. అయినా తృప్తి చెందక నిజ తపస్స్వరూపాన్ని అనుభవంలోకి తెచ్చుకోవాలని సుమారు 12 ఏళ్లు తపస్సు చేశాడు. కానీ అది సిద్ధించలేదు. భగవత్ప్రేరణ పొంది అరుణాచలానికి వెళ్లాడు. అక్కడ 1907లో కృత్తికోత్సవాలలో ధ్యాన దీక్షను చేపట్టాడు. ఈశ్వరానుగ్రహం కలిగింది. అది గణపతిపైనే కాదు. అక్కడే 12 ఏళ్లుగా తపస్సులో ఉన్న ఒక బ్రాహ్మణ స్వామిపై కూడా పడింది. ఆ బ్రాహ్మణస్వామినే తన ఆధ్యాత్మిక గురువుగా స్వీకరించి, ఆయనకు భగవాన్ రమణ మహర్షి అనే పేరు పెట్టాడు. అంతేకాదు, ఆ పేరును అంగీకరించమని ప్రార్థించాడు. దాంతో ఆ బ్రాహ్మణస్వామి "అలాగే నాయనా" అనడంతో గణపతి శాస్త్రికి నాయన అనే పేరు స్థిరపడింది. నాయనది గణపతి అంశ అని, రమణులది కుమారస్వామి అంశ అనీ చెబుతారు.

గణపతిముని తనకు రమణ మహర్షిని గురువుగా ప్రసాదించిన తల్లి పార్వతీదేవికి కృతజ్ఞతాసూచకంగా ఒక కావ్యాన్ని రచించి సమర్పించదలిచారు. అదే ఉమా సహస్రం. దీనిని 20 రోజుల్లోగా రచించి పూర్తి చేస్తానని నాయన ప్రతిజ్ఞ చేశారు. కార్తీక బహుళ షష్ఠి, మంగళవారం (20-11-1907) నాడు రచనకు శ్రీకారం చుట్టారు. ఈ స్తోత్ర కర్మ ఫలంగా నాయన రమణుల సుబ్రహ్మణ్య తత్వాన్ని దర్శించాలని ఆశించారు. ఒకరోజు నాయన భారతదేశంలో నాటి క్షుద్బాధను తలుచుకుని (ఇప్పటికీ ఈ సమస్య సజీవంగానే ఉంది) ఆ బాధను నివారించమని దేవిని అర్థిస్తూ, "ఛిన్నాం భిన్నాం సుతరాం సన్నామిన్నా భావాదచితః ఖిన్నాం" (ఇదే ఇంద్రాణీ సప్తశతిలో 4వ శతకం, 4వ స్తబకం, 24 వ శ్లోకం) అని ఒక పాదం వ్రాసేసరికి దేశంలోని ఆకలంతా తనకే వచ్చినట్లు నాయనకు అనుభవమైంది. అపుడు సమయం సరిగ్గా 7 గంటలు. నాయన రచనను ఆపి ఆ పరదేవతా స్మరణలో మునిగిపోయారు.

సరిగ్గా అదే సమయంలో రమణ భక్తురాలైన ఎచ్చమ్మాల్ ఇంటి దగ్గర ఒక విచిత్రం జరిగింది. ఆమె పొయ్యి మీద వేర్వేరు గిన్నెల్లో పప్పు, బియ్యం వేసింది. ఇంతలో ఒక స్త్రీ ప్రత్యక్షమై, "ఓ భక్తురాలా, గుహలో వ్రతబంధ దీక్షాపరుడైన ముని ఆకలితో బాధపడుతున్నాడు. అన్నం కోసం ఎదురుచూస్తున్నాడు. వెంటనే పంపు. ఐతే, **'ఈ దినం విశేషమేమి?'** అని ఈ అన్నం తీసుకుని వెళ్లేవారిని అతనిని అడగమను!" అని చెప్పి అదృశ్యమైపోయింది. తిరిగి చూసేసరికి అన్నం, పప్పు ఉడికి సిద్ధంగా ఉండటంతో ఎచ్చెమ్మాళ్‌కు ఆశ్చర్యం కలిగింది. ఇంతలో ఒక విద్యార్థితో అన్నాన్ని, పప్పునీ పంపి, నాయనను అడగాల్సిన ప్రశ్న కూడా చెప్పి పంపింది. ఆ విద్యార్థి తెచ్చిన అన్నాన్ని చూడగానే నాయన

ఆకలి మాయమైంది. కానీ తెచ్చిన తిండి వ్యర్థం కాకూడదని కొద్దిగా తిని పంపేశారు. ఎచ్చెమ్మాళ్ అడగమన్న ప్రశ్నకు నాయన నవ్వి 'క్షుత్తే విశేషమ'ని బదులు చెప్పి ఆ బాలుడిని వెనక్కి పంపారు. కొంతసేపటికి వచ్చిన ఎచ్చెమ్మాళ్ ద్వారా జరిగినదంతా విని, దేశంలో శత్రువుల వల్ల ఏర్పడిన క్షుద్బాధను తీర్చడానికి ఆ పరదేవత సిద్ధంగా ఉందని తెలుసుకుని నాయన సంతోషించారు.

ఉమాసహస్ర దీక్ష ఇక నాలుగే రోజులుందనగా నాయన కుడిచేతి బొటనవేలికి గోరుచుట్టులాంటి పుండొకటి వచ్చి, రచన ఏమాత్రం ముందుకు సాగలేదు. 19వ రోజు సాయంత్రానికి ఇక నాలుగోవంతు గ్రంథం అలాగే మిగిలిపోయి ఉంది. అంటే 250 శ్లోకాలు ఇంకా పూర్తి కావలసి ఉంది. 20వ రోజు వైద్యుడు వచ్చి నాయన వేలుకు శస్త్ర చికిత్స చేసి కట్టు కట్టాడు. ఐనా తగ్గలేదు. వేదాంత ఆగమ శాస్త్ర రహస్యాలతో ఉమా సహస్రం అప్పటికే 750 శ్లోకాలతో అద్భుతంగా రూపొందింది. కేవలం 250 శ్లోకాలు కాలేదని, తన ప్రతిజ్ఞకు బద్ధుడై అప్పటిదాకా వ్రాసిన వాటిని చించేయవద్దని నాయనను భక్తులంతా ప్రార్థించారు. అది విన్న నాయన మిగిలిన భాగాన్ని ఆశువుగా పూర్తి చేశారు. అదీ ఎంతో అద్భుతంగా. అది ఎలాగంటే, ఆ రోజు రాత్రి అప్పటికే 8 గంటలైంది. తాను చెప్పింది వ్రాయడానికి ఐదు మందిని రాత సామగ్రితో సిద్ధం చేసారు. ఇంతలో రమణ మహర్షి వచ్చి నాయన వెనకగా కూర్చుని ధ్యానముద్రలో ఉండిపోయారు. 25 శ్లోకాల చొప్పున మొత్తం 10 స్తబకాలు (1000 పాదాలు) మిగిలి ఉన్నాయి. నాయన ఐదు మందికి ఐదు స్తబకాలు ఏకకాలంలో ఒక్కో పాదాన్ని వరసగా, ఆశువుగా చెబుతూ మొత్తం 200 నిమిషాల్లో పూర్తి చేసేశారు. అంటే 250 శ్లోకాలను ఆశువుగా 200 నిమిషాల్లో పూర్తి చేశారు. అందరూ సంతోషపడ్డారు. ఇంతలో, రమణ మహర్షి ధ్యానం లోంచి మేల్కొని, **'నేను చెప్పినవన్నీ సరిగ్గా వ్రాశారా?'** అని అడిగారు. దాంతో నాయన తాను అనుకున్న సుబ్రహ్మణ్య **తత్వం** వెల్లడైందని తెలిసి సంతోషించారు. వెంటనే రమణ మహర్షితో **'చిత్తం! మీరు నాకు చెప్పినదంతా శ్రద్ధగా గ్రహించి ఇపుడే రచన పూర్తి చేశాను!'** అని సమాధానం ఇచ్చారు. దాంతో, సంతోషించి **'మంచిది!'** అని అక్కడ నుంచి రమణులు వెళ్లిపోయారు.

ఉమాసహస్రాన్ని ఎనిమిదిసార్లు సంస్కరించారు నాయన. ఐతే ఆయన సంస్కరించింది మొదటి 750 శ్లోకాలే. చివరి 250 శ్లోకాలు రమణ మహర్షి ప్రత్యక్ష సాన్నిధ్యంలో పూర్తి అయినందువల్లనేమో, ఆ 250 శ్లోకాల్లో మాత్రం ఎలాంటి మార్పులనూ చేయలేదు. అది తన గురువాక్కు ప్రసాదంగా నాయన భావించారు. ఇలా తమ తల్లియైన ఉమాదేవికి తనయులిద్దరూ (గణపతి, రమణ) తమ వాక్కుతో అర్పించిన నీరాజనమే ఉమా సహస్రమనే స్తోత్రమాలిక. ఒక్కమాటలో చెప్పాలంటే రమణగణపతుల మధ్య జరిగిన శక్తి ప్రవాహమే ఉమా సహస్రం. సహస్రార శక్తి ప్రవాహమే ఉమా సహస్రం. ఉమా సహస్ర రచన గురించి ఇక్కడ ఎందుకు చెప్పాల్సి వచ్చిందీ అంటే, రమణ, గణపతుల మధ్య జరిగిన ఆ "శక్తి ప్రవాహాన్నే" నాయన ఇంద్రాణీ సప్తశతిలో ప్రవేశపెట్టారు. నాయన తాను స్వయంగా అనుభవించిన శక్తి ప్రవాహాన్ని (కుండలినీ శక్తి) కూడా కొన్ని స్తబకాల్లో వ్యక్తం చేశారు.

ఇవి యోగసాధకులకెంతో వినియోగిస్తుంది. జ్యోతిశ్శాస్త్ర, మంత్రశాస్త్ర, ఆయుర్వేద రహస్యాలనూ నాయన ఇంద్రాణీ సప్తశతిలో పొందుపరిచారు.

భారత జాతి సముద్ధరణకు గణపతిముని నిత్యమూ లోలోపలే పరితపించేవారు. అరుణాచలంలో ఉపాధ్యాయవృత్తిని చేపట్టాక తన విద్యార్థులకు వేద రహస్యాల ప్రాముఖ్యతను వివరించి చెప్పేవారు. మన పూర్వ ఋషుల గురించి సరైన అవగాహన కలిపించేవారు. పాశ్చాత్యులు మన వేషభాషలను ఎలా పరిహసిస్తున్నారో, ఎలా మనలను నవ్వులపాలు చేస్తున్నారో చెప్పి, అందరూ దేశ స్వాతంత్ర్యానికి ఎలా సమాయత్తం కావాలో బోధించారు. మన దేశం, మన జాతి సర్వారిష్టాల నుండి ముక్తి పొందాలని, పొందుతుందనీ చెప్పారు. దాని కోసం ఈశ్వరానుగ్రహాన్ని పొందడానికి తన తపఃఫలాన్ని ధారపోయడానికి ఆయన సిద్ధపడిన రీతి పలువురిని ఆకర్షించింది. ఆయన ఎందరికో మంత్ర దీక్షనిచ్చారు. శిష్యుల ప్రార్థన మేరకు **"ఉమాం వందేమాతరం"** అనే మంత్రాన్ని ఉపదేశించారు.

నాయనకు 12వ ఏటనే విశాలాక్షితో వివాహం అయ్యింది. ఆమె కూడా మహాసాధ్వి కావడంతో భర్తకు తగిన భార్యగా నిలిచింది. భర్త వద్ద శ్రీవిద్యా దీక్షను పొందింది. వేలూరులో కొంత కాలం పనిచేశాక ఆయనకు తన ఉద్యోగంపై విసుగు పుట్టినా, భార్య ఒక్క సంతానం పుట్టేవరకైనా వేచి ఉండమని వేడింది. ఆ తరవాత ఒక కల ఫలితంగా తన వేలూరు నివాసాన్ని పొడిగించారు, నాయన. ఆ కలలో తన పూర్వజన్మలో తన సఖుడైన భద్రకుడు కనిపించి, "తన దేహ యాత్ర ముగిసిందని, గణపతిని జాగ్రత్తగా ఉండమనీ" చెప్పాడు. అంతే కాదు, **"ఇకపై నీ తపస్సుతో ఈ సంఘం చలిస్తుంది!"** అని చెప్పాడు. ఆ మరునాడే వార్తాపత్రికలో దివ్యజ్ఞాన సమాజ అధ్యక్షుడైన కల్నల్ ఆల్కాట్ చనిపోయిన వార్తను చదివి అతనే భద్రకుడని తెలుసుకుని నాయన ఆశ్చర్యపోయారు.

వేలూరు దగ్గరే ఉన్న పడైవీడు క్షేత్రంలో రేణుకాదేవిని దర్శించిన నాయన అక్కడ తాను వ్రాసిన **ఉమా సహస్రాన్ని** పఠించి, దానిని సంస్కరించే పనికి పూనుకున్నారు. రేణుకాదేవి మహిమపై అపారభక్తి, నమ్మకం కలిగిఉండటంతో గణపతిని ఎన్ని అపవాదులు చుట్టుముట్టినా అవి ఆయనను ఏమీ చేయలేకపోయాయి (జమదగ్నిలో ఇంద్రుని శక్తి అవతరించగా, అతని భార్యయైన రేణుకాదేవిలో ఇంద్రాణీదేవి శక్తి అవతరించింది. కార్తవీర్యార్జునుడు చేసిన దుశ్చర్య వల్ల పరశురామునిలో ఆ రెండు శక్తుల తత్వాలూ కార్యరూపాన్ని చెందినాయి. ఆపదలను దాటించడంలో పటుతర శక్తి రేణుకమ్మది. ఆమె షష్ఠ మహావిద్యా స్వరూపిణి. ఆమెకే ఛిన్నమస్త, చండి, ప్రచండ చండి, వజ్రవతి అనీ పేర్లున్నాయి). ఆ శక్తియే బ్రిటిష్ పోలీసుల నుంచి ఆయనను కాపాడింది. ఆ సమయంలోనే గణపతి రేణుకాదేవిపై వరగీతమాలను ఆశువుగా చెప్పారు. ఆ ఆపద సమయంలోనే అప్పటికే వ్రాసిన ఉమా సహస్రాన్ని పోలీసుల నుంచి రక్షించడం కోసం ఆయన శిష్యుడు దానిని నదీగర్భంలో దాచిపెట్టాడు. కానీ అది తర్వాత అదృశ్యమైపోయింది. తన స్తుతిని దేవి స్వీకరించినట్లు భావించారు నాయన.

ఆ తరవాత రమణుల ఆశీర్వాదం కోరి, దేవి కోసం 40 రోజుల దీక్షను పట్టాడు.

40వ రోజు శవాసనంలో ఉండగా, రేణుకాదేవి ప్రసన్నమైంది. **"నిశ్చలమైన మనస్సుతో ఎపుడైతే ఉంటావో, 20 రోజుల్లోగా నీవు నిశ్చయంగా సిద్ధిని పొందుతావ"** ని ఆశీర్వదించింది. ఆ తర్వాత నాయన అనేక క్షేత్రాలను దర్శించారు. కాలడి దర్శనం చేసుకుని, ఆ తర్వాత ఉడిపి దర్శించారు. అక్కడ పీఠాధిపతుల కోరికపై ద్వైతాద్వైత, విశిష్టాద్వైత తత్త్వాల వివరణ, స్థూలదృష్టికి వాటిలో కనిపించే బేధాలు, తర్క బుద్ధితో వాటికి సమన్వయం - సర్వజన ప్రయోజకారిగా ఉండేలా 1 గంటలో 100 శ్లోకాలను ఆశువుగా చెప్పారు. ఏక కాలంలో పదిమంది లేఖకులకు ఒక్కొక్కరికి ఒక్కొక్క పాదం చెబుతూ పూర్తి చేసిన ఈ శ్లోక సంపుటి ఆ తరువాత "తత్త్వ ఘంటా శాసనం" అనీ, "ఘంటా శతకం" అనీ వ్యాప్తిలోకి వచ్చింది.

1912లో గోకర్ణం చేరి, అక్కడ జ్యోతిష శాస్త్రజ్ఞుల కోరిక మేరకు **పరాశర సంహిత** లోని సందేహాలను నివృత్తి చేస్తూ **"లఘు సంహిత"** అనే గ్రంథాన్ని వ్రాసి ఇచ్చారు. ఇక్కడే గణేశ భట్టు అనే వ్యక్తి గణపతిమునికి శిష్యుడైనాడు. ఇతనినే ముని, **'దైవరాతుడ'**ని పేర్కొన్నారు. ఆ తరువాత అనేక పట్టణాలు, క్షేత్రాలు తిరిగి తిరువణ్ణామలై చేరాడు. 1917 జూలై 7వ తేదీ నాడు హృదయ కుహర శ్లోకానికి ఉపనిషద్ రూపాన్నిచ్చే రచనను ఆరంభించారు. అదే 1917 దేవీనవరాత్రులకు **"రమణ గీత"** గా రూపొందింది. మొత్తం 300 శ్లోకాలతో ఈ రచన సకలశాస్త్ర సారంగా రూపొందింది. ఆతరువాత అరసవిల్లికి వెళ్లినపుడు **"సూర్య గీతమ"** నే స్తుతి చేశారు. అదే ఆ తరువాత **"గీతమాల"** లో చేరింది. కొద్ది రోజులపాటు సికిందరాబాద్‌లోనే ఉండి చెన్నై చేరారు. అక్కడ పండితుల కోరిక మేరకు యోగ విద్యా స్వరూపాలనూ, సాధన రహస్యాలనూ క్లుప్తంగా గుర్తుంచుకునే రీతిలో కొన్ని సూత్రాలను వ్రాసి ఇచ్చారు. అదే ఆ తరువాత **"రాజయోగసారం"** అనే గ్రంథంగా ప్రాచుర్యంలోకి వచ్చింది.

1922లో తిరువణ్ణామలై చేరి తిరిగి ఉమాసహస్రాన్ని సంస్కరించే పనిలో మునిగి పోయారు. అలా పరిష్కరించడం అప్పటికి ఏడవ సారి. దానిని విజయవంతంగా పూర్తి చేశారు. అటువంటి సమయంలో ఒక రోజు నాయన దీక్షపూని ఉండగా ఆయనకొక వింత అనుభవం ఎదురైంది. నిర్మలమైన ఆకాశంలో ఒక **మెరుపు** తళుక్కున మెరిసింది. దాని వెంట ఒక **దివ్య శబ్దం** వినవచ్చింది. అవి ఇంద్రాణీదేవి సంబంధించినవని నాయనకు స్ఫురించి, **"అరెరె, ఇన్నాళ్లూ ఆమె శక్తిని స్తుతించలేదే?"** అని తన పొరబాటును గుర్తించారు. ఎందుకంటే, లోగడ పడైవీడులో, మహేంద్రగిరిలో, విరూపాక్ష గుహలో చూపిన కటాక్ష అనుగ్రహాలకు అంతకాలంగా ఉమాదేవిని స్తుతించినట్లు, ఇంద్రాణీదేవిని ఎపుడూ స్తుతించలేదు. ఈ విషయాన్ని గుర్తించిన నాయన వెంటనే ఇంద్రాణీదేవిని స్మరించి ఇలా ప్రతిజ్ఞ చేశారు - **"ఏ మహాశక్తి అయితే నా మీదా, విశాలాక్షిమీదా, మావలె గిరి రూపంలో ఉన్న శివశక్తుల మీదా మూర్ఖ పళని సాధువు కల్పించిన అపవాదును పిడుగు రూపంలో తుడిచి వేసిందో, ఏ మహాశక్తి ఉమా సహస్రాన్ని శత్రువుల నుంచి రక్షించి స్వయంగా స్వీకరించి ప్రీతి చూపిందో, పడైవీడులో ఏ మహాశక్తి రేణుకాదేవి రూపాన్ని ధరించి తన విచిత్ర దర్శనంతో తనను అనుగ్రహించి వజ్రాస్త్ర**

**మంత్రాన్ని బుద్ధికి ప్రదర్శించిందో, అటువంటి అనుగ్రహ దేవతాశక్తియైన ఇంద్రాణిని స్తుతించడానికి 700 శ్లోకాలతో కూడిన ఒక గ్రంథాన్ని వ్రాసెదను గాక. దీని కొరకు 20 రోజులు దీక్ష పూనెదనుగాక. ఇది గ్రీష్మఋతువే అయినా నిర్మలాకాశంలో దివ్య తేజస్సునెలా చూపిందో, నా రచనకు ఆమె ప్రీతిచెందితే, అదే రీతిన రోజూ మెరుపును చూపించు గాక. ఏ రోజున నా రచన ముగిసినపుడు మెరుపు కనిపించదో, ఆ రోజు వ్రాసిన భాగాన్ని చించివేసి, చివరకు దీక్షాకాలానికి గ్రంథం పూర్తికాకుంటే మొత్తం గ్రంథాన్నే చించివేయుదును గాక!".**

అలా ప్రతిజ్ఞ చేసిన నాయన, **ఇంద్రాణీ సప్తశతి** రచనను చేయాలని సంకల్పించి రమణమహర్షి ఆశీర్వాదాన్ని పొందారు. ఈ గ్రంథంలో కూడా ఉమాసహస్రంలో లాగానే ప్రతి 25 శ్లోకాలనూ ఒక స్తబకంగా, 4 స్తబకాలను ఒక శతకంగా రూపొందించారు. స్తబకం అంటే గుత్తి, శ్లోకాలమాల. ఒక్కో స్తబకం ఒక్కో వృత్తంలో ఉండేలా చిత్రవిచిత్రమైన గమకాలను ఊహించి వైదిక ఛందోబద్ధంగా వ్రాశారు. ప్రతి స్తబకంలోనూ తొలి శ్లోకంలో **ఇంద్రాణీదేవి మందహాసాన్ని స్తుతిస్తూ**, ఈ భూమి మీద ఆ ధరహాసం ఎన్ని లక్షణాలచేత వ్యక్తమవుతూ ఉందో పేర్కొని, విశ్వంలోని జడత్వాన్ని పొందిన చైతన్యశక్తి భాగాన్ని పలువిధాలుగా ప్రదర్శిస్తూ ఆమె విశ్వరూపాన్ని చిత్రించాలని సంకల్పించారు. అంతే కాదు, ప్రతి రెండవ శ్లోకంలోనూ మన భారతదేశ దుస్థితిని దేవికి విన్నవిస్తూ, 24వ శ్లోకంలో దానిని ఎదుర్కొనే శక్తిని ఇమ్మని అర్థించి, వైదిక భారతదేశ అభ్యుదయం కోసం, అవైదిక తిమిర సంహారం కోసం ఆ వైదిక దేవతయైన ఇంద్రాణీదేవి స్తుతి ఫలాన్ని అర్థిస్తూ రచనకు ఉపక్రమించారు.

ఇంతలోనే నాయనకు విపరీతమైన తలనొప్పి రావడంతో రమణులకు ఆ విషయాన్ని విన్నవించారు. అది విన్న రమణులు మౌన సమాధిలోకి వెళ్లారు. ఆ రాత్రి గణపతిమునికి **కపాలభేధనం** అనుభవంలోకి వచ్చింది. కపాలభేధనం అనుభవంలోకి రాకముందు, వచ్చాక తాను అనుభవించిన స్థితికి ఛందోబద్ధంగా శ్లోక రూపాన్నిచ్చారు నాయన. దానిని ఎనిమిదవసారి ఉమాసహస్రాన్ని సంస్కరించినపుడు అందులోకి జొప్పించారు. ఈ **కపాల భేదనానుభవాన్నుంచి** బయటకు వచ్చి సాధారణ స్థితికి రావడానికి నాయనకు దాదాపు 15 రోజులు పట్టింది. దీని తరువాత ఇంద్రాణీ సప్తశతి స్తుతి కావ్య రచనకు నాయన శ్రీకారం చుట్టారు. ఇంద్రాణీదేవి గ్రంథి భేదినీశక్తి. ఆమె అనుగ్రహం వల్ల రుద్రగ్రంథి విభేధమై, శీర్షకపాలాలు భిన్నమవడాన్ని నాయన అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు. ఆ యోగసిద్ధి వల్ల **ఇంద్రాణీ విద్య** అనే మహామంత్రఫలం సిద్ధించినట్టు నాయన భావించారు. అంతే కాదు. తన కుండలినీశక్తి ఎలా సహస్సు నుండి మహస్సుగా మారిందో (అంటే, ఉపాధితో కూడిన తేజస్థితి నుండి విడిపోయి, దానిని ఆశ్రయించక సుషుమ్నా నాడిలో మేల్కొన్న జ్యోతిర్మయ స్థితిని పొందడం) నాయన అనుభవ పూర్వకంగా తెలుసుకున్నారు.

సుషమ్న నాడిలో నిద్రించే కుండలినీశక్తి మేల్కొని హృదయ గ్రంథిని భేదించుకని అహానికి మూలమైన ఆత్మలో స్థిరత్వాన్ని పొందాల్సి ఉంది. అపుడే యోగి జీవన్ముక్త

దవుతాడు. అటువంటి స్వస్వరూప సిద్ధినే **చివరి సిద్ధి** అంటారు. **రేణుక** పేరున్న **ఇంద్రాణీదేవి** అటువంటి పరమార్థ సిద్ధిని నాయనకు అనుగ్రహించింది. ఆ తల్లినుద్దేశించి నాయన ఆరంభించిన రచన 700 శ్లోకాలతో అనుకున్న 21 రోజుల వ్యవధిలో పూర్తి అయింది. నాయన ప్రతిజ్ఞానుసారం ఇంద్రాణీదేవి ఆ స్తుతికి ప్రసన్నురాలై రచనాకాలంలో ప్రతి సాయంకాలమూ విద్యుత్పరంపరల మెరుపులను ఆకాశంలో చూపించింది. రచన పూర్తి చేశాక నాయన తన భార్య, శిష్యులతో పడైవీడులోని రేణుకా క్షేత్రాన్ని దర్శించి అక్కడ ఇంద్రాణీ సప్తశతిని పఠించారు. సాక్షాత్తూ ఆ తల్లి విన్న రీతి అక్కడ ఉండిన వారందరికీ అనుభవంలోకి వచ్చింది.

ఈ ఇంద్రాణీ సప్తశతి రచనాకాలంలోనే రమణ మహర్షి తల్లి అళగమ్మ పరమ పదించారు. నాయనలో రుద్రగ్రంథి భేదించి అమృతధారోదయాన్ని కలిగించినట్లే, అళగమ్మకు రమణ మహర్షి హస్తాల ద్వారా శక్తి ప్రసరించి ఆమెకు అమృతత్వాన్ని ప్రసరింప జేసింది ఇంద్రాణీశక్తి. ఆజ్ఞాచక్రంలో ఉండే ఆ ఇంద్రాణీ శక్తి, రమణుల హస్త ద్వయంలో ఉందని నాయనకు గోచరించింది. అళగమ్మ రమణునిలో జ్ఞానబోధ కార్యప్రబోధినీ దేవతాంశగా, అతనికి కార్యోపాధిగా కాదగ్గ ఒక దివ్య ఆశ్రమాన్ని ఏర్పాటు చేయబోతున్న విషయం నాయనకు గోచరించింది. అలా జ్ఞాన సంస్కార భారాన్ని మోసే రమణునికి లోకహిత కార్యంలో తోడ్పడటానికి నాయన – తనలో సంఘసంస్కార శక్తినీ, ఇతర మతాల నుంచి భారతీయులను రక్షించి, వారిలో ఋషి సంప్రదాయ సిద్ధమైన, వీర్యవంత మైన సనాతన మతాన్ని నెలకొల్పే శక్తిని సమృద్ధిగా ఇమ్మని వేడుతూ తన ఇంద్రాణీ సప్తశతిలో ప్రవేశపెట్టారు. దానిని భారత భూరక్షణ కోసం నిర్మించిన స్తుతిగా నాయన రూపొందించారు. ఉదాహరణకు కొన్ని శ్లోకాలను పరిశీలిద్దాం.

> *శక్తాం దేవి విధే హ్యార్తానా మవనే ।*
> *ఇంద్రస్యేవ భుజాం వాసిష్ఠస్య మతిం ॥* *(1-3-24)*

ఓ ఇంద్రాణీ దేవీ, ఆర్తినొందిన వారిని రక్షించడానికి ఎలాగైతే నీవు ఇంద్రుని భుజాన్ని శక్తిమంతం చేస్తావో, ఆ విధంగా ఈ వాసిష్ఠుని బుద్ధిని కూడా శక్తిమంతం చేయి.

> *అస్త్రం మమ భవ ధ్వంసాయ రటతాం ।*
> *సుత్రామ తరుణి శ్రీమాతర సతాం ॥* *(1-4-22)*

ఓ సుత్రామ తరుణీ! శ్రీమాతా! నాకు అస్త్రంగా ఉండు. దుర్మార్గుల కొరకు (నానుంచి స్తుతి రూపంలో) ధ్వని చేయి.

> *భిన్నాం సంఘ సహస్రైః ఖిన్నాం శత్రుభరేణ ।*
> *పాతుం భారత భూమిం మాత ర్దేహి బలం నః ॥* *(2-2-24)*

అమ్మా! వేల కొలది సంఘాలుగా విడిపోయి, శత్రుభారంతో ఖిన్నురాలైన ఈ భారతదేశాన్ని రక్షించడానికి నాకు బలమివ్వు.

*శిరసీహసతః సితభానో । రమృతేన వపు ర్మద మేతి ।*
*హృదిభాత ఇనస్య చ భాసా । మతిమేతు పరాం శచి చేతః ॥*
*మమ యోగమదేన నతృప్తి । ర్నిజదేశ దశావ్యథితస్య ।*
*అవగంతు ముపాయ మమోఘం । శచి భాసయ మే హృదిభానుం ॥*

*(5-4-19,20)*

ఈ తలలో ఉండే చంద్రుని అమృత స్రావం వల్ల శరీరం మదమెక్కుతూ ఉంటే, హృదయంలో ప్రకాశించే సూర్యకాంతివల్ల చిత్తం జ్ఞానాన్ని పొందుతోంది. ఓ శచీదేవీ, ఈ భారతదేశ గతిని చూచి దుఃఖితుడనై ఉన్న నాకు యోగమదంతో తృప్తి కలగదు. అమోఘమైన దుఃఖ నివారణోపాయాన్ని తెలుసుకోవడానికి నా హృదయ సూర్యుని ప్రకాశింపజేయి.

– ఇలా ఎంతో గొప్పగా భారతదేశానికి స్వాతంత్ర్యం రాకముందు దేశాన్ని పరాయి పాలన నుంచి రక్షించమని తల్లి ఇంద్రాణిని వేడుతూ రూపొందించిన ఏడు శతకాలతో కూడిన మహా కావ్యమిది. శత్రు నాశనానికి, అనారోగ్య నిర్మూలనకీ ఇంద్రాణీ సప్తశతి అత్యంత అవశ్య పఠనీయ స్తోత్ర మంజరి. ఉమాసహస్ర పారాయణ వల్ల తపః ప్రబోధ మవడానికి సంకల్పించినట్లు, ఇంద్రాణీ సప్తశతి పారాయణవల్ల అంతర్బాహ్యా శత్రు నాశనాన్ని సంకల్పించారు నాయన.

ఇంద్రాణీ సప్తశతి ఎంత మహిమ కలిగిందో కుళువే గ్రామంలో జరిగిన ఒక చిన్న సంఘటన మనకు తెలియజేస్తుంది. శిరసి సమీపంలోని కుళువే గ్రామంలో గణపతి ముని ఉండిన సమయంలో ఒక శ్రీమంతుని కొడుకు (గణేశభట్టు) నాయన మంత్రమూర్తి అని తెలిసి, దర్శనం చేసుకున్నాడు. తన భార్యకు ఏదో సోకి, బట్టలను విసర్జించి, మతిలేని రీతిలో ప్రవర్తిస్తున్నదనీ, తన భార్యకు కలిగిన దుస్థితిని తొలగించి, ఆమెకు స్వస్థత కలిగించి తమను కాపాడమని వేడుకున్నాడు. నాయన ఒకసారి అలా తోటలోకి వెళ్లి తిరిగి వచ్చి ఆ శ్రీమంతుని భార్య ఉన్న గది వద్దకు వచ్చి, **"వస్త్రం ధరించి ఇటు రా!"** అని చెప్పారు. వెంటనే ఆమె బట్టలను ధరించి వచ్చి వినయంతో నాయనకు నమస్కరించి, **"నాకు పునర్జన్మనిచ్చారు. మీ పాదాలెపుడూ నా చిత్తమందు ఉండేలా చూడండి!"** అని ప్రార్థించి తన భర్తతో వెళ్లిపోయింది. ఆమె కొద్ది రోజులకు తిరిగి వచ్చి నాయనతో తన భర్తకు టైఫాయిడ్ వచ్చిందని, అది తగ్గటం లేదనీ చెప్పింది. అపుడు నాయన తనవద్ద ఉండిన ఇంద్రాణీ సప్తశతి ప్రతిని ఆమెకు ఇచ్చి రోగి పక్కన కూర్చుని దానిని పారాయణ చేయమని చెప్పారు. అంతే. ఒకే ఒక పారాయణతో గణేశభట్టు జ్వరం మాయమైపోయింది.

1923లో ఇంద్రాణీ సప్తశతిలోని 400 శ్లోకాలను ఉమాస్తుతితో కలిపి దానికొక తుది రూపునిచ్చారు నాయన. ఆ తరువాత ఉమాస్తుతిలో చేర్చని శ్లోకాలను ఇంద్రాణీస్తుతిలో ప్రవేశపెట్టి, మిగిలిన భాగాన్ని కొత్త కూర్పులతో పూరించి దానికొక చక్కని రూపును కలిగించారు నాయన. నాయన వ్రాసిన రచనలలో **మహావిద్యాది సూత్ర** గ్రంథావళి అనేది దశమహావిద్యలకు, గాయత్రీ – యోగాది ఇతర తత్వాలకూ, రాజయోగసారానికీ

వ్యాఖ్యలు. **పాండవ ధార్తరాష్ట్ర సంభవం, సున్యాదస్ర సంవాదం** అనేవి ఆయన రచించిన రెండు ఖండ కావ్యాలు. **సదాచార బోధిని, గీతమాల, తత్త్వఘంటా శతకం, విశ్వ మీమాంస, ఇంద్ర సహస్రనామ స్తోత్రం, భారత చరిత్ర పరీక్ష** అనేవి నాయన ఇతర రచనలు. నాయన రచించిన స్తోత్ర చతుష్కంలో ప్రచండచండీ, ఉమా, శివ, దేవీ స్తోత్రాలున్నాయి.

ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందీ అంటే, ఈ లోకంలో జరగాల్సిన సంస్కారం వివిధ రంగాలకు చెంది ఉండటం వల్ల దేవుడు ఎందరో మహాపురుషులను అవతరింపజేస్తూ ఉంటాడు. అలా అవతరించిన మహాపురుషులలో గణపతి ముని ఒకరు. గణపతి ముని అవతరించి మనకు రమణ మహర్షిని పరిచయం చేశారు. **ఇంద్ర స్తోత్రం, ఉమా సహస్రం, ఇంద్రాణీ సప్తశతి** వంటి మహా గ్రంథాలను మనకు అందించి మహోపకారం చేశారు.

దేశంలోని అనిశ్చితి, అల్లకల్లోల పరిస్థితులు, అశాంతి, అరాజకాల నుంచి దేశాన్ని రక్షించమని ఆ అమ్మవారిని వేడిన శ్రీ వాశిష్ఠ గణపతిముని వ్రాసిన ఈ ఇంద్రాణీ సప్తశతి నేడు భారతదేశంలో నెలకొని ఉన్న పరిస్థితుల దృష్ట్యా భారతీయులందరూ పఠించాల్సిన అవసరం ఎంతో ఉంది. కేవలం మన భారతదేశంలో సుఖశాంతులు నెలకొనడానికే కాదు, మన ఇళ్లలో అందరూ ఆరోగ్యంగా, ఆనందంగా, ఎలాటి శత్రుబాధలూ లేకుండా ఉండటానికి ఇంద్రాణీ సప్తశతి ఎంతో చక్కగా ఉపకరిస్తుంది.

దీనిని విడివిడిగా మనం మన ఇళ్లల్లో పఠించడంతో బాటు, సామూహికంగా మన అందరి ఆయురారోగ్యాల కోసం, దేశ రక్షణ, సుభిక్షతల కోసం పఠిస్తే చక్కని ఫలితాలు కలుగుతాయనడంలో ఎంత మాత్రం సందేహం లేదు.



# వైదిక ఛందస్సు

సాధారణంగా వేదాన్ని సాంగంగా తెల్సుకున్న తరువాతే స్వయంగా అర్థ జ్ఞానం కలిగేది. దానికి వ్యాకరణం ఒక్కటే కాదు. స్వర శాస్త్రమైన శిక్షా, మంత్ర స్వరూపం, పరిమాణం, ఋషి దేవతా అర్థ నిర్ణయన ప్రయోజనాలు, వినియోగమూ, బీజంలా ఉండే ఛందస్సు చాలా అవసరం. అందువల్ల, వేదాంగాన్ని చదివినా, ఛందంలో అనేక విషయాలు తెల్సుకోవాల్సి ఉంటుంది. ఈ వైదికఛందస్సే ప్రతి వేదానికీ కొన్ని విశేషాలను కలిగించింది. నేటి లౌకిక ఛందస్సులకు(అది ఏభాష అయినా సరే) వైదిక ఛందస్సులే మూలం. వాటికి వేదాలే మూలం. ఈ ఛందస్సు అనేది లయనీ, కదలికనీ ఇస్తుంది. ఛందస్సులో ప్రాథమికంగా ఏడు రకాల పద్య గమకాలున్నాయి (**తస్మాత్ ఏతాని సప్త చతురుత్తరాణి ఛందాస్యపాదధుః**). అవే గాయత్రి, జగతి, ఉష్ణికం, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి, బృహతీ అనేవి. ఇవి మూడు పొరల్లో సమతుల్యతను కలిగి, ప్రతి పొరలో 72 అక్షరాలు కలిగి ఉంటాయి. కింది పొరలో గాయత్రి, జగతీ ఛందస్సులు (ఒక దానిపై మరొకటి) చక్రాలుగా ఉంటాయి. వాటి మధ్య ఉండే బంధంలో లేదా బరువును మోసే వాటిల్లో అనుష్టుప్, పంక్తి ఉంటాయి. చివరగా పైభాగంలో ఉండే ఆసనంలో బృహతీ ఛందస్సు ఉంటుంది.

గాయత్రీ ఛందస్సు 24 అక్షరాలు కలిగి ఉంటుంది. జగతీ ఛందస్సు 48 అక్షరాలు కలిగి ఉంటుంది. ఉష్ణికం 28 అక్షరాలు కలిగి ఉంటుంది. త్రిష్టుప్ ఛందస్సు 44 అక్షరాలు కలిగి ఉంటుంది. అనుష్టుప్ ఛందస్సు 32 అక్షరాలు కలిగి ఉంటుంది. పంక్తీ ఛందస్సు 48 అక్షరాలు కలిగి కలిగి ఉంటుంది. బృహతీ ఛందస్సు 72 (36,36) అక్షరాలు కలిగి ఉంటుంది.

పింగళ సూత్రాల ప్రకారం వీటి ఛందశ్చక్రాలు ఇలా ఉంటాయి -

| ఛందస్సు | గాయత్రి | ఉష్ణిక్ | అనుష్టుప్ | బృహతీ | పంక్తి | త్రిష్టుప్ | జగతి |
|---|---|---|---|---|---|---|---|
| స్వరాలు | షడ్జ | ఋషభ | గాంధార | కృష్ణ | నీల | లోహిత | గౌర |
| దేవత | అగ్ని | సవితా | సోమ | గురు | మిత్రావరుణ | ఇంద్ర | విశ్వేదేవాః |

ఐతే, ఋక్ప్రాతి శాఖ్య ప్రకారం ఇవే కింద చెప్పినట్లు ఉంటాయి -

| ఛందస్సు | గాయత్రి | ఉష్ణిక్ | అనుష్టుప్ | బృహతీ | పంక్తి | విరాట్ | త్రిష్టుప్ | జగతి |
|---|---|---|---|---|---|---|---|---|
| దేవత | అగ్ని | సావిత్రీ | సౌమ్యః | బార్హస్పత్య | వాసవి | మైత్రావరుణ | ఐన్ద్రీ | వైశ్వదేవీ |
| వర్ణం | శ్వేత | సారఙ్గ | పిశఙ్గ | కృష్ణ | నీల | పృశ్ని | లోహిత | సువర్ణ |

లౌకిక కావ్య నిర్మాణానికి ఆదికవి వాల్మీకి. ప్రాకృతాది ప్రాచీన భాషలకు సమాంత

రంగా వైదిక భాషను సంస్కరించి ఏర్పర్చిన భాషలో రామాయణ రచన సాగింది. రామా యణ కావ్య రచనకు ముందు కూడా రెండు భాషలూ ఉండేవి. వ్యాకరణాలూ ఉండేవి. ఐతే, మానిషాద మా వంటి శబ్దాలతోనే లౌకిక భాష వచ్చిందని పెద్దల నమ్మకం. ఈ ఛందస్సుల ప్రస్తారం వల్ల లెక్కలేనన్ని వృత్తాలు వచ్చాయి. కొన్ని వృత్తాలు మాత్రం వేదాల నుంచే వచ్చాయి. పరిశోధకులు వాటి నుంచి కొన్నిటినే శాస్త్రోక్త వృత్తాలుగా మనకు చూపారు.

వీటికి లౌకిక ఉదాహరణలు ఇవీ -

గాయత్రీ - తనుమధ్యా
ఉష్ణిక - మదలేఖా
అనుష్టుప్ - విద్యున్మాలా, అనుష్టుప్
బృహతీ - హాలముఖీ
పంక్తిః - మత్తా
త్రిష్టుప్ - శాలినీ
జగతీ - తోటకం

శాస్త్రకారులు ఒక్కో వృత్తానికి వారికి ఇష్టమైన పేర్లను పెట్టారు. ఇంకో విశేషం ఏమిటంటే, ఈ ఛందస్సుల్లో కొన్ని ఒకదానితో మరొకటి పెనవేసుకుని ఉన్నాయి. గాయత్రీ కి 4 అక్షరాలు కలిస్తే అది ఉష్ణిక్ అవుతుంది. అంటే ఉష్ణిక్‌లో గాయత్రీ ఉంది. అలాగే, అనుష్టుప్‌లో ఉష్ణిక్ ఉంది. ఇక బృహతీలో త్రిష్టుప్ ఉంది. ఇలా ఒకదానితో మరొకటి కలిసిపోయి ఉంది. వీటన్నిటినీ ఈ ఇంద్రాణీ సప్తశతి కావ్యంలో గణపతి ముని చేసిన పద ప్రయోగాల్లో మనం చూడవచ్చు.

ఈ ఇంద్రాణీ సప్తశతిలో కుండలినీ యోగ రహస్యాలూ లేకపోలేదు. కుండలినీ, కులకుండ, కులకుండాగ్ని, చిచ్ఛక్తి, చిదగ్నికుండ, బ్రహ్మగ్రంథి విబేధిని, సుషమ్న నాడి, కపాల భేదన, సుషమ్న సంచారం వంటి ఎన్నెన్నో అంశాలు ఈ ఇంద్రాణీ సప్తశతిలో తెలియవస్తాయి.

కులకుండము (కురుకుండాలయా) అంటే మూలధార కర్ణిక మధ్యత బిందువు. చిదగ్నికుండాన్నే కులకుండా అంటారు. సుషమ్న నాడికి ఆలయస్థానంగా కలిగి ఉండేది ఇదే. అది శంకరాచార్యులు సౌందర్యలహరిలో (10వ శ్లోకం) ఇలా అన్నారు -

*అవాప్య స్వాం భూమిం భుజగ నిభ మధ్యుష్ట వలయం*
*స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి*

"స్వస్థానాన్ని పొంది పాములాగా చుట్టచుట్టుకుని ఉండే నిజస్వరూపాన్ని పూని, సూక్ష్మ రంధ్రాలున్న సుషమ్నా మూలంలోని ఆధార చక్రంలో నిద్రిస్తావు" - అని పై శ్లోకానికి అర్థం.

మూలాధారంనుంచీ సహస్రారం దాకా సంచరించేది కాబట్టే సుషమ్న కుల మార్గాన

కుండలాల్లో అమృత పడిగెల్లాగా ఉండేవే షట్చక్రాలు. వాటిలో నివసించేది కురు కుండాలయా. మరో సంగతి ఏమిటంటే, యోగశాస్త్రంలో సుషమ్నను కులం అంటారు. సుషమ్న ఆలయ స్థానమే కులకుండం. కులం, కులకుండం అనే పదాలు ఇంద్రాణీసప్తశతిలో చాలాసార్లు ప్రస్తావనకు వస్తాయి.

రమణ, గణపతుల మధ్య జరిగిన కుండలినీ శక్తి ప్రవాహాన్నే ఇంద్రాణీ సప్తశతిలో నాయన ప్రవేశపెట్టాడు. తాను స్వయంగా అనుభవించిన శక్తి ప్రవాహాన్ని (కుండలినీ శక్తి) కూడా కొన్ని స్తబకాల్లో వ్యక్తం చేశారు. ఇవి యోగసాధకులకెంతో వినియోగిస్తుంది. అంతే కాదు, ఎన్నో జ్యోతిశ్శాస్త్ర, మంత్రశాస్త్ర, ఆయుర్వేద రహస్యాలనూ నాయన ఇంద్రాణీ సప్తశతిలో పొందుపరిచారు.

అన్నీ నిత్య జీవితంలో మనకు పనికివచ్చే అంశాలే. ఇంతకంటే లోతుగా ఛందస్సు, యోగ రహస్యాల జోలికి వెళ్లడానికి ఇది సందర్భం కాదు. ఇక ఇంద్రాణీ సప్తశతి విషయానికి వద్దాం.



# ఇంద్రాణీ సప్తశతిలో వాడిన ఛందస్సు

ఇంద్రాణీ సప్తశతి అనేది 700 శ్లోకాల కావ్యం. అంటే, ఇందులో గాయత్రం, ఔష్ణిహం, అనుష్టుభం, బార్హతం, పాంక్తం, త్రైష్టుభం, జాగతం అని వరసగా 7 శతకాలున్నాయి. ఒక్కొక్క శతకంలో ఉండే 100 శ్లోకాలూ 4 స్తబకాలుగా ఉంటాయి. ప్రతి స్తబకంలోనూ 25 శ్లోకాలు ఉంటాయి. శశివదనా, తనుమధ్యా, ముకుళా, వసుమతీ అనే 4 స్తబకాలు కలిసి గాయత్రం అనే శతకం అవుతుంది. కుమార లలితా, మదలేఖా, హంసమాలా, మధుమతీ అనే 4 స్తబకాలు కలిసి ఔష్ణిహం అనే శతకం అవుతుంది. పథ్యావక్త్ర, మాణవక, చిత్రపదా, నారాచికా అనే 4 స్తబకాలు కలిసి అనుష్టుభం అనే శతకం అవుతుంది. హలముఖీ, భుజగ శిశుభృతా, మణిమధ్యా, మాత్రా సమక అనే 4 స్తబకాలు కలిసి బార్హతం అనే శతకం అవుతుంది. మయూరసారిణీ, మనోరమా, మణిరాగ, మేఘ వితాన అనే 4 స్తబకాలు కలిసి పాంక్తం అనే శతకం అవుతుంది. ఉపజాతి, రథోద్ధతా, మౌక్తికమాలా, సుముఖీ అనే 4 స్తబకాలు కలిసి త్రైష్టుభం అనే శతకం అవుతుంది. చివరిదైన జాగతం అనే శతకంలో ధృతవిలంబిత, జలోద్ధతగతి, ప్రమితాక్షర, సులలిత తామరస అనే 4 స్తబకాలు ఉన్నాయి. ఇలా మొత్తం మనకు 28 స్తబకాలున్నాయి. గాయత్రం, ఔష్ణిహం, అనుష్టుభం, బార్హతం, పాంక్తం, త్రైష్టుభం, జాగతం - ఇవన్నీ ఛందోబద్ధమైన పేర్లు. నాయన ఋగ్వేద మంత్రాలకు దీటైన మంత్రాలను దర్శించిన మహర్షి. అందుకే కాబోలు... ఈ ఇంద్రాణీ సప్తశతిలో వైదిక ఛందస్సును వాడి శ్లోకాలను వ్రాశాడు.

శశివదనా, తనుమధ్యా, ముకుళా, వసుమతీ అనే 4 స్తబకాలు కలిసి గాయత్రం అనే శతకం అవుతుంది. ఈ గాయత్రం శతకంలో ప్రతి శ్లోకంలోనూ రెండు పాదాలుంటాయి. ఒక పాదంలో 12 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 24 అక్షరాలు ఉంటాయి. ఈ నాలుగు స్తబకాల్లోనూ గాయత్రి ఛందస్సుకు చెందిన సామ్నీ ఛందం ఉంటుంది. లలితా సహస్రనామాల్లో గాయత్రీ (420) అనేది ఈ గాయత్రీ ఛందస్సునే ప్రస్తావిస్తుంది. గానం చేసేవారిని రక్షించేది గాయత్రి (గాయతం త్రాయతే యస్మాత్ గాయత్రీ తేన కథ్యతే - గాయత్రీ కల్పం). భగవద్గీత, కూర్మ పురాణం కూడా **ఛందస్సుల్లో గాయత్రినీ నేనే!** అంటున్నాయి.

కుమార లలితా, మదలేఖా, హంసమాలా, మధుమతీ అనే 4 స్తబకాలు కలిసి ఔష్ణిహం అనే శతకం అవుతుంది. ప్రతి శ్లోకంలోనూ రెండు పాదాలుంటాయి. ఒక పాదంలో 14 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 28 అక్షరాలు ఉంటాయి. ఈ

నాలుగు స్తబకాల్లోనూ గాయత్రి ఛందస్సుకు చెందిన సామ్నీ ఛందం ఉంటుంది.

పథ్యావక్ర, మాణవక, చిత్రపదా, నారాచికా అనే 4 స్తబకాలు కలిసి అనుష్టుభం అనే శతకం అవుతుంది. ప్రతి శ్లోకంలోనూ రెండు పాదాలుంటాయి. ఒక పాదంలో 16 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 32 అక్షరాలు ఉంటాయి. ఈ నాలుగు స్తబకాల్లోనూ అనుష్టుప్ ఛందస్సుకు చెందిన సామ్నీ ఛందం ఉంటుంది.

హలముఖీ, భుజగ శిశుభృతా, మణిమధ్యా, మాత్రాసమక అనే 4 స్తబకాలు కలిసి బార్హతమ్ అనే శతకం అవుతుంది. ప్రతి శ్లోకంలోనూ రెండు పాదాలుంటాయి. ఒక పాదంలో 18 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 36 అక్షరాలు ఉంటాయి. ఐతే, ఈ శతకంలోని నాలుగవ స్తబకంలో మాత్రం 4 పాదాలున్న శ్లోకంలో ఒక పాదంలో 9 అక్షరాలుంటాయి. మొత్తం శ్లోకంలో 32 అక్షరాలు ఉంటాయి. ఈ నాలుగు స్తబకాల్లోనూ బృహతీ ఛందస్సుకు చెందిన సామ్నీ ఛందం ఉంటుంది. **బృహతీ అంటే గొప్పవాటిల్లో కెల్లా గొప్పది!** అని అర్థం. భగవద్గీతలో భగవంతుడే **సామములలో నేను బృహత్సా మమును** (బృహత్సామ తథా సామ్నాం) అని చెప్పాడు. లలితా సహస్రనామాల్లో బృహతీ (673) అనేది మనకు బృహతీ ఛందస్సునే గుర్తు చేస్తుంది.

మయూరసారిణీ, మనోరమా, మణిరాగ, మేఘ వితాన అనే 4 స్తబకాలు కలిసి పాంక్తం అనే శతకం అవుతుంది. ప్రతి శ్లోకంలోనూ నాలుగు పాదాలుంటాయి. ఒక పాదంలో 10 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 40 అక్షరాలు ఉంటాయి. ఈ నాలుగు స్తబకాల్లోనూ పంక్తిః ఛందస్సుకు చెందిన యాజుషీ ఛందం ఉంటుంది.

ఉపజాతి, రథోద్ధతా, మౌక్తికమాలా, సుముఖీ అనే 4 స్తబకాలు కలిసి త్రైష్టుభం అనే శతకం అవుతుంది. ప్రతి శ్లోకంలోనూ నాలుగు పాదాలుంటాయి. ఒక పాదంలో 11 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 44 అక్షరాలు ఉంటాయి. ఈ నాలుగు స్తబకాల్లోనూ త్రిష్టుప్ ఛందస్సుకు చెందిన యాజుషీ ఛందం ఉంటుంది.

చివరిదైన జాగతం అనే శతకంలో ద్రుతవిలంబిత, జలోద్ధతగతి, ప్రమితాక్షర, సులలిత తామరస అనే 4 స్తబకాలు ఉన్నాయి. ప్రతి శ్లోకంలోనూ నాలుగు పాదాలుంటాయి. ఒక పాదంలో 12 అక్షరాలుంటాయి. మొత్తం ఒక శ్లోకంలో 40 అక్షరాలు ఉంటాయి. ఈ నాలుగు స్తబకాల్లోనూ జగతీ ఛందస్సుకు చెందిన యాజుషీ ఛందం ఉంటుంది.

ఇలా మొత్తం ఏడు శతకాలలో 28 స్తబకాలున్నాయి. ఒక్కో స్తబకం ఒక్కో వృత్తంలో ఉండేలా చిత్రవిచిత్రమైన గమకాలను నాయన ఊహించి వైదిక ఛందోబద్ధంగా వ్రాశారు. పింగళ సూత్రాలననుసరించిన ఛందశ్చక్రాలు జాగ్రత్తగా గమనిస్తే, అగ్ని (గాయత్రి), సవితా (ఉష్ణిక్), సోమ (అనుష్టుప్), గురు (బృహతీ), మిత్రావరుణ (పంక్తి), ఇంద్ర (త్రిష్టుప్), విశ్వేదేవాః(జగతి) దేవతలున్నారు. అందుకే, ఆయా శ్లోకాల్లో నాయన ఇంద్రాణీ దేవిని స్తుతించేటపుడు మనకు ఆయా దేవతలఛాయలు ఆయా శతకాల్లో మనకు కనిపించినట్లు అనిపిస్తుంది.



# ఇంద్రాణీ సప్తశతి - సరళమైన తాత్పర్య సహితం

ఈ ఇంద్రాణీ సప్తశతి ఒక్కోసారి చదివినపుడు ఒక్కో కొత్త రహస్యాన్ని ఆవిష్కరింపజేసే మహత్తరమైన స్తోత్ర కావ్యం. ఎవరు ఎలా పారాయణ చేసినా సరే! వారికి శత్రు నాశనం, ఆరోగ్య, కార్యసిద్ధి కలగడమే కాదు, మన దేశానికీ మంచి జరుగుతుంది. అందులో అణుమాత్రం కూడా సందేహం లేదు. ప్రతి స్తబకాన్నీ నాయన ఏఏ వృత్తాలలో అయితే వైదిక ఛందోబద్ధంగా గమకాలను ఊహించి వ్రాశారో ఆ వృత్తాల పేరునే ఆయా స్తబకాలకు ఉంచారు. ఇక ఆ శ్లోకాలనూ, వాటి తాత్పర్యాలనూ శతక, స్తబకాల వారీగా తెలుసుకొందాం.



*ఇంద్రాణీదేవి, పంచనదీశ్వరాలయం, తిరువయ్యూరు*

# 1. గాయత్రం శతకం

గాయత్రం శతకం అనే ఆరంభ శతకంలో తొలి స్తబకం పేరు శశివదనా స్తబకం. ప్రతి స్తబకంలోనూ 25 శ్లోకాలు ఉంటాయి. శశివదనా, తనుమధ్యా, ముకుళా, వసుమతీ అనే 4 స్తబకాలు కలిసి గాయత్రం అనే శతకం అవుతుంది. ఇందులో ఓ ఇంద్రాణీదేవీ, నా దారిలో ఉండే ఈ చీకట్లను నీ మందహాస కాంతులతో తొలగించవమ్మా! అంటూ శచీదేవిని కోరుతూ కవి అరంభిస్తాడు.

## 1.1. శశివదనా స్తబకం

*1.* *హరిలలనే మే పథి తిమిరాణి ।*
*హర దరహాస ద్యుతిభి రిమాని ॥*

అమ్మా! ఇంద్రాణీ దేవీ! నా దారిలో కమ్ముకుని ఉన్న చీకట్లను నీ మందహాసం వల్ల వచ్చే కాంతులతో తొలగించు.

*2.* *అగతి మవీర్యా మపగత ధైర్యాం ।*
*అవతు శచీమే జనిభువ మార్యాం ॥*

గతి చెడి, వీర్యాన్ని కోల్పోయి, అధైర్యపడి ఉన్న నా పవిత్ర జన్మభూమిని శచీదేవి రక్షించుగాక!

*3.* *శ్రుణు కరుణావ త్యలఘుమఖ ర్వే ।*
*స్తవ మహమార్య స్తవ శచి కుర్వే ॥*

*4.* *త్రిజగ దతీతో విలసతి నిత్యః ।*
*అణు రణుతో, యో భగవతి సత్యః ॥*

ఓ శచీదేవీ! అన్నిటికన్నా శ్రేష్ఠమైన నీ స్తోత్రం చేస్తున్నా. విను! ఓ భగవతీ! అణువుకన్నా అణువుగా ఉన్న సత్య స్వరూపుడు, ముల్లోకాలకూ అతీతుడు. అతడు నిత్యమూ ప్రకాశిస్తున్నాడు.

5. త్వ మఖిల కార్యే ష్వయి ధృత శక్తిః ।
ఉరుగతి రస్య ప్రభుతమ శక్తిః ॥

6. విదురిమ మేకే జగతి మహేంద్రం ।
జగురయి కేచి జ్జనని మహేశం ॥

7. అవగత వేదో వదతి మహేంద్రం ।
పరిచిత తంత్రో భణతి మహేశం ॥

8. జనని శచీ త్వం ప్రథమ దళస్య ।
భగవతి దుర్గా స్యపర దళస్య ॥

9. న శచి శివాత స్త్వ మితర ద్దైవం ।
బహు ముని వాణీ సమరస తైవం ॥

10. దివిచ సితాద్రౌ శచి వపుషోర్వాం ।
పృథ గువలంభా దయి భిదయోక్తిః ॥

అమ్మా! ఓ దేవీ! అన్ని కార్యాల్లోనూ ఉండే శక్తి నీకున్నది. అంతే కాదు. నీవు అత్యంత వేగం కలిగి ఆ ప్రభువుకు ఎంతో సమర్థశక్తిగా ఉన్నావు. కొందరు ఈ పురుషుడిని మహేంద్రుడంటున్నారు. మరికొందరు మహేశ్వరుడని గానం చేస్తున్నారు. వేదవిదులు ఆయనను మహేంద్రుడంటే, తంత్రశాస్త్రంతో పరిచయం ఉన్న వాళ్లు ఆయనను మహేశ్వరుడంటారు. అతనిని మహేంద్రుడని చెప్పిన వారికి శచీదేవిగాను, మహేశ్వరుడని చెప్పిన వారికి దుర్గగానూ గోచరిస్తున్నావు. అందువల్ల నీవు శివవే కానీ, వేరే దైవానివి కావు. ఎందరో మునుల వాణిని అనుసరించే నేను చెబుతున్నాను. ఇలా శచి, దుర్గలుగా రెండు వేర్వేరు శరీరాలను కలిగి అటు స్వర్గంలో, ఇటు కైలాసంలో ఉండటం వల్ల ఈ రెండు రూపాలకూ భేదాన్ని ఊహిస్తున్నారే కానీ, నిజానికి నీవు వేరు కాదు (ఇక్కడ స్వర్గం అంటే దుఃఖం లేనిది అనీ, కైలాసం అంటే మోక్ష స్థానం అనీ అర్థం. అంటే తేడా అంతా కేవలం పేర్లలోనే. తేజస్సును బట్టి ఒకరు, శబ్దాన్ని బట్టి ఇంకొకరు ఆ పేర్లను కల్పించారే గానీ నిజానికి రెండిటికీ తేడా లేదు అని చెబుతూ ఆ రెండు రూపాలకీ మూలం నీవే అంటూ కవి స్తుతిస్తున్నాడు).

11. తనుయుగ మూలం వపురతి మాయం ।
కరచరణాద్యై ర్వియుత మమేయం ॥

12. త్వముదరవర్తి త్రిభువన జీవా ।
భవసి శచీ సా జనని శివా వా ॥

మాయకు అతీతమై, కరచరణాలు లేనిదీ అమేయమైన శరీరమే పై రెండు శరీరాలకూ మూలమై ఉంది. ఓ శచీ! నీ కడుపులో ఇముడ్చుకుని ఉన్న త్రిభువనాలకూ నీవే జీవంగా శచిగా ఉన్నావు. నీవే దుర్గగానూ ఉన్నావు.

*13. విభు శుచికీలా తతిరయి ధూమం ।*
*త్వ మమర మార్గం బత వమసీమం ॥*

తల్లీ! ఆ విభుడు పరిశుద్ధమైన అగ్నిలాంటి వాడు. అతని కిరణాల సమూహానివై నీవు దేవయానమనే ధూమాన్ని వెళ్లగక్కావు. ఆశ్చర్యం కదా! (విభుడంటే వ్యాపకుడు. వ్యాపకత్వ ధర్మం అనేది అతని మహిమ. ఆ మహిమే సృష్టి ప్రళయాలకు కారణమవుతూ ఉంటుంది. ఆ శక్తిపురుషులే ఇంద్రాణీదేవిగా, ఇంద్రునిగా మనం గ్రహించాలి).

*14. జయసి నభస్తో జనని పరస్తాత్ ।*
*నభసిచ భాంతీ భవసి పురస్తాత్ ॥*

*15. త్వ మతనురంబ జ్వలసి పరస్తాత్ ।*
*ఇహ ఖ శరీరా లససి పురస్తాత్ ॥*

*16. జనని పరస్తా న్మతిరసి భర్తుః ।*
*అసి ఖ శరీరా పృథగవగంత్రీ ॥*

*17. సువిమల రూపం భగవతి శాంతం ।*
*న భవతి శూన్యం తదిద మనంతం ॥*

ఆకాశానికి ఆవలివైపు (పరమాకాశం లేదా మహిమగా) ప్రకాశిస్తూ, ఆకాశం లోనూ, దానికి ఈవలివైపూ కూడా (అంటే ఈ విశ్వంలోనూ) ఉండి **ఆకాశ శరీరిణివై** ప్రకాశిస్తూ ఉన్నావు. అమ్మా! ఆవలివైపు నీ భర్తకు మతివై ఉండటమే కాదు, ఆకాశ శరీరిణివై ఒక ప్రత్యేక **చలనశక్తి**గా ఉన్నావు. నిర్మలమైన నీ స్వరూపం శాంతంగా ఉన్నా, శూన్యమైతే మాత్రం కాదు. ఈ (ఆకాశ) రూపం అనంతంగా ఉంది.

*18. దివి దధతీంద్రే పురుష శరీరం ।*
*జనని పురంధ్రీ తనురభవ స్త్వం ॥*

*19. దృశి విలసంతం ప్రభు ముపయాంతీ ।*
*భవసి విరాట్ త్వం నృతనుష భాంతీ ॥*

*20. తవ గుణగానం జనని విధాతుం ।*
*భవతి పటుః కో వియదివ మాతుం ॥*

ఓ తల్లీ! నీవు ఆకాశంలో ఇంద్రునిలో పురుష శరీరాన్ని ధరించి, నీవు స్త్రీ శరీరిణివైనావు. నలుదిక్కులా శోభిల్లే ప్రభువుతో కలిసి నీవు మానవులలో ప్రకాశించే విరాట్టువయ్యావు. ఆ ఆకాశాన్ని ఎలా లెక్కగట్టలేమో, నిన్ను కూడా మేం లెక్కగట్టలేం. నీ గుణగానం చేయడానికి ఎవరికీ శక్యం కాదు.

*21.* *భగవతి తృ ప్తి ర్భవతు నవా తే ।*
*అభిలషితా ప్తి ర్భవతు నవా మే ॥*

*22.* *భజతి తవాంఘ్రిం మమఖలు భాషా ।*
*పతి మనురాగా త్ప్రియమివ యోషా ॥*

*23.* *అఘ మపహర్తుం శుభమపి కర్తుం ।*
*అల మజరే తే గుణగణ గానం ॥*

అమ్మా! ఓ భగవతీ! నీకు తృప్తి కలిగిందో లేదో తెలీదు కానీ, నా కోరిక మాత్రం సిద్ధించేలా చూడు. అది సిద్ధించకపోనూ వచ్చు. ఐతే, ప్రియమైన భర్తపై అనురాగం కలిగిన భార్య ఎలాగైతే అతనిని విడువదో, నా భాష నీ పాదాలను విడువకుండా కీర్తిస్తూనే ఉంటుంది కదా (ఆకాశం అంటే శబ్దగుణం కలది. అందువల్ల భాష నిన్ను కీర్తిస్తుందన్నమాట). అమ్మా, నీ గుణగానమనేది పాపాలను పారద్రోలి శుభాలనివ్వడానికి సమర్థమైంది.

*24.* *అవసి జగత్త్వం కులిశి భుజస్థా ।*
*అవ మునిభూమిం గణపతి ధీస్థా ॥*

అమ్మా! ఇంద్రుని భుజశక్తిగా ఉండి నీవు అన్ని లోకాలనూ రక్షిస్తూ ఉన్నావు. అదే రీతిలో ఈ గణపతి బుద్ధిలోనూ నీవు ఉండి భారత భూమిని రక్షించవమ్మా.

*25.* *శశివదనాభి ర్గణపతిజాభిః ।*
*శశివదనాఢ్యా పరిచరితాఽస్తు ॥*

గణపతి కవి వల్ల పుట్టిన ఈ శశివదనా వృత్తాలు ఆదిశక్తియైన ఇంద్రాణీ దేవిని సేవించుగాక!

గాయత్రం శతకంలోని మొదటి స్తబకమైన శశివదనా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

## 1.2. తనుమధ్యా స్తబకం

1. ధ్వాంతం పరిహర్తుం తేజాంస్యపి భర్తుం ।
అంతర్మమ భూయా త్స్మరేంద్ర పురంధ్రీ ॥

2. భీతా మరిధూతా మార్యావని మేతాం ।
సమ్రాజ్ఞి బుధానాం దూనా మవ దీనాం ॥

చీకటిని పారద్రోలి, తేజస్సును నింపడానికి నా హృదయంలో ఇంద్రాణీదేవి ఉండు గాక. అమ్మా! పండితులందరినీ పాలించే నీవు ఈ ఆర్యావర్తం వైపు చూడు. అది శత్రువులకు ఆధీనమై, వణికిపోతూ, దీనంగా ఉంది. దానిని రక్షించు తల్లీ! (ఆర్యావర్తం అంటే వింధ్య, హిమాచల పర్వతాల మధ్య ఉండే ప్రదేశం - ఉత్తర భారతం అయినా, ఇక్కడ భారతదేశం అనే చెప్పుకోవాలి)

3. ఇంద్రస్యసహాయాం విశ్వస్య విధానే ।
ఆకాశ శరీరా మంబాం ప్రణమామః ॥

ఈ విశ్వాన్ని సృష్టించడంలో నీవు ఇంద్రునికి సహాయం చేశావు. ఆకాశాన్నే శరీరంగా చేసుకున్న ఓ అంబా! నీకు మేమందరమూ నమస్కరిస్తున్నాం.

4. కర్తుర్భువనానాం మాయాసి శచి త్వం ।
సత్యస్య తపోఽసి జ్ఞస్యాసి మనీషా ॥

5. ఆజ్ఞాఽసి వినేతు స్తేజోఽసి విభాతః ।
నిర్యత్న సమాధే రానంద రసోఽసి ॥

6. తస్య త్వమనన్యాఽప్యన్యేవ ఖకాయా ।
అత్యద్భుతమాయా జాయాఽసి సహాయా ॥

7. ఆకాశ శరీరాం జాయామశరీరః ।
ఆలింగ్య విభుస్త్వాం నందత్యయి చిత్రం ॥

ఓ శచీదేవీ! నీవు ఈ భువనకర్తకు మాయగా ఉన్నావు. ఒక మంచి వస్తువుకు తపస్సుగా ఉన్నావు. పండితులకు బుద్ధివీ నీవే. ఈశ్వరుడి ఆజ్ఞవు నీవే. అగ్నికి తేజస్సూ నీవే. అంతే కాదు. నిర్వికల్ప సమాధిలో ఉండే యోగి పొందే ఆనంద రసానివీ నీవే. అంతేనా? అనన్యురాలవైనా కూడా, అన్యురాలవలె ఆకాశ శరీరంతో అత్యద్భుతమైన మాయారూపిణిగా నీవు అతనికి సహాయం చేసే భార్యవైనావు. చిత్రం

ఏమిటంటే, అశరీరుడైన ప్రభువు ఆకాశ శరీరంతో భార్యవైన నిన్ను ఆలింగనం చేసికొని ఆనందిస్తున్నాడు (ఆకాశ శరీరానికి వస్తు సమృద్ధినిచ్చేవాడు ఆనంద స్వరూపుడు. అతని స్వరూపంలో కేవలం ఒక అంశమాత్రమే ఈ ఆకాశం అనేది. దానిని ఆవరించి స్వరూపం ఉండటమే ఆలింగనం).

*8. వజ్రేశ్వరి ఘస్రే శీర్షేంబ బిభర్షి ।*
*దీప్తం సవితారం మాణిక్య కిరీటం ॥*

*9. నక్షత్ర సహస్రై శ్శుభ్రద్యుతిభి స్తే ।*
*పుష్పాయితమేతై ర్మాతర్నిశి మస్తే ॥*

*10. ఘస్రః ఖలుకాలో రాజ్యం శచి కర్తుం ।*
*రాత్రిః ఖలుకాలో రంతుం రమణేన ॥*

ఓ అంబా! పగటి పూట ప్రజ్వలించే సూర్యుడిని నీవు మాణిక్యాలతో చేసిన కిరీటంలాగా ధరించి ఉన్నావు (శక్తికి రెండు రూపాలు. ఆకాశ రూపంలో కిరీటాన్ని ధరించి విశ్వపాలన చేసే రూపం ఒకటైతే, దివ్య స్త్రీ స్వరూపం మరొకటి. దీనిని 13, 14 శ్లోకాలలో వర్ణించారు నాయన). రాత్రిపూట తెల్లని నక్షత్ర సమూహాలు నీ సిగలో పూల మాదిరి ఉన్నాయి. ఓ శచీదేవీ! రాజ్యాన్ని పగటి పూట పాలిస్తూ, రాత్రి పూట భర్తతో ప్రేమగా ఉన్నావు (ఇక్కడ ఇంద్రాణికి ఉండే రెండు రూపాలు - మొదటిది ఆకాశ రూపానికి చెందితే, రెండవది స్త్రీ రూపానికి చెందింది).

*11. నిశ్శబ్ద తరంగా స్వగ్లౌషు నిశాసు ।*
*నూనం ఖశరీరే కాంతం రమయంతీ ॥*

*12. సాంద్రోడు సుమస్ర గ్విభ్రాజిత కేశా ।*
*ధ్వాంతాసిత చేలా శాంతాఽప్యసి భీమా ॥*

ఆకాశశరీరిణివైన ఓ అంబా! చంద్రుడు లేని నిశ్శబ్ద తరంగాలుండే రోజున చీకటి రాత్రులలో నీవు నీ భర్తతో కూడి అతనిని సంతోషపెడ్తున్నావు. నిజం. దట్టమైన నక్షత్రాలు నీకు పూలదండలాగా ఉంటే, విభ్రాజమానమైన జుట్టుతో చీకటి అనే నల్లని వస్త్రం ధరించి నీవు శాంతంగా ఉన్నా కూడా, మాకు మాత్రం చూడటానికి భయంకరంగా ఉన్నావు.

*13. రాజ న్మితతారా మందార వతంసాం ।*
*మాత స్సితభాసా స్మేరాం హసితేన ॥*

14. జ్యోత్స్నా ఘనసార ద్రావై రనులిప్తాం ।
త్వాం వీక్ష్య న శాంతిః కస్య క్షణదాసు ॥

ఓ తల్లీ! జ్యోతిర్మయమైన నక్షత్ర మందారమాలతో అలంకరించుకుని, తెల్లని నవ్వుతో శోభిస్తూ, వెన్నెల అనే కర్పూర లేపనాన్ని కలిగిన నిన్ను రాత్రిపూట చూచిన వారికి తప్పకుండా శాంతి కలుగుతుంది.

15. బాలారుణ రోచిః కాశ్మీర రజోభిః ।
ఆలిప్తముఖీం త్వాం ప్రాతః ప్రణమామి ॥

16. సాయం సమయ శ్రీ లాక్షారస రక్తం ।
ప్రత్య క్ప్రసృతం తే వందే వరదేంఘ్రిం ॥

17. దీప్తార్క కిరీటాం సర్వాన్వినయంతీం ।
వందే భువనానాం రాజ్ఞీమసమానాం ॥

ఓ తల్లీ! లేలేత సూర్యకిరణాలనే కుంకుమ ధూళితో లేపనం గావించిన ముఖంతో ఉండే నీకు నేను ప్రాతఃకాల సమయంలో నమస్కరిస్తాను. సాయంకాల సమయంలో వచ్చే కాంతివల్ల ఎర్రబడి పశ్చిమాన వేరుగా వ్యాపించిన నీ పాదానికి నేను నమస్కరిస్తాను. ప్రకాశించే సూర్యుడిని కిరీటంగా కలిగి సకలజనులనూ శాసించే తల్లిగా, భువనాలకు మహారాణిగా, ఎలాటి ఉపమానం లేనట్టి, నిన్ను నేను కొలుస్తాను.

18. ధూతాఖిల రోగా శ్వాసా స్తవ వాతాః ।
మాతర్వితరంతు ప్రాణస్య బలం నః ॥

19. ప్రాంచస్తవ వాతా శ్వాసా శ్శముశంతు ।
ప్రత్యంచ ఇమే నః పాపం శమయంతు ॥

20. మన్మాత రవాంచో వీర్యం వితరంతు ।
సంతాప ముదంచ స్సర్వంచ హరంతు ॥

ఓ తల్లీ! సర్వ రోగ నివారణమైన నీ శ్వాస మా ప్రాణాలకు బలమిచ్చుగాక! వెలుపలకు వచ్చే నీ శ్వాస మాకు సౌఖ్యాన్నిచ్చుగాక! లోనికి పోయే నీ శ్వాస మా సకల పాపాలనూ నశింపజేయుగాక! దక్షిణంగా వచ్చే నీ శ్వాస వాయువులు మాకు వీర్యాన్నిచ్చుగాక! ఉత్తర దిక్కుగా వచ్చే నీ శ్వాస వాయువులు మా సకల సంతాపాలనూ తొలగించుగాక!

21. అస్యా ఇవ భూమే ర్భూత ప్రసవాయాః ।
ఏకైకశ ఆహు ర్యేషాం మహిమానం ॥

22. అద్రే రుపలానాం నద్యాస్సికతానాం ।
యేషాంచ న కశ్చి చ్ఛక్తో గణనాయాం ॥

23. రోమాయిత మేతై ర్గోళైస్తవకాయే ।
వ్యాఖ్యాత మనేన శ్లాఘ్యం తవ భాగ్యం ॥

ఓ దేవీ! సకల భూతాలకూ తల్లియైన భూమి మహిమను పూర్తిగా ఎలాగైతే చెప్పలేమో అలాగే, ఏ గోళ మహిమనైనా ఒక్కొక్క భాగం కంటే ఎక్కువగా ఎవరూ వర్ణించలేకపోతున్నారు. కొండలలో ఎన్ని రాళ్లున్నాయో, నదీ తీరాన ఉండే ఇసుక తిన్నెలలో ఎన్ని ఇసుక రేణువులున్నాయో ఎలాగైతే చెప్పలేమో, ఆ విధంగానే గోళాల సంఖ్యనూ చెప్పలేం. అటువంటి అసంఖ్యాకమైన గోళాలే నీ శరీరంపై రోమాలుగా ఉన్నాయి. అంత మాత్రానికే కొనియాడదగిన నీ భాగ్యం నా వ్యాఖ్యానమైంది.

24. విశ్వం వహసీదం జంభారి భుజస్థా ।
ఆర్యాన్వహ మాత ర్వాసిష్ఠమతిస్థా ॥

అమ్మా! ఇంద్రుని భుజశక్తిగా ఉండి నీవు ఈ విశ్వాన్ని కలిగి ఉన్నావు. అదే రీతిన ఈ వాసిష్ఠుని (గణపతిముని) బుద్ధియందు నీవుండి ఆర్యులను వహించు.

25. ఆద్యాం భువనానాం భర్తుస్తనుమధ్యాం ।
భక్తస్య భజంతా మేతా స్తనుమధ్యాః ॥

ఈ భువనాలకు పూర్వమే ఉన్న ఈ శక్తిని, ఈశ్వరుని తను మధ్యను (తను మధ్య అంటే భార్య అనీ, శరీర మధ్యమంలో ఉండే ఆకాశరూపిణి అనీ అర్థం. తనుమధ్యా అంటే, సన్ననైన నడుము కలది అని మరో అర్థం కూడా ఉంది) భక్తుని ఈ తనుమధ్యా వృత్తాలు పొందుగాక.

గాయత్రం శతకంలోని రెండవదైన తనుమధ్యా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 1.3. ముకుళా స్తబకం

1. పౌలోమ్యా శ్శుచయో హాసానాం ఘృణయః ।
భూయాసు ర్విమల ప్రజ్ఞాయై హృది మే ॥

2. ఇంద్రాణ్యాః కరుణా లోకా శ్శోక హృతః ।
భూయాసు ర్భరత క్ష్మాయై క్షేమ కృతః ॥

శుభ్రమైన ఇంద్రాణీదేవి ధరహాసకాంతులు నాహృదయంలో స్వచ్ఛమైన ప్రజ్ఞ నిచ్చుగాక! అందరి దుఃఖాలనూ హరించే కరుణ పూరితమైన ఇంద్రాణీ వీక్షణాలు భారత భూమికి క్షేమకరములగు గాక!

3. వ్యక్తి ర్వ్యోమ తను శ్శక్తిత్వా ద్వనితా ।
జ్ఞాతృత్వా త్పురుషః కేషాంచి ద్విదుషాం ॥

4. వ్యక్తిం వ్యోమతనుం యేప్రాహుః పురుషం ।
తేషాం తత్త్వ విదాం కల్పన్స్యు స్త్రివిధః ॥

5. రుద్రం కేపి జగు శ్శక్రం కేపి విదుః ।
భాషంతే భువన ప్రాణం కేపి విదః ॥

ఆకాశాన్ని శరీరంగా కలిగినది వ్యక్తి అనీ, శక్తిత్వం వల్ల వనిత అనీ, జ్ఞాతృత్వం వల్ల పురుషుడనీ కొందరు పండితులు అభిప్రాయపడి ఒకే శరీరాన్ని శక్తి,పురుషులకు అన్వయించారు. ఐతే, ఎవరైతే ఆకాశాన్ని శరీరంగా కలిగినది ఒకవ్యక్తి అనీ, పురుషుడనీ అంటున్నారో, ఆ తత్త్వవేత్తలు మూడు రకాలైన కల్పనలను చేశారు. అదెట్లంటే, కొందరు ఆ పురుషుని రుద్రుడన్నారు. ఇంకొందరు ఇంద్రుడన్నారు. మరికొందరు లోకాలకు ప్రాణమే ఆవ్యక్తి అనీఅంటున్నారు.

6. వ్యక్తిం వ్యోమతనుం ప్రాహుర్యే వనితాం ।
తేషాంచ త్రివిధః కల్పశ్శాస్త్ర విదాం ॥

7. దుర్గా నూరివరైః కైశ్చిత్సా గదితా ।
శచ్యన్యై ర్విబుధై ర్గిరన్యై రదితిః ॥

8. ఏకేషాం విదుషాం వ్యక్తి ర్వ్యోమతనుః ।
నస్త్రీ నో పురుషో బ్రహ్మై తత్సగుణం ॥

*9. త్వం విశ్వస్య మహా న్ప్రాణః కః పరమే ।*
*త్వం రుద్రః ప్రణవ స్త్వం శక్రోఽభ్ర శిఖీ ॥*

ఆకాశాన్ని శరీరంగా కలిగిన వ్యక్తి అనీ, వనిత అనీ ఎవరైతే చెబుతున్నారో ఆ శాస్త్రవేత్తల కల్పన కూడా మూడు రకాలుగా ఉంది. అదెలాగంటే, కొందరు ఆమెను దుర్గ అంటే, ఇంకొందరు ఆమెను శచీ అంటే, మరికొందరు ఆమెను అదితి అన్నారు. ఇదంతా ఇలా ఉంటే, కొందరు మాత్రం అసలు ఈ ఆకాశశరీరి అటు స్త్రీ కాదు, ఇటు పురుషుడు కాదు. అది బ్రహ్మ సగుణరూప లక్షణమే అన్నారు. కానీ, తల్లీ! నీవే ఈ విశ్వానికి మహా ప్రాణానివి. నీవే బ్రహ్మవు, రుద్రుడవు. ప్రణవమూనూ. అంతే కాదు. ఇంద్రుడవూ నీవే. విద్యుతాగ్నివీ నీవే.

*10. త్వం కస్యా స్యదితి స్త్వం రుద్రస్య శివా ।*
*త్వం శక్రస్య శచీ శక్తి స్సర్వ గతే ॥*

*11. ప్రాణశ్చ ప్రణవో జ్యోతిశ్చాంబరగం ।*
*వస్త్వేకం త్రిగుణం నో వస్తు త్రితయం ॥*

అమ్మా! నీవు కశ్యప బ్రహ్మకు అదితివి. రుద్రునకు శివవి. ఇంద్రునకు శచివి. నీవే శక్తివై ఉన్నావు (అంటే, పురుష లక్షణాలను సైతం భరించే శక్తివని భావం). ఎందుకంటే, ప్రాణమనీ, ప్రణవమనీ, ఆకాశ గతమైన తేజస్సు అనీ ఈ మూడు గుణాలతో దొరికే వస్తువు ఒకటే గానీ, మూడు వస్తువులు లేవు.

*12. శక్తేరంబ పరే శక్తస్యాపి భిదా ।*
*జ్వాలా పావకవ ద్భాషా భేదకృతా ॥*

తల్లీ! శక్తికీ, శక్తునకూ ఉండే భేదం జ్వాలకూ అగ్నికీ మధ్య ఉండే భేదం లాటిది. మాటే భేదాన్ని కలిగిస్తూ ఉంది (అంతే కానీ వస్తుతః ఎలాటి భేదమూ లేదు).

*13. సర్వం దృశ్య మిదం భుంజానే పరమే ।*
*పుం నామ స్తుతయో యుజ్యం తే ఖలు తే ॥*

*14. కుర్వాణేఽమ్బ సత స్సంతోషం సతతం ।*
*స్త్రీనామ స్తుతయ శ్శోభాం తే దధతే ॥*

కనిపించే సర్వాన్నీ భుజించే ఓ తల్లీ! పురుషనామ స్తోత్రాలు నీకు యుక్తమే కదా! ఐనా సరే, ఓ అంబా! సత్ రూప బ్రహ్మకు సంతోషాన్నిచ్చే నీకు, స్త్రీనామ

స్తోత్రాలు మాత్రమే శోభనిస్తున్నాయి.

15. సద్బ్రహ్మ బ్రువతే విద్వాంసో విగుణం ।
త్వం మాత స్సగుణం బ్రహ్మాఽసి ప్రథితే ॥

16. శబ్దాద్యై ర్వియుతం సద్బ్రహ్మాఽమలినం ।
శబ్దాద్యై స్సహితా త్వం దేవ్యార్యహితా ॥

17. సాక్షి బ్రహ్మ పరం త్వం మాతః కురుషే ।
సర్వేషాం జగతాం కార్యం సర్వ విధం ॥

ఓ తల్లీ! విద్వాంసులు గుణంలేనిదానిని సద్బ్రహ్మగా చెబుతున్నారు. ఐతే నీవు సగుణ బ్రహ్మ వైతివి. అమ్మా! శబ్దాదులతో కూడకుండా ఉండేది నిర్మల బ్రహ్మ మవుతుంది. శబ్దాదులతో కూడిన నీవు ఆర్యులకు హితకారిణివై ఉన్నావు. పర బ్రహ్మం అనేది సాక్షిగా ఉంటుంది. నీవు సకల జగత్తులకూ అన్ని విధాల పనులనూ చేస్తావు.

18. ద్యౌర్మాతా జగతో ద్యౌరేవాస్య పితా ।
దృశ్యం విశ్వ మిదం వ్యాప్తం భాతి దివా ॥

19. ఆకాశా ద్రజసో ద్యౌరన్యా విరజాః ।
ఆకాశేఽస్తి పున స్తత్స్వా రేచ పరా ॥

ఈ జగత్తుకు ఆకాశమే తల్లీ, తండ్రీ కూడా. మనకు కనిపించేదంతా ఆకాశంతో వ్యాప్తమై ప్రకాశిస్తూ ఉంది. ధూళి రూపమైన ఆకాశం కన్నా ధూళి లేని ఆకాశం వేరేగా ఉంటుంది. దానికి వేరుగా మరొకటి ఉంది. ఈ మూడింటికీ చివరన పరాకాశం అనేది ఉంది (ఈ పరాకాశమే నిర్గుణం. అదే మూడు గుణాలతో మూడు స్థితులుగా వ్యాపించింది. అంతే).

20. తాం లోకస్య మహా రంగే వ్యోమతనుం ।
పారే శుద్ధ తమాం విద్మస్త్వాం పర మే ॥

21. త్వాం పూర్ణామదితిం శక్తిం దేవీ శచీం ।
నిత్యం శబ్దవతీం గౌరీం ప్రబ్రువతే ॥

ఓ దేవీ! లోకాలనే మహా రంగంలో ఆ ఆకాశ శరీరినీ, దాని అంత్యమందు శుద్ధతమమైన నిన్ను తెలుసుకుంటున్నాం (ఆ రూపాన్ని ధ్యానించే వారు చివరకు ఇలా పరదేవతా తత్త్వాన్ని తెలుసుకుంటారు). అందరూ పూర్ణమైన నిన్ను అదితిగా,

శక్తిగా, శచిగా, ప్రణవంగా, గౌరీదేవిగా చెబుతున్నారు.

> *22.* పుం నామా భవతు స్త్రీనామఽథ స్వథవా ।
> వ్యక్తి ర్వ్యోమ తను ర్లోకం పాత్యఖిలం ॥

> *23.* నాకే సా కిల భా త్వైంద్రీ రాజ్యరమా ।
> బిభ్రాణా లలితం స్త్రీ రూపం పరమా ॥

పురుష నామమే కానీ. స్త్రీ నామమే కానీ ఈ సర్వాన్నీ రక్షిస్తున్నది ఆకాశ శరీరియే. ఆమె లలితమైన స్త్రీ రూపాన్ని ధరించి ఉత్తమ రాజ్యలక్ష్మిగానూ ఇంద్రాణిగానూ స్వర్గంలో భాసిల్లుతూ ఉంది.

> *24.* శక్తాం దేవి విధే హ్యార్తానా మవనే ।
> ఇంద్రస్యేవ భుజాం వాసిష్ఠస్య మతిం ॥

అమ్మా! శరణు పొందిన వారిని రక్షించదానికి ఇంద్రుని భుజానికి ఎలా సామర్థ్యాన్నిచ్చావో, అదే రీతిన ఈ వాసిష్ఠుని (గణపతిముని) మతికి కూడా (భారతీయుల ఆర్తిని తొలగించదానికి) అటువంటి శక్తినివ్వు.

> *25.* పూజా శక్రతరు ణ్యేత్తై స్సిద్ధ్యతు తే ।
> గాతౄణాం వరదే గాయత్రై ర్ముకుళైః ॥

నిన్ను కీర్తించే వారికి వరాలిచ్చే ఓ ఇంద్ర తరుణీ! ఈ గాయత్రీ ఛందస్సంబంధమైన ముకుళాలతో (వృత్తాలతో) నీకు చేసే పూజ సిద్ధించుగాక!

గాయత్రం శతకంలోని మూడవదైన ముకుళా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 1.4. వసుమతీ స్తబకం

1. మోహం పరిహర న్యోగం వితను తాం ।
దేవేంద్ర దయితా హాసో మమహృది ॥

2. ఆభాతు కరుణా సా భారత భువి ।
సుత్రామ సుదృశో యద్వన్నిజ దివి ॥

3. వందారు జనతా మందార లతికాం ।
వందే హరిహయ ప్రాణప్రియతమాం ॥

4. శోకస్య దమనీం లోకస్య జననీం ।
గాయామి లలితాం శక్రస్య దయితాం ॥

5. రమ్యా సుమనసాం భూపస్య మహిషీ ।
సౌమ్యా జనిమతాం మాతా విజయతే ॥

6. వీర్యస్యచ ధియ స్త్రైలోక్య భరణే ।
దాత్రీ మఘవ తే దేవీ విజయ తే ॥

మోహాన్ని పరిహరించే ఇంద్రాణీదేవి చిరునవ్వు నా హృదయంలో యోగాన్ని కలుగజేయుగాక! ఇంద్రాణీదేవి తన (నిజ) లోకంలో ఎలాటి కరుణ చూపుతుందో అటువంటి కరుణనే ఈ భారతభూమి మీద చూపుగాక! నమస్కరించినంతనే కోరికలను తీర్చే దేవేంద్ర ప్రాణసఖియైన ఇంద్రాణీదేవిని నేను పూజిస్తున్నాను. దుఃఖాలను పోగొట్టే లోకమాతయైన ఇంద్రాణీదేవిని నేను స్తుతిస్తున్నాను. మంచి మనసు గలిగి, రమ్యంగా, సౌమ్యంగా ఉండే ఇంద్రాణీదేవి ప్రకాశిస్తూ ఉంది. ఈ మూడు లోకాలనూ భరించదానికి ఇంద్రుడికి బుద్ధినీ, బలాన్నీ ఇచ్చే ఆమె ప్రకాశించుగాక!

7. వ్యాప్తా జగదిదం గుప్తా హృది నృణాం ।
ఆప్తా సుకృతినాం దైవం మమశచీ ॥

8. ఖేశక్తి రతులా పారే చిదమలా ।
స్వశ్చారు మహిళా దైవం మమశచీ ॥

9. శస్త్రం మఘవతో వస్త్రం త్రిజగతః ।
శాస్త్ర స్తుతగుణా దైవం మమశచీ ॥

10. యుక్తస్య భజత శ్శర్మాంత రతులం ।
వర్మాపిచ బహి ర్దైవం మమ శచీ ॥

ఈ జగమంతా వ్యాపించి, మానవ హృదయాలలో ఉండి పుణ్యాత్ములకు అప్సరాలుగా ఉన్న శచీదేవి ఆకాశంలో నిరుపమానమైన శక్తిగా ఉంది. ఆకాశానికి అవలవైపున నిర్మలమైన చిత్‌గా ఉంది. స్వర్గంలో సుందర స్త్రీ రూపాన్ని కలిగి ఉంది. ఇంద్రుడికి శస్త్రంగా, ముల్లోకాలకు (ఆకాశ రూపంలో) వస్త్రంగా ఉంటూ సకల శాస్త్రాలచేతా పొగిడించుకునే గుణాలు కలిగిన శచీదేవియే నా దైవం. యోగ యుక్తంగా ఎవరైతే పూజిస్తారో, అట్టివారి ఆంతర్యంలో సకల సుఖాలను ఇస్తూ, బాహ్యంగా కవచంలా ఉండి రక్షించే శచీదేవియే నా దైవం (ఇది ఇంద్రాణీ విద్యా ఫలం).

11. వీర్యం బలవతాం బుద్ధి ర్మతిమతాం ।
తేదో ద్యుతిమతాం దైవం మమ శచీ ॥

12. ఏకైవ జనయ న్త్యేకైవ దధతీ ।
ఏకైవ లయకృ ద్దైవం మమ శచీ ॥

13. శక్తీ రవితధాః క్షేత్రేషు దధతీ ।
బీజేషుచ పరా దైవం మమ శచీ ॥

14. చిన్వన్త్యపి పచం త్యేకా పశు గణం ।
ఖాదంత్యపి భవే దైవం మమశచీ ॥

15. దృష్టౌ ధృత చితి ర్దృశ్యే తతగుణా ।
విశ్వాత్మ మహిషీ దైవం మమ శచీ ॥

16. రాకా శశిముఖీ రాజీవ నయనా ।
స్వః కాపి లలనా దైవం మమ శచీ ॥

17. స్థాణావపి చరే సర్వత్ర వితతా ।
సాక్షాద్భవతు మే స్వర్నాథ దయితా ॥

బలవంతుల్లో వీర్యమూ, మతిమంతుల్లో బుద్ధీ, కాంతిమంతులలోని తేజస్సూ శచీదేవియే. ఆ శచీదేవి తానొక్కతెగా ఉండి సృష్టినీ చేస్తూ, తానే ధరిస్తూ, తానే లయాన్నీ చేస్తోంది. అంతేకాదు. క్షేత్రాలలో, బీజాలలో కూడా వ్యర్థంకాని శక్తులను ధరించి ఉంది. తానొకతే అయినా జీవరాసుల్లోని సంసారత్రయం (వెదకడం, వండ

టం, నాశనం చేయడం) గా ఉంది. పైగా అందరి చూపుల్లో ఉండే చిత్స్వరూపిణీ, దృశ్యాలలో మనకు గోచరించే గుణ రూపిణి కూడా ఆమే. పూర్ణచంద్రుని వంటి ముఖాన్నీ, పద్మాల్లాటి కళ్లనూ కలిగి ఆమె స్వర్గంలో ఉంది. అటువంటి శచీదేవి నా దైవం. కదలనిది, కదిలేది అనే తేడా లేకుండా అన్నిటా వ్యాపించే ఆ ఇంద్రాణీదేవి నాకు ప్రత్యక్షమగుగాక!

*18.* *యన్మాతరనృతం జుష్టంచ గదితం ।*
*ధ్యాతంచ హరమే తద్దేవి దురితం ॥*

*19.* *మాం మోచయ ఋణా దింద్రాణి సుభుజే ।*
*మా మల్పమతయో మానిందిషు ర జే ॥*

అమ్మా! ఇంద్రాణీదేవీ! నాకు తెలీకుండా నేను ఏదన్నా చేయరానిది చేసినా, పొందరానిదాన్ని పొందినా, చెప్పరానిది చెప్పినా లేదా ధ్యానించినా, దానివల్ల నాకు కలిగే పాపాన్ని తొలగించు. నాకు ఋణ విముక్తిని కలిగించు. అల్పబుద్ధులు నన్ను నిందించకుందురు గాక!

*20.* *శత్రుశ్చ శచిమే సఖ్యాయ యతతాం ।*
*దృప్తశ్చ మనుజో మామంబ భజతాం ॥*

తల్లీ! నా శత్రువైనా సరే, నాతో సఖ్యంగా ఉండేలా చూడు. ఎంత గర్విష్ఠియైనా సరే, అతడు నన్ను సేవించేట్లు చూడు.

*21.* *కష్టం శచి విధూ యేష్టం విదధతీ ।*
*ఆనందయ జనం ప్రేయాం స మిహమే ॥*

*22.* *అస్త్రం మమ భవ ధ్వంసాయ రటతాం ।*
*సుత్రామ తరుణి శ్రీమాతర సతాం ॥*

అమ్మా! శచీదేవీ! కష్టాలను తొలగించి, ఇష్టాలను ఇచ్చే దానివై ఇక్కడున్న నా ప్రియ జనులను సంతోషపెట్టు. నాపై అరుస్తూ ఉన్న దుర్మార్గులను నాశనం చేయడానికి నీవు నా అస్త్రంగా మారు.

*23.* *సంపూరయతు మే సర్వం సురనుతా ।*
*స్వర్గక్షితి పతే శ్శుద్ధాంత వనితా ॥*

*24. సంవర్ధయ శచి స్వందేశ మవితుం ।
బాహోరివ హరే ర్బుద్ధేర్మమ బలం ॥*

దేవతలంతా కీర్తించే ఇంద్రాణీదేవి నా కోర్కెలన్నిటినీ పూర్తిగా తీర్చుగాక! ఓ శచీదేవీ! స్వర్గాన్ని రక్షించదానికి ఇంద్రుడి భుజాలకు బలాన్ని ఇచ్చినట్లు నా బుద్ధిని పెంపొందించు.

*25. ఏతైర్వసుమతీ వృత్తైర్నవ సుమైః ।
భూయాచ్చరణయోః పూజా జనని తే ॥*

అమ్మా! ఓ శచీదేవీ! ఈ వసుమతీ వృత్తాలనే కొత్త పుష్పాలను అర్పిస్తున్నాను. వీటితో నీ పాద పూజ జరుగుగాక!

గాయత్రం శతకంలోని నాలుగవదైన వసుమతీ స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

ఇంద్రాణీ సప్తశతిలోని మొదటిదైన గాయత్రం శతకం పూర్తి అయింది.



# 2. ఔష్ణిహం శతకం

ఔష్ణిహం శతకం అనేది ఇంద్రాణీ సప్తశతిలోని రెండవ శతకం. కుమార లలితా, మదలేఖా, హంసమాలా, మధుమతీ అనే 4 స్తబకాలు కలిసి ఔష్ణిహం అనే శతకం అవుతుంది. ఈ శతకంలో తొలి స్తబకం పేరు కుమార లలితా స్తబకం. చంద్రకాంతివంటి ఇంద్రాణీదేవి చిరునవ్వు, తన బుద్ధికి నిర్మలత్వాన్ని ఇచ్చి తనకు మంచి బలాన్నివ్వాలని కోరుతూ కవి ఈ శతకాన్ని ఆరంభిస్తాడు.

## 2.1. కుమార లలితా స్తబకం

1. *సురేశ్వర మహిష్యా స్స్మితం శశిసితం మే ।*
   *తనోతు మతి మచ్ఛాం కరోతు బల మగ్ర్యం ॥*

అమ్మా! ఇంద్రాణీ! చంద్రకాంతి వంటి తెల్లని నీ చిరునవ్వు నా బుద్ధికి నిర్మలత్వాన్ని ఇచ్చి, మంచి బలాన్ని ఇవ్వాలని కోరుకుంటున్నాను.

2. *విధాయ రిపు ధూతిం నిధాయ సుదశాయాం ।*
   *పులోమ తనుజాతా ధినోతు భరత క్ష్మాం ॥*

ఓ ఇంద్రాణీ దేవీ! శత్రునాశనం చేసి ఈ భరత భూమిని మంచి దశకు తెచ్చి సంతోషపెట్టాలని కోరుకుంటున్నాను.

3. *పద ప్రణత రక్షా విధాన ధృతదీక్షా ।*
   *జగద్భరణ దక్షా పరా జయతి శక్తిః ॥*

4. *స్వర త్యవిరతం సా శనై ర్నభసి రంగే ।*
   *జ్వలత్యధిక సూక్ష్మం జగత్ప్రభవ శక్తిః ॥*

తన పాదాలను శరణుకోరిన వారిని రక్షిస్తూ, ఈ జగత్తును భరింప సమర్థురాలైన ఆ పరాశక్తి ప్రకాశిస్తూ ఉంది. స్వర్గంలో ఎడతెరిపిలేకుండా ప్రకాశించే ఇంద్రాణీశక్తి అధికంగానూ, ఆకాశమంతా సూక్ష్మంగా ఉండే అదే ఇంద్రాణీశక్తి సూక్ష్మంగానూ ప్రకాశిస్తూ ఉంది (స్వర్గంలో స్పష్టంగా ఉండటం వల్ల తేజస్సు ఎక్కువగా

ఉంటుంది. మరి ఆకాశంలో సూక్ష్మంగా ఉండటం వల్ల కొంత అస్పష్టత ఉంటుంది).

5. మహస్తవ సుసూక్ష్మం నిదాన మఖిలానాం ।
భవత్యఖిల మాత ర్జగత్యనుభవానాం ॥

6. జనన్యనుభవానాం మతిత్వపరిణామే ।
స్వరో భవతి మూలం తవాభ్ర హయరామే ॥

7. య ఈశ్వరి నిదానం సమస్త మతి భానే ।
స్వరో గతివిశేషా త్సఏవ ఖలు కాలః ॥

అమ్మా! ఈ జగత్తులో కలిగే అన్ని అనుభవాలకూ నీ అతిసూక్ష్మతేజస్సే ఆధారమవుతోంది. అంతే కాదు. ఈ అనుభవాల జ్ఞాన పరిణామానికి నీ స్వరమే మూలమవుతోంది. ఓ ఈశ్వరీ! ఏ స్వరమైతే సమస్త జ్ఞానానికీ మూలమో, ఆ స్వరమే గతి విశేషం వల్ల కాలమవుతుంది కదా!

8. జ్వలం త్వభిహితా త్వం విహాయసి విశాలే ।
ప్రచండ పదపూర్వా ప్రపంచకరి చండీ ॥

9. స్వరం త్వఖిల బుద్ధి ప్రదా భవసి గౌరీ ।
త్రికాలతను రంబ స్మృతా త్వమిహ కాళీ ॥

ఓ దేవీ! విశాలమైన ఆకాశంలో నీవు ప్రీతిగా వెలుగుతూ ప్రచండ చండిగా ప్రకాశిస్తున్నావు (ఆకాశంలో మహిమతో జ్వలించే శక్తి ప్రచండ చండి. కాబట్టే ఈమె వైద్యుత శక్తి స్వరూపిణి అయింది). ఓ అంబా! స్వర రూపిణివై నీవు అన్నిటికీ బుద్ధినిస్తూ గౌరిగా పేరు పొందావు. మూడు కాలాలనూ శరీరంగా కలిగినందువల్ల ఇక్కడ నిన్ను అందరూ కాళిగా స్మరిస్తున్నారు.

10. మహస్స్వర ఇతీదం ద్వయం తదతిసూక్ష్మం ।
మహేశ్వరి తవాంశ ద్వయం పరమముక్తం ॥

11. మహోతిఽ శయ మాప్తం త్వయి త్రిదివ గాయాం ।
స్వరోతిఽ శయ మాప్తః సితాద్రి నిలయా యాం ॥

12. దివం నయతి పూర్వా భువం యువతి రన్యా ।
ద్వయోః ప్రకృతి రభ్రం విశాలమతి మానం ॥

ఓ ఈశ్వరీ! మహస్సు (కాంతి), స్వరం (శబ్దం) అనే రెండూ అతి సూక్ష్మమైనవి.

ఇవి నీ రెండు ఉత్కృష్టమైన అంశలే. స్వర్గాన్ని పొందిన నీ మహస్సు అతిశయంగా ఉంటే, కైలాసంలో ఉండే నీ స్వరం అతిశయిస్తూ ఉంది (స్వర్గంలో మహస్సు విభూతి యైతే కైలాసంలో ప్రణవమే విభూతి). మొదటిది (అంటే అతిశయించిన మహస్సు) దివాన్ని (ఆకాశం) పొందితే, రెండోది (అంటే అతిశయించిన స్వరం) భువాన్ని (భూలోకం) పొందుతోంది (అంటే, మొదటిది నివృత్తి స్వరూపాన్ని కలిగి ఉంటే, రెండోది ప్రవృత్తి స్వరూపాన్ని కలిగి ఉంది). ఐతే, ఎవరూ కొలవలేని విశాలాకాశమే ఈ రెండిటికీ మూలం (అంటే, సత్ చిత్ ఆనందమే).

*13. నతే దివి లసంత్యాః పితా తనుభృదన్యః ।*
*స్వయం భువ మిమాం త్వాం సతామవని విద్మః ॥*

*14. సురారి కులజన్మా తవేశ్వరి పులోమా ।*
*పితేతి కవిభాషా పరోక్షగతి రేషా ॥*

*15. వదం త్యసుర శబ్దై ర్ఘనం సజలమేతం ।*
*పులోమ పదమేకం పురాణసతి తేషు ॥*

అమ్మా! ఆకాశంలో ప్రకాశించే నీకు శరీరధారియైన తండ్రి అంటూ వేరే ఎవరూ లేరు. అందువల్ల నిన్ను మేమంతా స్వయంభువగా తల్చుకుంటున్నాము (ఐతే పురాణాల్లో పులోముడు ఇంద్రాణికి తండ్రి అని కవులు వర్ణించారు). అందువల్ల ఓ ఈశ్వరీ! రాక్షస కులంలో పుట్టిన పులోముడు నీ తండ్రి అన్న కవుల వర్ణనకు ప్రమాణం లేకుండా పోయింది. అమ్మా, నీటితో కూడిన మేఘాన్ని అసుర శబ్దాలతో వర్ణించారు. అటువంటి శబ్దాల్లో పులోమ అనేది ఒకటి (ఘనం అంటే మేఘం. నిఘంటువుల్లో దీనికి 32 పేర్లున్నాయి. వాటిలో పులోమ ఒకటి).

*16. ప్రకృష్టతర దీప్తి ర్గభీరతర నాదా ।*
*ఇతోహి భవసి త్వం తటి న్మని యశోదా ॥*

*17. అరాతి రసురో ఽ యం విభో ర్నిగదిత స్తే ।*
*హయశ్చ బత గీతః పితా తవ పయోదః ॥*

*18. ప్రియైః కిల పరే వాం పరోక్ష వచనౌఘైః ।*
*ప్రతారిత మివేలా జగన్మని గణేన ॥*

అమ్మా! మునులందరికీ కీర్తినిచ్చే నీవు అత్యధిక కాంతినీ, గంభీరనాదాన్నీ కలిగి మెరుపు రూపంగా ఈ మేఘం నుంచి పుట్టావు (అందువల్ల పులోముడు

ఆమెకు తండ్రి. కానీ, మెరుపు రూపాన్ని కలిగి ఉండే విద్యుచ్ఛక్తి పులోముడనే మేఘానికి పూర్వమే ఆకాశంలో తల్లిగా ఉన్న విషయాన్ని కవులు మరిచారు. అంతే). పులోముడనే రాక్షసుడు నీ భర్త ఇంద్రునికి శత్రువుగా, ఈ మేఘమనే దానిని హయంగా (గుర్రం) వర్ణించారు కవులు. ఓ దేవీ! మీ ఇద్దరి గురించీ ప్రియమైన, రహస్యమైన పదాలతో మునిగణాలు ఈ భూమిని మోసగించారేమో అనిపిస్తూ ఉంది.

*19. నికృష్టమపి రమ్యం యది త్రిదివలోకే ।*
*తవాంబ కిము వాచ్యా రుచి స్త్రిదివ నాథే ॥*

*20. త్వమంబ రమణీయా వధూ స్త్వమివ నాకే ।*
*త్వయా క ఇహ తుల్యాం మృదో వదతు లోకే ॥*

అమ్మా! నికృష్టమైన వస్తువు కూడా స్వర్గంలో ఎంతో అందంగా ఉంటోంది. ఇక స్వర్గాధీశ్వరివైన నీ కాంతి గురించి ఇక ప్రత్యేకంగా చెప్పడానికేముంటుంది. స్వర్గంలో నీవంటి రమణీయమైన స్త్రీ నీవే. ఈ భూలోకంలో నీకు సమానమైన స్త్రీ ఎవరుంటారు చెప్పు?

*21. వినీల మివ ఖాంశం విదు స్త్రిదివ మేకే ।*
*పరస్తు వదతి స్వః కవిః కమల బంధుం ॥*

*22. అముత్ర గతశోకే మహో మహసి నాకే ।*
*నమా మ్యధికృతాం తాం మహేంద్ర కులకాంతాం ॥*

అమ్మా! మిక్కిలి నీలంగా ఉండే ఆకాశాన్నే (నిర్మలాకాశం) కొందరు స్వర్గంగా భావిస్తున్నారు. మరొక కవి సూర్యుడినే స్వర్గంగా వర్ణిస్తున్నాడు. పైలోకాల్లో ఉంటూ దుఃఖం అనేదే లేకుండా ఉండి, అమిత తేజస్సును కలిగి స్వర్గాన్ని అధిష్ఠించి ఉన్న ఓ ఇంద్రాణీదేవీ! నీకు నమస్కరిస్తున్నాను.

*23. యదామ ముత పక్వం మదీయ మఘ ముగ్రం ।*
*తదింద్ర కులకాంతే నివారయ సమగ్రం ॥*

అమ్మా! ఓ ఇంద్రాణీదేవీ! పక్వం అయినా, కాకున్నా నేను చేసిన పెద్ద పెద్ద పాపాలేవైతే ఉన్నాయో వాటిని నివారించు.

*24. దదాతు భరత క్ష్మా విషాద హరణాయ ।*
*అలం బల ముదారా జయంత జననీ మే ॥*

జయంతుని తల్లివీ, ఉదార స్వాభావురాలివీ అయిన ఓ ఇంద్రాణీదేవీ! ఈ భరత ఖండ విషాదాన్ని హరించడానికి నాకు అత్యంత బలాన్నివ్వు.

*25. అతీవ లలితాభిః కుమార లలితాభిః ।*
*ఇమాభి రమరేశ ప్రియా భజతు మోదం ॥*

అతి సుందరమైన ఈ కుమార లలితా వృత్తాల వల్ల ఇంద్రాణీదేవి సంతోషించు గాక!

ఔష్ణిహం శతకంలోని మొదటిదైన కుమార లలితా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 2.2. మదలేఖా స్తబకం

1. పౌలోమ్యాః పరిశుభ్ర జ్యోత్స్నా దృశ్యరుచో మే ।
శ్రీమంతో దరహాసాః కల్పంతాం కుశలాయ ॥

అమ్మా! ఇంద్రాణీ! పరిశుభ్రమైన వెన్నెలవంటి కాంతులతో ప్రకాశిస్తున్న నీ ధరహాసం నాకు క్షేమాన్ని కలిగించు గాక!

2. కారుణ్యామృత సిక్తా శక్తా శక్ర మహిష్యాః ।
ప్రేక్షా భారత భూమే ర్దౌర్బల్యం విధునోతు ॥

దయ అనే అమృతంతో తడిసి శక్తివంతమైన ఇంద్రాణీ వీక్షణం ఈ భారత భూమికి కలిగిన దౌర్బల్యాన్ని హరించుగాక!

3. వందే నిర్జర రాజ్ఞీం సంకల్పేసతి యస్యాః ।
సాధ్యాసాధ్య విచారో నైవస్యాదణు కోపి ॥

4. సంకల్ప స్తవ కశ్చి చ్చిత్తే చేద్దివ ఈశే ।
స్యా దుల్లంఘ్య నిసర్గం సిద్ధిర్నిష్ఫలతావా ॥

5. మూఢోప్యుత్తమ రీత్యా సిద్ధ్యే దధ్యయనేషు ।
మేధావీచ నితాంతం నైవస్యా త్కృతకృత్యః ॥

6. ఉత్పద్యేత మహేశ్వ ర్యప్రాజ్ఞాదపి శాస్త్రం ।
యా యాన్మాతరకస్మా ద్విభ్రాంతిం విబుధోపి ॥

7. అల్పానామ బలానాం సంగ్రామే విజయస్యాత్ ।
శక్తానాం బహులానాం ఘోరాస్యా త్పరిభూతిః ॥

8. రాజేరన్నృప పీఠే ష్వఖ్యాతాని కులాని ।
స్యాద్దుర్ధర్ష బలానాం పాతో రాజకులానాం ॥

9. నిర్యత్నోపి సమాధే ర్విందేద్దేవి సమృద్ధిం ।
యోగస్యాంబ నవశ్యే దభ్యస్యన్నపి సిద్ధిం ॥

10. అత్యంతం యదసాధ్యం నేదిష్ఠం భవతీదం ।
సాధ్యం సర్వ విధాభి స్స్యా దింద్రాణి దవిష్ఠం ॥

ఏ దేవి సంకల్పిస్తే సాధ్యాసాధ్య విచారం ఇసుమంతైనా ఉండదో, అలాటి

ఇంద్రాణీదేవికి నా నమస్కారం. ఓ ఇంద్రాణీదేవీ! నీవు సంకల్పిస్తే సిద్ధి, నిష్ఫలత అనేవి తమ నైసర్గిక రీతిని అతిక్రమించైనా సరే జరిగి తీరుతాయి. నీ సంకల్పాన్ని బట్టి మూఢుడైనా సరే ఉత్తమమైన రీతిలో విద్యలలో సిద్ధి పొందగలడు. అత్యంత మేధావియైనా సరే. నీ సంకల్పం లేకపోతే సిద్ధిని పొందలేడు. అంతే కాదు. నీవు సంకల్పిస్తే మూఢునివల్ల శాస్త్రం ఉత్పన్నం కావచ్చు. పండితుడైనా అకస్మాత్తుగా భ్రాంతికి లోనుకావచ్చు. బలహీనులై తోడుగా కొద్దిమందే ఉన్నా సంగ్రామంలో విజయాన్ని పొందవచ్చు. ఎంతోమంది ఉండి శక్తిమంతులై ఉన్నా ఘోర పరాజయాన్ని పొందవచ్చు. అదే విధంగా, కీర్తిలేని వంశాలు రాజసింహాసనంపై కూచొని ప్రకాశించ వచ్చు. ఎంతో బలంగల రాజకులాలు నశించనూవచ్చు. అంతే కాదు, ఎలాటీ ప్రయత్నమూ చేయనివారు పూర్ణ సమాధిని పొందవచ్చు. యోగ సిద్ధి కోసం ఎంతో ప్రయత్నిస్తున్నవారు దానిని పొందలేకపోవచ్చు.

ఓ ఇంద్రాణీదేవీ! ఏది అత్యంత అసాధ్యమో అది సమీపంగా రావచ్చు. అన్ని విధాలా సాధ్యమైనది దూరంగా పోవచ్చు.

*11. గాయమో మునిసంఘై ర్గేయాం కామపి మాయాం ।*
*ఇంద్రస్యాపి వినేత్రీం త్రైలోక్యస్యచ ధాత్రీం ॥*

మునులందరూ కలిసి సంఘంగా ఏర్పడి గానం చేసే ఇంద్రుని కూడా శాసించే త్రిలోక జననియైన ఒకానొక మాయను మేము గానం చేస్తున్నాం (కీర్తిస్తున్నాం).

*12. విద్యానామధినాథే కాం విద్యాం శ్రయసే త్వం ।*
*ఇంద్రం కర్తుమధీనం విశ్వస్మా దధికం తం ॥*

*13. నిత్యాలిప్త మనీషే స్త్రీ మోహో నవితర్క్యః ।*
*భ్రూ చేష్టానుచరత్వా దన్యాస్యా దనుకంపా ॥*

*14. సౌందర్యం పరమన్య ద్వజ్రేశ్వర్యథవా తే ।*
*హర్తుం యత్సుఖమీష్టే తాదృక్ తస్యచ చిత్తం ॥*

సకల విద్యలకూ అధిదేవతవైన నీవు ఈ విశ్వం కన్నా గొప్పవాడైన ఆ ఇంద్రుని వశం చేసుకోవడానికి నీవు ఏ విద్యనేర్చావు తల్లీ? స్త్రీ మోహాన్ని ఊహించలేం. నీ కను బొమ్మల చేష్టలకు అనుచరుడైనందువల్ల అతనిపై చెప్పలేని దయ చూపి ఉంటావు. అలా కాకపోతే, నీ సౌందర్యం ఎంతో గొప్పదీ, అసాధారణమైందీనూ! నీ సౌందర్యం అతని చిత్తాన్ని సులభంగా లొంగదీసుకోడానికి సమర్థవంతమైనదే.

15. చక్షుదర్శన మాత్రా న్నిస్తేజో విదధానం ।
చిత్తంచో ఝ్ఝితధైర్యం మత్తానాం దనుజానాం ॥

16. గర్తే దుర్జన దేహే మగ్నాన్పంక విలగ్నాన్ ।
ప్రాణానాత్మ సజాతీ నుద్ధర్తుం ధృత దీక్షం ॥

17. వజ్రం నిర్జరరాజో యద్ధత్తే సమరేషు ।
త్వ చ్ఛక్తే కలయైత న్మన్మాత ర్నిరమాయి ॥

ఓ ఇంద్రాణీదేవీ! మత్తులైన దనుజుల మనస్సులను నీ కళ్లు తన వీక్షణ మాత్రాన ధైర్య తేజో విహీనం చేస్తూ ఉంది. దుర్జన దేహమనే గోతిలో పడిపోయి, పాపమనే బురదలో కూరుకుపోయి, ఆత్మ సంబంధమైన ప్రాణాలను ఉద్ధరించడానికి దృఢమైన దీక్ష పూనిన ఆ ఇంద్రుడు యుద్ధంలో ఎలాంటి వజ్రాయుధాన్ని ధరించాడో, ఆ వజ్రం నీ శక్తితోనే నిర్మితమైంది (ఇక్కడ మనం ఒక విషయాన్ని గమనించాలి. మన వెన్నెముకనే వజ్రదండం అనీ అంటారు. దానిలో మన దేహాన్ని శాసించే ఆత్మశక్తి ప్రవాహం సుషుమ్నా నాడిని ఆశ్రయించి ఉంటుంది. ఆ శక్తే వజ్రాయుధ శక్తిగా ఇంద్రుడైన ఆత్మ ధరించినట్లు ఉంటుంది. దాని అనుగ్రహం పొందిన యోగికి శరీరాన్ని అంటిన పాపాలు నశించి, నాడీ గ్రంధులు వీడిపోతాయి. వాశిష్ఠమునికి కపాలభిన్న సిద్ధినిచ్చింది ఈ శక్తియే).

18. రాజ్ఞీ త్వాత్పరమే తే రాజత్వం శతమన్యోః ।
నిశ్శక్తిస్సవినా త్వాం కామాజ్ఞాం కురుతాం నః ॥

19. సర్వం శక్ర నిశాంత స్యేశానే తవ హస్తే ।
అస్మాకంతు ధియేదం స్తోత్రం సంగ్రహతస్తే ॥

ఓ ఇంద్రాణీదేవీ! నీవు రాజ్ఞివి కావడంవల్లే ఇంద్రుడికి రాజత్వం వచ్చింది. నీవే లేకుంటే అతడు అశక్తుడైపోయి ఉండేవాడు. అపుడతను మమ్మల్ని ఎలా ఆజ్ఞాపించగలడు? చెప్పాలంటే, ఇంద్రలోకంలో ఉండే సమస్త విశేషాలూ నీ చేతిలోనే ఉన్నాయి. ఈ స్తోత్రం కూడా మాకున్న స్వల్పబుద్ధితో సంగ్రహంగా చేస్తున్నాం.

20. గంతవ్యం స్వరధీశే నిశ్శేషార్పణ శూరం ।
బిభ్రాణా నయసి త్వం మూర్ధానీవ కిశోరం ॥

21. గృహ్ణాన్నంబరనాథా మంబామశ్లథ బంధః ।
కిశస్యేవ కిశోరో యోగీ గచ్ఛతి గమ్యం ॥

ఓ ఇంద్రాణీదేవీ! మార్జాల కిశోర న్యాయంలా తనను పూర్తిగా అర్పించుకొన్న శూరుని నీవు భరిస్తూ అతని గమ్యస్థానానికి చేరుస్తున్నావు (భగవాన్ రమణులే దీనికి ఉదాహరణ). అదే ఆకాశానికి ప్రభువివీ, తల్లివీ అయిన నిన్ను విడువకుండా పట్టుదలతో గ్రహించుచున్న యోగి (అంటే వాశిష్ఠ మునియే) మర్కట కిశోర న్యాయం గా గమ్యస్థానాన్ని చేరుతున్నాడు.

*22.* *పూర్ణాత్మార్పణ హీనోఽ ప్యజ్ఞాతాఽ పి సమాధేః ।*
*నిత్యం యో జగదంబ త్వాం సేవేత జపాద్యైః ॥*

*23.* *తం చాఽ చంచల భక్తిం కృత్వాపూరిత కామం ।*
*నిష్ఠాం దాస్యసి తస్మై పౌలోమి క్రమశ స్త్వం ॥*

ఓ ఇంద్రాణీదేవీ! సంపూర్ణంగా ఆత్మార్పణ చేయనివాడైనా, సమాధి గురించిన జ్ఞానం లేనివాడైనా, ఎవడైతే నిన్ను నిత్యం జపాదులతో సేవిస్తాడో, అతనిని నీవు అచంచల భక్తిగల వానిగా చేసి, అతని సకల కోరికలనూ తీర్చి క్రమంగా ఆత్మ నిష్ఠనిస్తావు (ఇది కూడా వాశిష్ఠ గణపతిముని స్వానుభవమేనని వేరే చెప్పనక్కరలేదు).

*24.* *భిన్నాం సంఘ సహస్రైః ఖిన్నాం శత్రుభరేణ ।*
*పాతుం భారతభూమిం మాతర్దేహి బలంనః ॥*

ఓ ఇంద్రాణీదేవీ! వేల కొలది సంఘాలుగా విడిపోయి, శత్రుభారంతో ఖిన్నురా లైన ఈ భారతదేశాన్ని రక్షించడానికి మాకు అత్యంత బలాన్నివ్వు.

*25.* *త్రైలోక్యావన భార శ్రాంతాం వాసవకాంతాం ।*
*హైరంబ్యో మదలేఖా స్సమ్య క్సమ్మదయంతు ॥*

ముల్లోకాలనూ భరించడంవల్ల అలసిపోయి ఉన్న ఇంద్రాణీదేవికి గణపతి చేసిన ఈ మదలేఖావృత్తాలు సంతోషాన్నిచ్చుగాక!

ఔష్ణిహం శతకంలోని రెండవదైన మదలేఖా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 2.3. హంసమాలా స్తబకం

1. సురుచి ర్వజ్రపాణే స్సుదృశో మందహాసః ।
   హరతా న్మోహ మూలం హృదయస్థం తమో మే ॥

అమ్మా! ఇంద్రాణీ! ఎంతో కాంతివంతమైన నీ చిరునవ్వు, మోహానికి కారణమైన నా హృదయంలోని అజ్ఞానాన్ని నశింపజేయుగాక!

2. అమృతం సంకిరం త్యా ప్రసరం త్యేహ దృష్ట్యా ।
   సురరాజ్ఞీ బలాఢ్యాం భరతక్ష్మాం కరోతు ॥

అమృతాన్ని చిమ్ముతూ ఈ లోకంలో ప్రసరించే ఇంద్రాణీదేవి దృష్టి భారత భూమికి బలాన్నిచ్చుగాక!

3. అమృతాంభః కిరంతీ కరుణాంభో వహంతీ ।
   నత రక్షాత్త దీక్షా శచిమాత స్తవేక్షా ॥

4. కృత పీయూష సృష్టి స్తత కళ్యాణ సృష్టిః ।
   విహితై నో వినష్టి ర్ధృత విజ్ఞాన పుష్టిః ॥

5. భృత దేవేంద్ర తుష్టి ర్యమినాం దేవ గృష్టిః ।
   మమ కామ్యానిదేయా త్తవ విశ్వాంబ దృష్టిః ॥

అమ్మా! ఇంద్రాణీ! నీ చూపు అమృతజలాన్ని చిమ్మేలాగా, కారుణ్యజలాన్ని కలిగి అణకువగా ఉండేవారిని రక్షించడానికి దీక్ష పూనినట్లుంది. అమృతాన్ని సృష్టించేదీ, సన్మంగళాలను ఇచ్చేదీ నీ దృష్టే. పాపాలను హరించేదీ, విజ్ఞానాన్ని పెంపొందించేదీ నీ దృష్టే. దేవేంద్రుడికి తృప్తిని కలిగించేదీ, నియమ నిష్ఠలతో పూజించేవారికి కామధేనువై ఉండేదీ నీ దృష్టే. అటువంటి నీ దృష్టి నాకోర్కెను దీర్చుగాక!

6. జగతాం చక్రవర్తి న్యసితస్తే కటాక్షః ।
   జలదో భక్తిభాజాం శిఖినాం నర్తనాయ ॥

7. సుకృతీ కోపి నాట్యే బహుళే తత్ర మాతః ।
   జగతే సార భూతా నుపదేశా న్కరోతి ॥

8. అపరో నవ్య కావ్యా న్యనవద్యాని ధన్యః ।
   విదధా త్యప్రయత్నా ద్బుధ భోగక్షమాణి ॥

ఓ తల్లీ! ఇంద్రాణీ! నీ కటాక్షం (నల్లని చూపు) అనేది భక్తులనే నెమళ్లు నాట్యం చేసేందుకై మేఘమవుతూ ఉంది (దేవీ కటాక్షం కాటుక కంటి సంబంధమైనది. నల్లని కాటుక కళ్ల చూపును కవి నల్లని మేఘంతో పోల్చాడు). విస్తారమైన ఆ నాట్యంలో ఒకానొక మహాత్ముడు ఈ జగత్తు కోసం శ్రేష్ఠమైన ఉపదేశాన్నిస్తాడు (అంటే, దేవీ కటాక్షం ప్రేరేపించడంవల్ల శ్రీరమణమహర్షి ఉపదేశాన్నిస్తారన్నది కవి భావన). ధన్యజీవియైన మరొకడు పండితులంతా ఆస్వాదించే దానికోసం ఒక నూతన కావ్యాన్ని అప్రయత్నంగా వ్రాస్తాడు (అంటే కావ్యకంఠముని తానే దేవీ కటాక్షంవల్ల ఈ రచన చేస్తున్న వైనాన్ని తెలుపుతున్నాడు).

*9. ఇతరో భాగ్యశాలీ రమణీయైః ప్రసంగైః ।*
*వితనోతి స్వజాతిం జగతి శ్రేష్ఠ నీతిం ॥*

*10. జగతాం మాతరేకో మహసా పుణ్యశాలీ ।*
*విధుతారిః స్వదేశం కురుతే వీతపాశం ॥*

*11. పర ఇంద్రాణి సాధు ర్భత విస్మృత్య విశ్వం ।*
*రమతే సిక్త గండః ప్రమదాశ్రు ప్రతానైః ॥*

ఓ తల్లీ! ఇంద్రాణీ! ఈ లోకంలో ఒక అదృష్టవంతుడు తన అందమైన ప్రసంగాలతో తన జాతివారిని శ్రేష్ఠమైన నీతిమంతులుగా చేస్తున్నాడు (ఇది దివ్యజ్ఞాన సమాజ వ్యవస్థాపకుడైన కల్నల్ ఆల్కాట్ గురించిన ప్రస్తావన). మరొక పుణ్యాత్ముడు తన తేజస్సుతో శత్రువులను పారద్రోలి భారతదేశానికి దాస్యవిముక్తిని కలిగిస్తున్నాడు (ఇది, నాటి దేశ భక్తుల్లో ఎవరైనా కావచ్చు). సాధువైన మరొకడు ఈ విశ్వాన్నే మరచి ఆనందభాష్పాలతో తడిసిన చెక్కిళ్లతో ఆశ్చర్యంగా ఆడుతున్నాడు (ఇది అరవిందులను ఉద్దేశించినది).

*12. తవరాగార్ద్ర దృష్ట్యా దివి శక్రస్య నాట్యం ।*
*కరుణా సిక్త దృష్ట్యా భువి భక్తస్య నాట్యం ॥*

*13. తవ సప్రేమ దృష్టి ర్బల మింద్రే దధాతి ।*
*తవ కారుణ్య దృష్టి ర్బల మస్మాసు ధత్తాం ॥*

ఓ తల్లీ! నీ అనురాగ దృష్టి స్వర్గంలో దేవేంద్రునికి నాట్యం అయితే, నీ కరుణార్ద్ర దృష్టి భూమిపైన నీ భక్తులకు నాట్యమవుతుంది. ప్రేమతో కూడిన నీ దృష్టి ఇంద్రుడికి బలానిస్తుంది. కరుణతో కూడిన నీ దృష్టి మాకు బలమిచ్చుగాక!

14. తవ వామాః కటాక్షాః ప్రభు మానందయంతు ।
ఉచితో దక్షిణానా మయమ స్త్రీక్షణానాం ॥

15. సుకృతానాం ప్రపోషం దురితానాం విశోషం ।
కరుణార్ద్రా విభాంతీ తవ దృష్టిః క్రియాన్నః ॥

ఓ తల్లీ! నీ రమ్యమైన కటాక్షమనేది (ఎడమకంటి చూపు, వామదృష్టి) ఇంద్రుడిని ఆనందపరుస్తుంది. నీ ఉదారమైన కటాక్షం (దక్షిణ దృష్టి) ఈ జీవుడిపై ప్రసరింపజేయి. కరుణతో ప్రకాశించే నీ చూపు మాకు పుణ్యాన్ని పంచి, పాపాలను హరించేలా చూడు.

16. కురుపాదాబ్జ బంధో స్సరణిం నిస్తమస్కాం ।
శచి విజ్ఞాన తేజః కిరతా వీక్షి తేన ॥

17. క్రియ యారాధయంతో భువనే తే విభూతీః ।
ఇహ కేచిల్లభంతే తవ మాతః కటాక్షాన్ ॥

18. స్ఫుట విజ్ఞాన పూర్వం ప్రభజే రన్యది త్వాం ।
స్థిరయా దేవి భక్త్యా కిము వక్తవ్య మీశే ॥

ఓ శచీదేవీ! విజ్ఞాన తేజస్సును ప్రసరింపజేసే నీ చూపు, నీ పాదాలనే నమ్మిన నాకు నాదారిలో చీకటి లేకుండా కాంతివంతంగా ఉండేలా చూడు. క్రియతో ఆరాధించే కొందరు నీ దయ వల్ల ఈ భువనంలో ఉండే సంపదలను (విభూతులను అంటే సంపదలే కాదు, బలాలు, శక్తులూనూ) ఈలోకంలోనే పొందుతున్నారు. ఇక నిశ్చలమైన భక్తితో, సరైన విజ్ఞానంతో నిన్ను కొలిచేవారు కూడా నీ అనుగ్రహానికి పాత్రులవుతారని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

19. కువి ధే ర్విస్మరంతీ భరతక్ష్మా శచి త్వాం ।
బహుకాలా దభాగ్యే పతితా దేవ్య యోగ్యే ॥

20. అభిషిక్తస్యమాతా తవ తేజోంశ భూతా ।
సుదశాం సేవమానా మనయ త్వశ్చి మాశాం ॥

21. అయి కాలం కియంతం దయసే పశ్చిమస్యాం ।
ఇత ఇంద్రాణి పూర్వా మవలోక స్వ దీనాం ॥

ఓ శచీదేవీ! దురదృష్టం కొద్దీ నిన్ను మర్చిపోయిన ఈ భారత భూమి చాలా కాలంనుంచీ అయోగ్యమై, అభాగ్య దశకు పతనమయ్యింది. అభిషిక్తుని తల్లిగా

(అంటే నాటి బ్రిటిష్ సామ్రాజ్ఞి - విక్టోరియా మహారాణి) నీ తేజపు అంశ జన్మించి ఆ పశ్చిమ దేశవాసులను మంచి దశకు తెచ్చింది. ఐతే, ఇలా ఎంతకాలం కేవలం పశ్చిమదిక్కు పట్ల మాత్రమే నీవు దయతో ఉంటావు? దీనురాలైన ఈ తూర్పుదిక్కు వైపు (భారతదేశం వైపు) కూడా చూడవమ్మా ఇంద్రాణీ దేవీ!

*22. న వయం పశ్చిమస్యా శ్చచి యాచామ నాశం ।*
*కృపయైతాంచ పూర్వాం నిహతాశా మవాశాం ॥*

*23. సకలం వ్యర్థమాసీ దయి దీనేషు దృష్టా ।*
*తవ విశ్వస్య మాతః కరుణైకాఽ వ శిష్టా ॥*

ఓ శచీదేవీ! మేమేమీ పశ్చిమదిక్కు నాశనాన్ని కోరడం లేదు. నిరాశతో ఉన్న తూర్పుదిక్కును (అంటే భారతదేశాన్ని) దయచూపి రక్షిస్తావని ఆశపడుతున్నాం. అమ్మా, ఈ దీనుల విషయంలో అన్నీ వ్యర్థమైపోయాయి. కేవలం నీ దయ మాత్రమే ఇక మిగిలి ఉంది.

*24. సుర రాజస్య కాంతే నరసింహస్యసూనుం ।*
*బలవంతం కురుత్వం భరతక్ష్మాఽ వనాయ ॥*

తల్లీ! ఇంద్రాణీ దేవీ! భరత భూమి రక్షణ కోసం నీవు నరసింహపుత్రుడైన ఈ గణపతిని బలవంతునిగా చేయి.

*25. రుచిరాభిర్ని జాభి ర్గతిభిర్హర్షయంతు ।*
*మరుతాం భర్తు రేతా స్తరుణీం హంసమాలాః ॥*

ఓ ఇంద్రాణీ దేవీ! ఈ హంసమాలా వృత్తాలలో నేను సలిపిన మనోహరమైన గతులు (పదాల విన్యాసం) నీకు సంతోషాన్నిచ్చుగాక!

ఔష్ణిహం శతకంలోని మూడవదైన హంసమాలా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 2.4. మధుమతీ స్తబకం

1. *దిశి దిశి ప్రసర ద్రుచి తమో దమనం ।*
*హరతు మే దురితం హరి వధూ హాసితం ॥*

2. *హరతు దుఃఖభర ప్రసృత మశ్రుజలం ।*
*భరత భూసుదృశో బలజితో రమణీ ॥*

అన్ని దిక్కులకూ ప్రసరించే కాంతిగల ఇంద్రాణీదేవి చిరునవ్వు, నా పాపాలను నశింపజేయుగాక! దేవేంద్రుని భార్యయైన ఆ ఇంద్రాణి, భారతభూమి అనే ఈ కాంతకు ఉన్న దుఃఖభారం వల్ల ప్రవహించే కన్నీటిధారలను హరించుగాక (భారత మాత దుఃఖాన్ని పోగొట్టుగాక).

3. *అతితరాం మహితా సురపతే ర్వనితా ।*
*కరుణయా కలితా మమ శచీ శరణం ॥*

4. *త్రిభువన క్షితి రా ద్భవన భూషక భా ।*
*అఖిల భాసక భా మమ శచీ శరణం ॥*

5. *సతత యుక్త సుధీ హృదయ దీపక భా ।*
*నిఖిల పాచక భా మమ శచీ శరణం ॥*

6. *రవి విరోచక భా శశి విరాజక భా ।*
*భగణ శోభక భా మమ శచీ శరణం ॥*

7. *గగన ఖేలక భా సకల చాలక భా ।*
*అమృత దాయక భా మమ శచీ శరణం ॥*

ఎంతో దయ కలిగిన, అత్యంత పూజనీయమైన దేవేంద్రుని భార్యయైన శచీ దేవిని శరణు వేడుతున్నాను. మూడులోకాలకూ అధిపతియైన ఆ ఇంద్రుడి భవనమైన అమరావతిని అలంకరింపజేసే కాంతి కలిగి, సర్వానికీ (నిఖిలానికి) తేజస్సునిచ్చే కాంతినీ కలిగి ఉంది ఆ శచిదేవి. నిత్యమూ యోగయుక్తులై ఉండే పండితుల హృదయా లకు వెలుగై సర్వానికి పరిపక్వాన్నిచ్చేదీ ఆ శచిదేవియే. అంతే కాదు. సూర్యుని ప్రకాశింపజేసే వెలుగును, చంద్రునిలో విరాజమానమైన కాంతినీ కలిగింది శచీదేవి. నక్షత్రాలలో శోభనిచ్చే కాంతినీ కలిగి ఉందామె. ఆకాశంలో ఆడుకునే కాంతి, సకలాన్నీ చలింపజేసే కాంతి, అమృతాన్ని ఇచ్చే కాంతినీ ఆమె కలిగి ఉంది. అటువంటి శచిదేవిని

నేను శరణు వేడుతున్నాను.

8. రుచిలవంగతయా య దనఘాంశు నిధేః ।
హృత తమో భవనం భవతి దీపికయా ॥

9. స్ఫురతి చారు యతః కిరణమేక మితా ।
జలధ సౌధతలే ముహురియం చపలా ॥

10. భజతి యద్ద్యుతితః కమపి భాగ మితః ।
పవి రరాతి హరః ప్రహరణేశ పదం ॥

11. భవతి యత్స్ఫురుచే రణుతమాంశ మితా ।
యువ మనో మదనీ సువదనా స్మితభా ॥

12. వితత సూక్ష్మతను ర్మహతి సా గగనే ।
పరమ పురుష భా మమశచీ శరణం ॥

పాపాల్లేని (పవిత్రమైన) కిరణాలకు నిధి అయిన ఏ దేవి అయితే తన కాంతి రేఖతో కల్పించిన దీపం (విద్యుద్దీపం) వల్ల ఇళ్లలోని చీకటిని నశింపజేస్తున్నదో, ఏ దేవి కాంతి నుండి ఒక్క కిరణాన్ని పొందిన మెరుపు మేఘాల మధ్య మాటిమాటికి మెరుస్తూ ఉందో, ఎవరి కాంతి నుంచి అతి కొద్దికాంతిని పొందిన వజ్రం మేటి ఆయుధంగా శత్రువులను నాశనం చేస్తున్నదో, అతి గొప్పదైన ఆకాశంలో వ్యాపించి సూక్ష్మదేహం కలిగి ఆ పరమ పురుషుని ప్రకాశింపజేస్తూ ఉన్నదో, ఆ శచీదేవియే నాకు శరణు.

13. అమరనాధ సఖీ రుచి నిధాన ముఖీ ।
అమృత వర్షక దృ ఙ్మమ శచీ శరణం ॥

14. అవిధవా సతతం యువతిరేవ సదా ।
అనఘ వీరసుతా మమశచీ శరణం ॥

15. అమృత వత్యధరే సురధరా పతయే ।
చరణయోర్భజతే మమశచీ శరణం ॥

దేవేంద్రుని సఖీ, సకలకాంతులకు నిధీ అయిన ముఖవర్చస్సును కలిగి, అమృతాన్ని కురిపించే చూపులు కలిగింది ఆ శచీదేవి. నిత్య సువాసిని, సదా యౌవనవతిగా పాపరహితులైన వీరులనే పుత్రులుగా కలిగిందీ ఆ శచీ దేవియే.

ఇంద్రుని కోసం పెదవుల్లోనూ, భక్తుల కోసం పాదాలలోనూ అమృతాన్ని ధరించింది. అటువంటి శచీదేవియే నాకు శరణు.

*16. స్మితలవేషు సితా శిరసిజే ష్వసితా ।*
*చరణయో రరుణా బహిరపి త్రిగుణా ॥*

చిరునవ్వులో తెల్లగానూ, కేశాలలో నల్లగానూ, పాదాలలో ఎర్రగానూ ఉండి ఇలా బాహ్యంగా కూడా ఆ ఇంద్రాణీదేవి త్రిగుణాత్మకంగా ఉంది.

*17. కపట చంద్రముఖీ ప్రకృతి రింద్రసఖీ ।*
*మృతి జరా రహితా మమ శచీ శరణం ॥*

*18. కృశతమే ప్యుదరే త్రిభువనం దధతీ ।*
*జనిమతాం జననీ మమ శచీ శరణం ॥*

*19. స్థిరతరా మనసి స్థిరతమా వచసి ।*
*నయనయోస్తరళా మమ శచీ శరణం ॥*

*20. మృదుతరా కరయో ర్మృదుతమా వచసి ।*
*కఠిన దుగ్ధ ధరా మమ శచీ శరణం ॥*

*21. మృదుల బాహులతా ప్యమిత భీమ బలా ।*
*అసుర దర్పహరీ మమ శచీ శరణం ॥*

*22. అబలయాపి యయా న సదృశోఽస్తి బలే ।*
*జగతి కశ్చన సా మమ శచీ శరణం ॥*

*23. అతితరాం సదయా పదరతే మనుజే ।*
*ఖలజనే పరుషా మమ శచీ శరణం ॥*

చంద్రముఖీ, ఇంద్రసఖీ, జననమరణాతీతమైన మూల ప్రకృతీ ఆ శచీదేవి. అతి చిన్న కడుపులో కూడా త్రిభువనాలను ధరిస్తూ జీవకోటికి ఆమె తల్లిగా ఉంది. ఆమె మనస్సులో అతి స్థిరంగా, వాక్కులో అత్యంత స్థిరంగా ఉంటుంది. కళ్లలో మాత్రం చాంచల్యాన్ని చూపిస్తుంది. సున్నితమైన చేతులు ఉండి, అత్యంత మృదువైన వాక్కును, కఠినమైన వక్షాలను కలిగి ఉంది. చేతులెంతో సున్నితంగా ఉన్నా అమితమైన బల పరాక్రమాలను కలిగి రాక్షసుల గర్వాన్ని అణిచివేసింది. స్త్రీ కాబట్టి ఆమెను అబల అనాలి. కానీ, బలం విషయానికొస్తే ఏ దేవీ ఈమెకు సాటి రాదు. తన

పాదాలను ఎవరైతే శరణువేడుతారో అటువంటి మనుష్యులపై అపారమైన దయను కురిపిస్తుంది. కానీ దుర్మార్గులపాలిట మాత్రం ఆమె కఠినాత్మురాలు. అంత గొప్ప శచీదేవిని నేను శరణువేడుతున్నాను.

*24. అమర భూమిపతి ప్రియతమే కురు మే ।*
*భరత భూమ్యవన క్షమతమాం ధిషణాం ॥*

అమ్మా! ఇంద్రాణీ! నాకు ఈ భారతభూమిని రక్షించడానికి కావలసినంత బుద్ధిని ఇవ్వు.

*25. మధుర శబ్దతతీ ర్మధుమతీ రజరా ।*
*గణపతే శ్శృణుయా త్సురపతే స్తరుణీ ॥*

ముసలితనమే లేని ఇంద్రాణీదేవి, మధురమైన శబ్దాలతో కూర్చిన ఈ గణపతి సంబంధమైన మధుమతీ వృత్తాలను వినుగాక!

ఔష్ణిహం శతకంలోని నాలుగవదైన మధుమతీ స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

ఇంద్రాణీ సప్తశతిలోని రెండదైన ఔష్ణిహం శతకం పూర్తి అయింది.



# 3. అనుష్టుభం శతకం

అనుష్టుభం శతకం అనేది ఇంద్రాణీ సప్తశతిలోని మూడవ శతకం. పథ్యావక్త్ర, మాణవక, చిత్రపదా, నారాచికా అనే 4 స్తబకాలు కలిసి అనుష్టుభం అనే శతకం అవుతుంది. ఈ శతకంలో తొలి స్తబకం పేరు పథ్యావక్త్ర స్తబకం. ఇందులో **మహాశక్తి అయిన ఇంద్రాణీదేవి మందహాసం మా భ్రమలను తొలగించుగాక!** అంటూ కవి తన శతకాన్ని ఆరంభిస్తాడు.

## 3.1. పథ్యావక్త్ర స్తబకం

*1.* *హసితం తన్మహాశక్తే రస్మాకం హరతు భ్రమం ।*
*యత ఏవ మహచ్చిత్రం విశ్వ మేత ద్విజృంభతే ॥*

మహాశక్తి అయిన ఇంద్రాణీదేవి మందహాసం మా భ్రమలను తొలగించు గాక! ఎందుకంటే గొప్పదైన, చిత్రమైన ఈ విశ్వాన్ని ప్రకాశింపజేసేది ఈ మంద హాసమే.

*2.* *రాజంతీ సర్వభూతేషు సర్వావస్థాసు సర్వదా ।*
*మాతాసర్గస్య చిత్రూపాత్ పౌలోమీ భారత క్షితిం ॥*

సర్వ భూతాల్లోనూ, సర్వావస్థలలోనూ, అన్నికాలాల్లో విరాజిల్లుతూ ఈ ప్రపంచానికే తల్లియైన చిత్స్వరూపిణి ఇంద్రాణీదేవి ఈ భారతదేశాన్ని రక్షించుగాక!

*3.* *ధర్మి జ్ఞానం విభోస్తత్వం ధర్మోజ్ఞానం సవిత్రి తే ।*
*వ్యవహృత్యై విభాగోஉయం వస్త్వేకం తత్త్వతో యువాం ॥*

*4.* *ఇంద్రేశ వాసుదేవాద్యైః పదైస్సంకీర్త్యతే విభుః ।*
*శచీ శివా మహాలక్ష్మీ ప్రముఖై ర్భవతీ పదైః ॥*

ఓ ఇంద్రాణీదేవీ! ధర్మి భూతమైన ప్రజ్ఞానం ప్రభువైన ఇంద్రుడి తత్వం అనీ, దాని ధర్మం అనే జ్ఞానం నీతత్వమనీ చెప్పడం కేవలం మాటల్లో చెప్పుకోదానికి సరిపోతుంది. కానీ తత్వ రీత్యా మీరిద్దరూ ఒకటే. ఆ ప్రభువు ఇంద్రుడు, ఈశ్వరుడు, వాసుదేవుడు మొదలైన పేర్లు కలిగి ఉన్నాడు. నీవు శచీ, శివా, మహాలక్ష్మి అనే పేర్లు

కలిగి ఉన్నావు.

5. అంతరం వస్తునోజ్ఞాతృ తచ్ఛక్తం పరిచక్షతే ।
శాఖా స్సమంతతో జ్ఞానం శక్తిం సంకీర్తయంతి తాం ॥

6. అంతరస్యచ శాఖానా మైక్యం నిర్విషయ స్థితౌ ।
విషయ గ్రహణేష్వేవ స విభాగః ప్రదృశ్యతే ॥

7. స్యాదేవం విషయాపేక్షీ శాఖానామంతరస్యచ ।
అవిభక్తైక రూపాణాం విభాగో హరితామివ ॥

ఒక వస్తువు అంతర్యం జ్ఞాత. ఆ జ్ఞాతనే శక్తుడంటారు. వ్యాప్తమైన శాఖలే జ్ఞానం. దానిని శక్తి అని అంటారు (క్రియా జ్ఞానం ఒకటైతే, కర్తృజ్ఞానం ఇంకొకటి. మహిమ వ్యాప్తమయ్యే దానిని అనుసరించి జ్ఞానం ఇలా విభాగమయ్యింది). శాఖలకూ, ఆంతర్యానికీ ఒక విభాగం అనేది దాని విషయాన్ని బట్టి ఉంటుంది. విభజించడానికి వీల్లేని ఏకైక రూపాన్ని విభజించే ప్రయత్నం చేస్తే అది దిక్కులను విభజించడమే అవుతుంది (విషయస్ఫూర్తి లేనపుడు విషయిస్ఫూర్తి ఉండక మిగిలేది అవిభాజ్యమైంది).

8. లక్ష్యమంతర్వయం చక్రే ధ్యాయామో యత్ర నిష్ఠితాః ।
అంతరీభావత స్తస్య నాంతరంతు విలక్షణం ॥

మేము నిష్ఠగా ఏ చక్రంలోనైతే (మూలాధార చక్రంలో) అంత లక్ష్యాన్ని ధ్యానిస్తూ ఉన్నామో, దాని అంతరీభావం వల్ల అది మా ఆంతర్యంలో విలక్షణంగా ఉండటం లేదు.

9. అహంకృతే ర్వయం నాన్యే యత్రాహంకృతి సంభవః ।
సంపద్యేతాంతరం తత్ర జ్ఞానస్య జ్ఞాతృతావహం ॥

10. అంతరావర్త భూయస్త్వా దేకస్మిన్ బోధసాగరే ।
బోద్ధారో బహహోఽ భూవ న్వస్తు నైవతు భిద్యతే ॥

11. చిద్రూపే మాతరేవం త్వం పరస్మాద్బ్రహ్మణో యథా ।
నదేవి దేవతాత్మభ్యో జీవాత్మభ్యశ్చ భిద్యతే ॥

ఎక్కడైతే అహంకృతి (అంటే శరీరమే నేను అనే భావం) పుడుతోందో అక్కడే దానివల్ల మేం పుడుతున్నాం. అంతే. జ్ఞానానికి జ్ఞాతృత్వాన్ని ఇచ్చే ఆంతర్యం (అభిప్రాయం, సంబంధం) అక్కడే సంభవిస్తూ ఉంది (అహంకృతి పుట్టే చోటే అహం

మూలాన్ని తెలుసుకునేవారికి అంతర్యం కూడా తెలుస్తుంది). జ్ఞాన సముద్రం ఒక్కటే. కానీ దానిలోని అభిప్రాయాలనే (అంతర్యాలనే) సుడుల బాహుళ్యం వల్ల అనేకమంది జ్ఞానులు పుడుతున్నారు. కానీ వస్తువొక్కటే. అది వేరు కాదు (సముద్రంలో ఎన్నో సుడులుండవచ్చు. వాటి ఆకారాలూ వేరేగా కన్పడవచ్చు. కానీ దానిలో ఉండేదీ సముద్రపు నీరేగానీ వేరే కాదు). ఇలా నీవు పరబ్రహ్మ మాదిరి దేవతాత్మలకన్నా, జీవాత్మలకన్నా భిన్నమైన దానివి కాదని తెలుస్తూ ఉంది.

> *12.* సమస్త భూతబీజానాం గూఢానామంతరాత్మని ।
> తవోద్గారోఽయ మాకాశో మాతస్సూక్ష్మరజోమయః ॥
>
> *13.* న సర్వభూత బీజాని వస్తూని స్యుః పృథక్ పృథక్ ।
> త్వయి ప్రాగవిభక్తాని బభూవురితి విశ్రుతిః ॥
>
> *14.* యథాంబ స్మతి బీజానాం ప్రజ్ఞాయా మవిశేషతః ।
> తథాస్యా ధ్భూతబీజానా మవిభక్త స్థితి స్త్వయి ॥
>
> *15.* నాణూని భూతబీజాని ప్రా క్సర్గా త్త్వయి సంస్థితౌ ।
> చితిశక్త్యాత్మకాన్యేవ నిరాకారాణి సర్వదా ॥

సకల భూతాల బీజాల అంతరాత్మలలో సూక్ష్మ రజోమయంగా ఉండే ఈ ఆకాశం నీవల్లనే పుట్టింది. భూత బీజ వస్తువులు వేర్వేరుగా ఏమీ లేవు. పుట్టడానికి ముందు అవి నీలోనే ఏకమై ఉండేవని శ్రుతి చెబుతోంది. ఓ అంబా! ఎట్లయితే స్మృతి బీజాలస్థితి ప్రజ్ఞానంలో విశేషం చెందడం లేదో, అదే రీతిలో భూత బీజాల స్థితి నీలో ఏకమై ఉంది. అణువుల్లా విభజించని భూతబీజాలు సృష్టికి ముందే నీలో చిత్ శక్తి రూపంలో ఉండి అన్నిరకాలుగా నిరాకారమై ఉన్నాయి.

> *16.* అనాది చేదిదం విశ్వం స్మరణాత్తవ సర్జనం ।
> సాదిచే దాదిమ స్సర్గో వక్తవ్యస్తవ కల్పనాత్ ॥

అమ్మా! ఈ విశ్వం అనేది అనాదిగా వున్నదని అంటే, నీ స్మృతి వల్ల సృష్టి జరిగి ఉండాలి. విశ్వానికి మూలం ఉందని ఎవరైనా అంటే, అది నీవు చేసిన తొలి సృష్టియై ఉండాలి.

> *17.* విధాతుం శక్నుయా త్వంవి దభూతస్యాపి కల్పనమ్ ।
> కల్పితస్యైకదా భూయ స్సర్జనావసరే [illegible] ॥

పుట్టుకను కల్పించే శక్తిని కలిగింది [illegible]. కల్పితమైన దా[illegible]

సృష్టించాల్సి వస్తే అపుడు శక్తి స్మృతిరూపిణి అవుతుంది (ఒకటి కొత్తదాన్ని సృష్టిస్తే, మరొకటి పాత విశ్వవాసనలను ధరించి వ్యక్తీకరిస్తుంది. మొదటిది కేవలశక్తి. రెండవది విశ్వ సంబంధమైన విద్యుత్తులాటి శక్తి).

*18. చితే రస్మా దృశాం వీర్యం స్వప్నేచే ద్విశ్వ కారణం ।*
*చితే స్సమష్టి భూతాయాః ప్రభావే సంశయః కుతః ॥*

*19. మాత స్సమష్టి చిద్రూపే విభూతిర్భువనం తవ ।*
*ఇహ వ్యష్టి శరీరేషు భాంతీ తదను పశ్యసి ॥*

అమ్మా! మాలాటి వారికి చిత్‌కు సంబంధించిన బలమే మా కలల్లో విశ్వ నిర్మాణానికి (కొత్త రూపాలను నిర్మించడానికి) కారణమైనపుడు, ఇక సమష్టి భూతంగా ఉండే చిత్ ప్రభావాన్ని గురించి సందేహపడనక్కరలేదు. అందువల్ల ఈ భువనమనేది కేవలం నీ కల్పనే (విభూతియే). నీవు ఇక్కడి వ్యష్టి శరీరాల్లో ప్రకాశిస్తూ, భువనాన్ని అనుసరించి చూస్తున్నావు.

*20. త్వం బ్రహ్మ త్వం పరాశక్తి స్త్వం సర్వా అపి దేవతాః ।*
*త్వం జీవా స్త్వం జగత్సర్వం త్వదన్యన్నాస్తి కించన ॥*

*21. సతీచిదంబ నైవత్వం భావ భావ విలక్షణా ।*
*శక్తి శక్తిమతో ర్భేద దర్శనా దేష విభ్రమః ॥*

*22. తవాంబ జగతశ్చాస్య మృత్తికా ఘటయోరివ ।*
*సంబంధో వేదితవ్యస్స్యా న్న రజ్జు ఫణినో రివ ॥*

*23. త్వం శక్తిరస్య విచ్ఛిన్నా భావై రాత్మ విభూతిభిః ।*
*అంతరాస్తు మహేంద్రస్య శక్తస్య ప్రతిబింబవత్ ॥*

ఓ ఇంద్రాణీదేవీ! నీవే బ్రహ్మవు, నీవే పరాశక్తివి, నీవే సర్వదేవతా స్వరూపిణివి. అంతే కాదు. ఈ జీవుల స్వరూపానివీ, సర్వ జగత్తూ కూడా నీవే. నీకంటే వేరేగా ఏదీ లేదు. చిత్ రూపిణివైన నీవు నీ భావభావంలో ఏమాత్రం భిన్నంగా లేవు. ఈ భ్రమలన్నీ కేవలం శక్తి, శక్తిమంతుడనే భేద దృష్టివల్లనే కలుగుతున్నాయి. నీకు ఈ జగత్తుకూ, మట్టికీ కుండకూ ఉండే సంబంధంలాగా ఊహించవచ్చేమోగానీ, తాడుకూ పాముకీ సంబంధముందన్నట్టు (రజ్జు సర్పభ్రాంతిలాగా) మాత్రం ఊహించలేం. నీ ఆత్మ విభూతులే అయిన మనోభావాలతో కూడి నీవు శక్తివై ఉన్నావు. శక్తుడైన ఇంద్రుడికి ఈ విభూతులన్నీ ప్రతిబింబాల మాదిరి అతని అంతరంలో ఉన్నాయి

(అంటే, ఇంద్రాణీదేవి,ఇంద్రుడు – ఈ ఇద్దరి మనోభావాలొక్కటే అని కవి భావన).

*24.* శక్తిర్గణపతేః కాయే ప్రవహంతీ సనాతనీ ।
భారతస్య క్రియాదస్య బాధ్యమానస్య రక్షణం ॥

గణపతిముని శరీరంలో ప్రవహించే సనాతనమైన ఆ శక్తి, బాధపడుతూన్న ఈ భారతదేశాన్ని రక్షించుగాక!

*25.* ఇమాని తత్త్వవాదీని వాసిష్ఠస్య మహామునేః ।
పథ్యా వక్త్రాణి సేవంతా మనంతా మభవాం చితిం ॥

వాసిష్ఠముని తత్వవాదాలైన ఈ పథ్యావక్త్ర వృత్తాలు అనంతమైన, పుట్టుకే లేనట్టి చిత్‌ను సేవించుగాక!

అనుష్టుభం శతకంలోని మొదటిదైన పథ్యావక్త్ర స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 3.2. మాణవక స్తబకం

1. శక్తతమా శక్రవధూ హాసవిభా మే హరతు ।
మానస మార్గావరకం జేతు మశక్యం తిమిరం ॥

ఇంద్రాణీదేవి చిరునవ్వు వెదజల్లే కాంతి అత్యంత సామర్థ్యం గలది. ఆ కాంతి నా మనస్సు నడిచే దారిని ఆవరించి, జయించడానికి దుర్లభంగా మారిన అజ్ఞానాంధ కారాన్ని హరించుగాక!

2. భారత భూ పద్మదృశో దుర్దశయా క్షీణతనోః ।
బాష్ప మజస్రం విగళ ద్వాసవ భామా హరతు ॥

తన దుర్దశవల్ల బలహీనమైన శరీరాన్ని కలిగిన ఈ భారతభూమి అనే కాంత కళ్లలోనించి ఏకధారగా కారుతున్న కన్నీటిని ఇంద్రాణి హరించుగాక!

3. దండిత రక్షో జనతా పండిత గీతా వనితా ।
మండిత మాహేంద్ర గృహా ఖండిత పాపా జయతి ॥

4. సద్గుణ సమ్పత్కలితం సర్వశరీరే లలితం ।
దేవపతేః పుణ్యఫలం పుష్యతు మే బుద్ధిబలం ॥

రాక్షస సమూహాన్ని దండించే శక్తిగలదీ, పండితులంతా కీర్తించేదీ, ఇంద్రుడి భవనానికే అలంకారమైనదీ, పాపాలను ఖండించే వనితా అయిన ఇంద్రాణీదేవి ప్రకాశిస్తూ ఉంది. సద్గుణ సంపద కలిగి, అత్యంత సుందరంగా ఉండటమే కాదు, ఇంద్రుని పుణ్యఫలం కూడా ఆమెయే. అలాంటి ఇంద్రాణీదేవి నా బుద్ధిబలాన్ని వృద్ధి చేయుగాక!

5. హాస విశేషైరలసై ర్దిక్షు కిరం త్యచ్ఛ సుధాం ।
ఇంద్ర దృగానందకరీ చంద్రముఖీ మామవతు ॥

6. ప్రేమతరంగ ప్రతిమై శ్శీతల దృష్టి ప్రకరైః ।
శక్రమనో మోహకరీ వక్రకచా మామవతు ॥

7. గాఢరసై శ్చారుపదై ర్గూఢతరార్థై ర్వచనైః ।
కామకరీ వృత్రజితో హేమతను ర్మామవతు ॥

8. మృత్యుతనుః కాలతనో ర్విశ్వపతేః పార్శ్వచరీ ।
ప్రేత జగద్రక్షతి యా సా తరుణీ మామవతు ॥

తన మందహాస విశేషంవల్ల అన్ని దిక్కులలోనూ నిర్మలమైన కాంతిసుధలను వెదజల్లుతూ, ఇంద్రుడి కళ్లకు ఆనందాన్నిస్తుంది ఆ చంద్రముఖి. ప్రేమ తరంగాలతో సమానమైన చల్లని ఆమె దృష్టితో ఇంద్రుడి మనస్సును రంజింపజేసే ఆ దేవి, వంపులు తిరిగి ఉన్న కొప్పులతో ఉంది. గాఢరసం, మనోహరమైన పదాలు, నిగూఢమైన అర్థాలూ ఉన్న మాటలతో దేవేంద్రుడికి కామాన్ని కలిగిస్తుంది ఆ హేమ తనూదేవి (ఇంద్రాణీదేవి). కాలాన్నే శరీరంగా కలిగి ఇంద్రుడిలో సగభాగంగా ఉండేదీ ఆమెనే. మృత్యురూపిణిగా ఆ దేవి ప్రేతలోకాన్ని కూడా రక్షిస్తూ ఉంది. అలాంటి ఇంద్రాణీదేవి నన్ను రక్షించుగాక!

*9. ప్రేత జగత్కేచి దధో లోక మపుణ్యం బ్రువతే ।*
*శీత రుచేర్నాన్యదిదం తత్త్వవిదన్యో వదతి ॥*

*10. భూరియ ముర్వీవసుధా వారిజవైరై ర్యేష భువః ।*
*స్వర్మహసాం రాశి రసౌ యేషు నరప్రేత సురాః ॥*

*11. రాజత శైలం శశినః కేచిదభిన్నం బ్రువతే ।*
*మృత్యు యమా వేవ శివా వీశ్వరి తేషాంతు మతే ॥*

*12. రాజతశైలః పితృభూ రోషధిరాడేష యది ।*
*కాంచనశైల స్సురభూ ర్భంధురసౌ వారిరుహాం ॥*

అమ్మా! ఈశ్వరీ! కొందరు ప్రేత లోకాన్ని పాపభూయిష్ఠమైన అధోలోకం అంటారు. మరొక తత్త్వవేత్త అది చంద్రుడే కానీ వేరు కాదంటున్నాడు. ఈ భూలోకాన్ని ఉర్వి, వసుధ అనీ, భువర్లోకాన్ని పద్మాలకు శత్రువైన చంద్రుడనీ, తేజోరాశియైన సూర్యుని సువర్లోకమనీ అంటారు. అంతే కాదు. భూలోకంలో మానవులు (నరులు), భువర్లోకంలో ప్రేతలు, సువర్లోకంలో దేవతలు (సురలు) నివసిస్తారని అంటారు. అదే కొందరు కైలాసమూ చంద్రుడూ వేర్వేరు కాదని అంటారు. వారి మతంలో పార్వతి మృత్యురూపిణ, శివుడు కాలరూపుడు (యముడు). కైలాసం అనేది పితృభూమి (శ్మశానం) అనీ, దానినే చంద్రుడనీ వారంటారు కూడా. అంతే కాదు. మేరువు దేవతల భూమి అనీ, అది సూర్యుడే గానీ వేరొకటి కాదనీ వారంటారు.

*13. పావయ భూమిం దధతః పావక కాయస్య విభోః ।*
*భామిని భావానుగుణే సేవక మగ్నాయి తవ ॥*

భూమిని ధరిస్తూ అగ్నినే శరీరంగా కలిగిన ఆ విభుని భావాలకనుగుణంగా ఉండే ఓ స్వాహాదేవీ! నీ సేవకుడైన నన్ను పవిత్రుని చెయ్యి (అగ్నాయి అంటే అగ్నిదేవుడి

భార్య).

14. యస్య యమో భూతపతి ర్బుద్ధిమతస్తస్య మతేః ।
అగ్ని రుపేంద్రో మఘవా కాంచన గర్భో భగవాన్ ॥

15. యస్య మహాకాలవధూ ర్మృత్యురపి ద్వే న విదః ।
త్వం శచిమేధాఽస్యమతే పావకశక్తిః కమలా ॥

అమ్మా! శచీదేవీ! ఎవరి మతంలో భూతపతియైన ఈశ్వరుడు యముడో, ఆ బుద్ధిమంతుని మతంలో అగ్నియే విష్ణువు. హిరణ్యగర్భుడు ఇంద్రుడు. ఎవరి మతంలో మహాకాలుడి భార్య మృత్యువైనా ఆమెకు రెండు రూపాల్లేవో, వారి మతంలో నీవు తెలివిగానూ, అగ్నిశక్తిగానూ, లక్ష్మిగానూ ఉన్నావు.

16. నామసు భేదోఽస్తు ధియా మీశ్వరి నిష్కృష్ట మిదం ।
సూర్య ధరేందు ష్వజరే త్వం త్రితను ర్భాసి పరే ॥

17. సాత్త్విక శక్తి స్సవిత ర్యాదిమరామే భవసి ।
రాజస శక్తిర్భువి న స్తామస శక్తి శ్శశిని ॥

18. సర్వగుణా సర్వవిభా సర్వబలా సర్వరసా ।
సర్వమిదం వ్యాప్యజగ త్యాపి విభాంతీ పరమా ॥

ఓ తల్లీ! నీ పేర్లలో బేధాలుండవచ్చుగాక! సూర్యుడు, భూమి, చంద్రులలో నీవు మూడు శరీరాలతో ప్రకాశిస్తున్నావన్నది మాత్రం నిశ్చయం. ఇంకో సంగతేమి టంటే, నీవు సూర్యునిలో సాత్వికశక్తిగా, భూమిపై రాజసశక్తిగా, చంద్రుడిలో తామస శక్తిగా ఉన్నావు. అన్ని గుణాలూ, అన్ని తేజస్సులూ, అన్ని బలాలూ కలిగి ఈ జగత్తు లో వ్యాపించి ప్రకాశించే ఒక్కగానొక్క ఉత్కృష్టమైన దానివి నీవు.

19. వ్యోమతను ర్నిర్వపుషో దేవి సతస్త్వం దయితా ।
అస్యభియుక్తై ర్విబుధై రంబ మహేశ్వర్యుదితా ॥

20. సా ఖలు మాయా పరమా కారణమీశం వదతాం ।
సా ప్రకృతి స్సాంఖ్యవిదాం సా యమినాం కుండలినీ ॥

అమ్మా! ఆకాశ శరీరిణివి నీవు. కానీ శరీరంలేని సద్ వస్తువుకు భార్యవైనావు. యుక్తిగల పండితులు నిన్ను మహేశ్వరి అంటున్నారు. అన్నిటికీ ఈశ్వరుడే కారణమని చెప్పేవారికి ఆ మహేశ్వరియే పరమమైన మాయ అవుతోంది. సాంఖ్యవాదులకు

ఆమె ప్రకృతిగానూ, యోగసాధకులకు ఆమెయే కుండలినీగా ఉంది.

*21. సా లలితా పంచదశీ ముత్తమ విద్యాం జపతాం ।*
*సా ఖలు చండీ జననీ సాధు నవార్ణః భజతాం ॥*

*22. సా మమ శచ్యాః పరమం కారణరూపం భవతి ।*
*కార్యతను ర్దివి శక్రం సమ్మదయంతీ లసతి ॥*

*23. వ్యోమతనో స్సర్వజగ చ్చాలన సూత్రంతు వశే ।*
*నిర్వహణే తస్య పున ర్దివ్య తను స్త్రీ త్రిత్రయం ॥*

పంచదశి అనే ఉత్తమ విద్యను జపించేవారికి ఈ మహేశ్వరే లలితగా గోచరిస్తుంది. శ్రేష్ఠమైన నవార్ణ మంత్రాన్ని (అంటే తొమ్మిది అక్షరాలు మంత్రం, అర్ణం అంటే రంగు. నవార్ణం అంటే తొమ్మిది రంగులు) జపించేవారికి ఆమె చండిగా గోచరిస్తూంది. ఆ చండీదేవియే నా సంతోషం కోసం శచీదేవికి చెందిన ఉత్తమమైన కారణరూపంగా ప్రకాశిస్తుంది. ఆ శచీదేవే స్వర్గంలో ఇంద్రుడి సంతోషం కోసం కార్య శరీరిగా ప్రకాశిస్తూంది. ఆకాశమే శరీరంగా ఉన్న ఈమె అన్ని జగాలకు చెందిన చాలన సూత్రాన్ని (అన్ని జగాలనూ నడిపే రహస్యాన్ని) తెలుసుకుని, మళ్లీ సృష్టి చేయడానికి దివ్య శరీరాలుండే స్త్రీ త్రయంగా అవుతూ ఉంది.

*24. పాతుమిమం స్వం విషయం హంత చిరాన్నిర్విజయం ।*
*కింకర మీశే విభయం మాం కురు పర్యాప్తశయం ॥*

అమ్మా! ఇంద్రాణీ! ఎంతో కాలంగా జయమనేదే తెలీకుండా పోయిన (ఎంతో కాలంగా ఓడిపోతున్న) ఈ నా దేశాన్ని రక్షించడానికి ఈ సేవకుడికి భయం లేకుండా చేసి, సమర్థవంతుడిగా తీర్చిదిద్దు.

*25. చారుపద క్రీడనకై ర్మాతరిమై ర్మాణవకైః ।*
*చేతసి తే దేవనుతే ప్రీతి రమోఘా భవతు ॥*

ఓ ఇంద్రాణీ దేవీ! సొగసైన పద విన్యాసాలున్న ఈ మాణవక వృత్తాలు నీ హృదయంలో అమోఘమైన ప్రీతిని (నా పై) కలుగ జేయుగాక!

అనుష్టుభం శతకంలోని రెండవదైన మాణవక స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 3.3. చిత్రపదా స్తబకం

1. అప్యలసో హరిదంత ధ్వాంత తతేరపి హర్తా ।
అస్తు మహేంద్ర పురంధ్రీ హాసలవ శ్శుభకర్తా ॥

అన్ని దిక్కులలో మూలమూలలా వ్యాపించి ఉన్న చిమ్మని చీకట్లను నశింపజేసే ఆ ఇంద్రాణీదేవి మందహాసం నాకు శుభాలనిచ్చుగాక!

2. పాహి పరై ర్హృతసారాం నేత్రగళ జ్జలధారాం ।
భారతభూమి మనాథాం దేవి విధాయ సనాథాం ॥

ఓ ఇంద్రాణీ దేవీ! శత్రువులు తనను పీల్చి పిప్పి చేసేశారని కన్నీరు కారుస్తున్న ఈ భారతభూమి అనే అనాథను సనాథగా మార్చి రక్షించవమ్మా!

3. చాలయతా సురరాజం పాలయతా భువనాని ।
శీలయతా నతరక్షాం కాలయతా వృజినాని ॥

4. లాలయతా మునిసంఘం కీలయతా దివి భద్రం ।
పావయ మాం సకృదీశే భాసుర దృక్ప్రసరేణ ॥

ఓ ఈశ్వరీ! దేవేంద్రుడిని చలింపజేసేదీ, ఈ భువనాలను పాలించేదీ, వినయ శీలురను రక్షించేదీ, పాపాలను నాశనం చేసేదీ, మునులను లాలించేదీ, స్వర్గంలో సకల శుభాలను నెలకొల్పేదీ నీ చూపులే. అలాటి చూపులతో ఒక్కసారి చూసి నన్ను పవిత్రుడ్ని చేయి.

5. సర్వ రుచామపి శాలాం త్వాం శచి మంగళ లీలాం ।
కాలకచా ముతకాళీం పద్మముఖీ ముత పద్మాం ॥

6. యస్స్మరతి ప్రతికల్యం భక్తి భరేణ పరేణ ।
తస్య సురేశ్వరి సాధో రస్మి పదాబ్జ భుజిష్యః ॥

7. యస్తవనామ పవిత్రం కీర్తయతే సుకృతీ నా ।
వాసవ సుందరి దాస స్తచ్చరణస్య సదాఽహం ॥

8. యస్తవ మంత్ర ముదార ప్రాభవ మాగమసారం ।
పావని కూర్చముపాస్తే తస్య నమశ్చరణాయ ॥

ఓ శచీదేవీ! అన్ని కాంతులకూ నిలయమై, శుభాలనిచ్చే లీలలు కలిగిన

దానిపై నల్లని కొప్పు కలిగిన కాళీమాతగా, పద్మంవంటి ముఖం కలిగిన లక్ష్మీదేవిగా ఎవరైతే నిన్ను ప్రతిరోజూ ఉదయాన్నే భక్తితో స్మరిస్తారో, అటువంటి సాధువుల పాదాలకు నేను సేవ చేస్తాను. అంతే కాదు. నీ పవిత్రమైన నామాన్ని సుకృతియైన మానవుడెవడైతే కీర్తిస్తాడో అతని పాదాలకు నేను సదా దాసుడను. అమ్మా, ఎంతో మహిమగల ఆగమసారమైన నీ మంత్రమనే కూర్చ (పొగడ్త లేదా కీర్తన) ను ఎవడైతే ఉపాసిస్తాడో, అతని పాదాలకు నేను నమస్కరిస్తాను.

9. *పావక సాగర కోణం యస్తవ పావన యంత్రం ।*
*పూజయతి ప్రతి ఘస్రం దేవి భజామి తదంఘ్రిం ॥*

10. *శాంత ధియేతరచింతా సంతతి మంబ విధూయ ।*
*చింతయతాం తవపాదా వస్మిసతా మనుయాయీ ॥*

ఓ శచీదేవీ! అగ్ని, సముద్రాలను కోణాలుగా కలిగిన నీ పావన యంత్రాన్ని ఎవరైతే నిత్యమూ పూజిస్తాడో అతని పాదాలకు నేను నమస్కరిస్తాను. అమ్మా! శాంతంగా ఉండి వేరే ఇతర సంకల్పాలేవీ లేకుండా సదా నీపాదాలనే స్మరించేవారికి నేను నమస్కరిస్తాను.

11. *శోధయతాం నిజతత్వం సాధయతాం మహిమానం ।*
*భావయతాం చరణంతే దేవి పదానుచరోఽహం ॥*

12. *యోఽనుభవే న్నిజదేహే త్వామజరే ప్రవహంతీం ।*
*సంతత చింతన యోగా త్తస్య నమామి పదాబ్జం ॥*

ఓ దేవీ! నీ నిజతత్వాన్ని శోధించేవారూ, నీ మహిమను సాధించేవారూ, నీ పాదాలను ధ్యానించేవారూ నాకు పూజనీయులు. వారి పాదాలవద్దే నేను తిరుగాడుతూ ఉంటాను. మరో సంగతేమిటంటే, ఎవరైతే తన దేహంలో ప్రవహించే నిన్ను నిరంతర చింతన ద్వారా సదా అనుభవిస్తూ ఉంటారో, అట్టివారికి నేను పాదసేవ చేస్తాను.

13. *బోధయతే భవతీం యః ప్రాణగతా గతదర్శీ ।*
*కుండలినీ కులకుండా త్తంత్రి దివేశ్వరి వందే ॥*

14. *లోచనమండల సౌధాం లోకన మూల విచారీ ।*
*విందతి యః పరమే త్వాం వందన మస్య కరోమి ॥*

15. *మానిని జంభజితస్త్వాం మానసమూల వితర్కీ ।*
*వేద హృదంబురుహే యః పాదమముష్య నమామి ॥*

అమ్మా! ఈశ్వరీ! ప్రాణాల గమనానగమనాలను చూస్తూ కుండలినీ కులకుండం నుండి ఎవరైతే నిన్ను మేల్కొలుపుతారో వారికి నేను నమస్కరిస్తున్నాను. దృష్టి మూలాన్ని విచారిస్తూ, నిన్ను నేత్రమండల నివాసిగా ఎవరైతే తెలుసుకుంటారో, అలాంటివారికి నేను నమస్కరిస్తున్నాను. మనస్సు మూలాన్ని గురించి వితర్కిస్తూ నీవు తన హృదయ కమలంలో ఉన్నట్టు ఎవరైతే తెలుసుకుంటారో, వారి పాదాలకు నేను నమస్కరిస్తాను.

*16. అంతరనాద విమర్శీ పశ్యతి యస్సుకృతీ తే ।*
*వైభవ మంబ విశుద్ధే తేన వయం పరవంతః ॥*

*17. ఇంద్రపద స్థిత చిత్త శ్శీర్ష సుధారస మత్తః ।*
*యో భజతే జనని త్వాం తచ్చరణం ప్రణమామి ॥*

*18. రాస నవారిణి లగ్నః సమ్మద వీచిషు మగ్నః ।*
*ధ్యాయతి యః పరమే త్వాం తస్యపదం మమ వంద్యం ॥*

అమ్మా! దేహంలో అంతర్లీనమైన నాదాన్ని విమర్శించే పుణ్యాత్ముడై ఎవడు నీ వైభవాన్ని చూస్తాడో అతనికి నేను ఆధీనుడను. ఇంద్రుడి పాదంపైనే చిత్తాన్ని ఉంచి శీర్ష సుధారసంలో మునిగి (మత్తుగా ఉండి) ఎవడైతే నిన్ను పూజిస్తాడో అతని పాదాలకు నమస్కరిస్తాను. అమ్మా! నాలుకపై కదిలే లాలాజలంపై లగ్నంచేసి ఎవరైతే సంతోష తరంగాలలో నిమగ్నమై నిన్ను సదా ధ్యానిస్తూ ఉంటాడో అటువంటివాని పాదాలకు నేను నమస్కరిస్తాను.

*19. త్వాం సదహంకృతి రూపాం యోగినుతే హతపాపాం ।*
*ధారయతే హృదయే య స్తస్య సదాఽస్మి విధేయః ॥*

*20. ధూత సమస్త వికల్పో యస్తవ పావన లీలాం ।*
*శోధయతి స్వగుహాయాం తస్యభవా మ్యనుజీవీ ॥*

*21. యోభజతే నిజదృష్టిం రూప పరిగ్రహణేషు ।*
*కామపి దేవి కళాం తే తస్య పదే నిపతేయం ॥*

అమ్మా! సదహంకారమే రూపంగా కలిగి, పాపం లేని నిన్ను ఎవడైతే తన హృదయంలో సదా ధరిస్తాడో అతనికి నేను ఎల్లపుడూ విధేయునిగా ఉంటాను. ఎలాటి సందేహమూ లేకుండా ఎవడు నీ పావనచరితాన్ని తన నిజగుహయైన హృదయంలో శోధిస్తాడో అతనికి నేను అనుచరుడను. ఎవరైతే నీ నిజరూపాన్ని తెలుసుకునేటపుడు తన దృష్టిలో ఉండే అనిర్వాచ్యమైన కళను పూజిస్తాడో అతని

పాదాలను నేను సేవిస్తాను.

*22.* కర్మణి కర్మణి చేష్టా మంబ తవైవ విభూతిం ।
యశ్శ్రిత బుద్ధి రుపాస్తే తత్పద మేష ఉపాస్తే ॥

*23.* వస్తుని వస్తుని సత్తాం యో భవతీం సముపాస్తే ।
మాత రముష్య వహేయం పాదయుగం శిరసాఽహం ॥

అమ్మా! ఎవరైతే తీక్షణమైన బుద్ధి కలిగి తాము చేసే ప్రతికర్మలోనూ ఉండే క్రియను నీ లీలగా ఉపాసిస్తారో వారి పాదాలను నేను ఉపాసిస్తాను. ప్రతి వస్తువులోనూ ఉండే **సత్** నీవే అని ఎవరు ఉపాసిస్తారో వారి పాదాలను నా తలపై పెట్టుకొంటాను.

*24.* పాతు మిమం నిజదేశం సర్వ దిశాసు సపాశం ।
అంబ విధాయ సమర్థం మాం కురు దేవి కృతార్థం ॥

అన్ని దిక్కుల్లోనూ పాశబద్ధమై పోయి ఉన్న నా దేశాన్ని రక్షించడానికి నన్ను సమర్థునిగా చేసి నన్ను కృతార్థుడను చెయ్యి.

*25.* చిత్ర పదాభిరిమాభి శ్చిత్ర విచిత్ర చరిత్రా ।
సమ్మద మేతు మఘో నః ప్రాణసఖీ మృగ నేత్రా ॥

చిత్రవిచిత్రాలైన చరిత్రనూ, లేడికళ్లను బోలిన కళ్లనూ కలిగిన ఇంద్రాణీదేవి నా ఈ చిత్రపదా వృత్తాలను విని సంతోషించు గాక!

అనుష్టుభం శతకంలోని మూడవదైన చిత్రపదా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 3.4. నారాచికా స్తబకం

1. అంతర్విధున్వతా తమః ప్రాణస్య తన్వతా బలం ।
మందస్మి తేన దేవతారాజ్ఞీ తనోతు మే శివం ॥

అందరి అంతర్యాలలో ఉండే చీకట్లను హరింపజేసి వారి ప్రాణాలకు బలాన్నిచ్చే చిరునవ్వుతో ఇంద్రాణీదేవి, నాకు శుభాలనిచ్చు గాక!

2. ఉత్థాప్య పుణ్య సంచయం సంమర్ద్య పాప సంహతిం ।
సా భారతస్య సంపదే భూయా ద్బలారి భామినీ ॥

ఆ ఇంద్రాణీదేవి పుణ్య సంచయాన్ని ఉద్దాపనమొనర్చి, పాపాలను నాశనం చేసి, ఈ భారతభూమికి సంపదలనిచ్చుగాక!

3. లీలాసఖీ బిడౌజస స్స్వర్వాటికా సుఖేలనే ।
పీయూష భానుజిన్ముఖీ దేవీ శచీ విరాజతే ॥

స్వర్గవాటికలలో క్రీడించడానికి దేవేంద్రునికి లీలా సఖి అయినదీ, చంద్రుడిని జయించగల ముఖాన్ని కలిగినదీ అయిన ఆ శచీదేవి విరాజిల్లుతూ ఉంది.

4. పక్షః పరో మరుత్వతో రక్షః ప్రవీర మర్దనే ।
భామాలి భాసురాననా దేవీ శచీ విరాజతే ॥

రాక్షసవీరులను సంహరించడంలో ఇంద్రుడికి సహాయకారిగా, సూర్యునిలాగా ప్రకాశించే ముఖాన్ని కలిగిన శచీదేవి విరాజిల్లుతూ ఉంది(భామాలి అనేది అంశు మాలి వంటిది. ఐతే సూర్యుదని అనడమే ఇక్కడ దానికి సరైన అర్థం. భర్తతో విహరించేటపుడు చంద్రముఖి అనీ, శత్రువులను సంహరించేటపుడు సూర్యునిలా జ్వలించే ముఖం కలది అనీ కవి చమత్కారించడాన్ని చూడవచ్చు).

5. భీతిం నిశాట సంహతేః ప్రీతిం సుపర్వణాం తతేః ।
జ్యాటంకృతై ర్వితన్వతీ దేవీ శచీ విరాజతే ॥

6. దేవేంద్ర శక్తి ధారిణీ శత్రు ప్రసక్తి వారిణీ ।
మౌనీంద్ర ముక్తి కారిణీ దేవీ శచీ గతిర్మమ ॥

నారీటంకారాలతో రాక్షసులకు భయాన్ని కలిగిస్తూ దేవతలకు ప్రీతిని కలిగించే శచీదేవి ప్రకాశిస్తూ ఉంది. దేవేంద్రుని శక్తిని ధరించి ఉండేదీ, శత్రువుల ఆడంబరాన్ని నివారించేదీ, మునులందరికీ ముక్తినిచ్చేదీ ఆమెనే. అటువంటి శచీదేవి నాకు శరణం.

7. సన్న స్వదేశ దర్శనా ద్భిన్న స్వజాతి వీక్షణాత్ ।
ఖిన్నస్య సంశ్రితావనీ దేవీ శచీ గతిర్మమ ॥

8. సంఘే సహస్రధా కృతే దేశే నికృష్టతాం గతే ।
శోకా కులస్య లోకభృ ద్దేవీ శచీ గతిర్మమ ॥

బలహీనమై ఉన్న స్వదేశాన్ని దర్శించడంవల్ల, ఖిన్నమైన స్వజాతిని చూస్తూం డటం వల్ల దిగులుపడ్డ నాకు, నన్ను ఆశ్రయించే వారిని రక్షించడానికి శచీదేవియే దిక్కు. అంతే కాదు. ఈ సంఘం వెయ్యివిధాలుగా ఉంది. ఈ దేశం హీనస్థితిలో ఉంది. అందువల్ల నాకెంతో దిగులుగా ఉంది. లోకాలను కాపాడే శచీదేవే ఇక నాకు దిక్కు.

9. సా సంవిదోఽ ధి దేవతా తస్యాస్స్వరః పరోవశే ।
సర్వం విధీయతే తయా తస్మా త్పరామతా శచీ ॥

10. సాయాతి సూక్ష్మమప్యలం సాభాతి సర్వవస్తుషు ।
సా మాతి ఖంచ నిస్తులం తస్మా త్పరామతా శచీ ॥

11. సా సర్వలోక నాయికా సా సర్వగోళ పాలికా ।
సా సర్వదేహ చాలికా తస్మా త్పరామతా శచీ ॥

12. యస్యాః కృతిర్జగత్త్రయం యా తద్బిభర్తి లీలయా ।
యస్యాం ప్రయాతి తల్లయం సా విశ్వనాయికా శచీ ॥

శచీదేవి జ్ఞానానికి అధిదేవత. వరమైన చక్కని స్వరం ఆమె సొంతం. ఆమెయే సర్వాన్ని విధిస్తూ ఉంది. అందువల్ల ఆమెను పరాదేవి అనీ అంటున్నారు. శచీదేవి ఎంతో సూక్ష్మరూపిణియైనా అన్నిటా ప్రకాశిస్తూ ఉంది. నిరుపమానమైన ఆకాశాన్ని కొలత వేస్తూ ఉంది. అందుకే పరాదేవిగా వెలుగొందుతూ ఉందామె. సకలలోక నాయికైన ఆమె, అన్ని గోళాలనూ పాలిస్తూ, అన్ని దేహాలనూ చలింపజేస్తూ ఉంది. అందుకే శచీదేవి పరాదేవిగా వెలుగొందుతూ ఉంది. ఏ దేవి ఈ ముల్లోకాలనూ కల్పించిందో, ఎవరి లీలవల్ల అవి భరింపబడుతున్నాయో, తిరిగి అవి ఎవరిలో లయమై పోతున్నాయో ఆ విశ్వనాయికయైన శచీదేవి ప్రకాశించుగాక!

13. ధర్మే పరిక్షయం గతే యాఽ విశ్వ నిర్మలం జనం ।
తద్రక్షణాయ జాయతే సా విశ్వనాయికా శచీ ॥

14. వేధా ఋతస్య యోదితా మంత్రేణ సత్యవాదినా ।
బాధా నివారిణీ సతాం సా విశ్వనాయికా శచీ ॥

ధర్మం నశిస్తూ ఉన్నపుడు ఏదేవతైతే సాధుజనులను రక్షించడానికై అవతరిస్తుందో, ఆ విశ్వనాయికయైన శచీదేవి ప్రకాశించుగాక! సత్యాన్ని పలికే మంత్రంవల్ల వచ్చే మానసిక సత్యానికి ఏ దేవియైతే సృష్టికర్త్రిగా కీర్తిని పొందుతోందో, సత్పురుషుల బాధలను నివారించే విశ్వనాయికయై ఆ శచీదేవి ప్రకాశించుగాక! (ఋతమంటే మానసిక సత్యమని అర్థం. మంత్రం అనేది మనస్సుకు సంబంధించింది. మంత్రం ఆపాదించే ఋతమనేది అనిర్వచనీయ సత్యాన్ని నిరూపిస్తుంది. అలాంటి ప్రతిరూపాన్ని సృష్టించింది శచీదేవి).

15. యజ్ఞో యయా వినీయతే యుద్ధం తథా పృథగ్విధం ।
తాం దేవరాజ మోహినీం నారీం నుమః పురాతనీం ॥

16. యస్యాస్సుతో వృషాకపి ర్దేవో సతాం ప్రశాసితా ।
తాం సర్వదా సువాసినీం నారీం నుమః పురాతనీం ॥

17. యస్యాస్సమా నితంబినీ కాచిన్న విష్టపత్రయే ।
తాం నిత్యచారు యౌవనాం నారీం నుమః పురాతనీం ॥

ఎలాగైతే, యజ్ఞాలను చేయించడానికి ఆ దేవి కారణమవుతోందో, మరొక రీతిలో యుద్ధాలు జరగడానికీ ఆమే కారణమవుతోంది. ఇంద్రుడినే మోహింపజేసే దేవత ఆమె. దేవుడైన వృషాకపి ఏ దేవతకు పుత్రుడై సత్పురుషులను రక్షిస్తూ ఉన్నాడో ఆ సర్వకాల వాసినికి సమానమైన స్త్రీ ఈ ముల్లోకాలలోనే లేదు. అటువంటి సుందరీ, నిత్య యౌవనీ, పురాతనీయైన ఆమెకు మేము నమస్కరిస్తాం.

18. యచ్చారుతా నదృశ్యతే మందార పల్లవేష్వపి ।
తత్సుందరాచ్చ సుందరం శచ్యాః పదాంబుజంశ్రయే ॥

19. యస్యప్రభా నవిద్యతే మాణిక్య తల్ల జేష్వసి ।
తద్భాసురాచ్చ భాసురం శచ్యాః పదాంబుజంశ్రయే ॥

20. నస్యాదపై స్తిరస్కృతో యచ్చింతకో నరః కృతీ ।
తత్పావనాచ్చ పావనం శచ్యాః పదాంబుజంశ్రయే ॥

మందారపల్లవాలకు కూడా లేని సౌందర్యం ఏదేవి పాదాలకు ఉందో అలాంటి సుందరాతిసుందరమైన శచీదేవి పాదాలను నేను శరణుకోరతాను. ఆ దేవి పద కాంతులవంటి కాంతి ప్రశస్తమైన మాణిక్యాలకు కూడా ఉండవు. స్ఫటికాలకన్నా

స్వచ్ఛంగా ఉండే ఆ శచీదేవి పాదాలనే నేను శరణు వేడతాను. ఏ దేవి పాదాలను విస్మరిస్తే నరుడు పాపాలనుంచి బయటపడలేడో, అటువంటి పవిత్రమైన పాదాలకన్నా పవిత్రమైన పాదాలు కలిగిన ఆ శచీదేవి పాదాలనే నేను ఆశ్రయిస్తాను.

*21. రాజ న్న ఖేందు భానుభి స్సర్వం తమో విధున్వతే ।*
*బృందార కేంద్ర సుందరీ పాదాంబుజాయ మంగళం ॥*

*22. గీర్వాణమౌళి రత్న భా సంక్షాళితాయ దీప్యతే ।*
*స్వర్గాధినాథ భామినీ పాదాంబుజాయ మంగళం ॥*

*23. బాలార్క బింబ రోచిషే యోగీంద్ర హృద్గుహాజుషే ।*
*పాకారి జీవితేశ్వరీ పాదాంబుజాయ మంగళం ॥*

ఏ దేవి వేలి గోళ్లు వెదజల్లే చంద్రకాంతులు చీకటిని (అజ్ఞానాన్ని, పాపాన్ని) పారద్రోలుతున్నాయో, అటువంటి ఇంద్రాణీదేవి పాదాలకు మంగళమగుగాక! దేవతల కిరీటాల్లో ఉండే రత్నాల కాంతులు ఆ దేవి పాదాలను కడగటంవల్ల మరింతగా ప్రకాశిస్తున్నాయి. ఆ ఇంద్రాణీదేవి పాదాలకు మంగళమగుగాక! ఉదయభానుడి బింబంలా వెలుగుతూ, యోగీంద్రుల హృదయాలలో వెలుగు నింపుతూ ఉన్న ఆ ఇంద్రాణీదేవి పాద పద్మాలకు మంగళమగుగాక!

*24. ఆత్మీయ దేశరక్షణే శక్తం కరోతు సర్వథా ।*
*పాప ద్విషాం ప్రియంకరీ వాసిష్ఠ మింద్ర సుందరీ ॥*

పాపాలకు శత్రువులైనవారికి సంతోషాన్నిచ్చే ఓ ఇంద్రాణీదేవీ! నీవు ఆత్మీయ దేశమైన భారతదేశాన్ని రక్షించడంలో వాసిష్ఠ గణపతిమునిని ఎల్లపుడూ శక్తిమంతుని చేయి.

*25. వాసిష్ఠ వాక్ప్రదీప్తిభి ర్నా రాచికాభి రీశ్వరీ ।*
*గీర్వాణ చక్రవర్తి న స్సమ్మోద మేతు సుందరీ ॥*

ఈశ్వరియైన ఇంద్రాణీదేవి ఈ వాసిష్ఠ (గణపతిముని) వాక్కులతో ప్రకాశించే ఈ నారాచికా వృత్తాలవల్ల సంతోషాన్ని పొందుగాక!

అనుష్టుభం శతకంలోని నాలుగవదైన నారాచిక స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

దీనితో ఇంద్రాణీ సప్తశతిలోని మూడవదైన అనుష్టుభ శతకం పూర్తి అయింది.



# 4. బార్హతం శతకం

బార్హతం శతకం అనేది ఇంద్రాణీ సప్తశతిలోని నాలుగవ శతకం. హల ముఖీ, భుజగ శిశుభృతా, మణిమధ్యా, మాత్రాసమక అనే 4 స్తబకాలు కలిసి బార్హతం అనే శతకం అవుతుంది. ఈ శతకంలో తొలి స్తబకం పేరు హల ముఖీ స్తబకం. ఇందులో **స్వచ్ఛమైన ప్రేమ కలిగిన ఇంద్రాణీదేవి మందహాసం నా శోకాన్ని తొలగించుగాక!** అంటూ కవి తన శతకాన్ని ఆరంభిస్తాడు.

## 4.1. హలముఖీ స్తబకం

1. *క్షీరవీచి వృషతసితం ప్రేమధారి దరహసితం ।*
*నాకరాజ నళిన దృశ శ్శోకహారి మమ భవతు ॥*

పాల తరంగాల బిందువుల్లాగా స్వచ్ఛమైన ప్రేమను కలిగిన ఇంద్రాణీదేవి చిరునవ్వు నా శోకాన్ని హరించుగాక!

2. *అధ్వనో గళిత చరణా మధ్వర క్షితి మవిభవాం ।*
*ఆ దధాతు పథి విమలే వైభవేచ హరి తరుణీ ॥*

నడుస్తున్న దారిలో అడుగులు జారి, వైభవాన్ని కోల్పోయిన ఈ యజ్ఞభూమిని తిరిగి దారిలోకి తెచ్చి, ఆ వైభవాన్ని కూడా ఇంద్రాణీదేవి తిరిగి తెచ్చుగాక!

3. *బ్రహ్మణ శ్చితి రథ నభః కాయభా గవగతి మతీ ।*
*యా తదా పృథగివ బభౌ ధర్మితాం స్వయమపి గతా ॥*

బ్రహ్మకు చైతన్యమై, ఆ తరవాత ఆకాశశరీరిణిగా ఉండి సర్వత్రా గమనాన్ని కలిగిన ఆ దేవి **చిత్** తత్త్వాన్ని స్వయంగా పొంది ఉన్నా కూడా వేరేగా (విద్యుత్ రూపిణిగా లేదా అహం స్ఫురణరూపిణిగా) ప్రకాశిస్తూ ఉంది.

4. *మోద బోధ విభవకృత ప్రాకృతేతర వరతను ।*
*సర్వ సద్గుణగణయుతం యా ససర్జ సురమిథునం ॥*

5. పుంసి దీప్త వపుషి తయో ర్బ్రహ్మ సోఽహమితి లసతి ।
యోషితే కిల ధియమదా త్తస్య శక్తి రహమితి యా ॥

6. యాభిమానబలవశత స్తాముదారతమ విభవాం ।
మన్య తేస్మ వరవనితాం స్వాధిదైవిక తను రితి ॥

7. ఆదిపుంసి గగనతను ర్యా తనోతి తనుజ మతిం ।
ఆ దధాతి యువతి తనుః ప్రాణనాయక ఇతి రతిం ॥

8. తాం వరాం భువన జననీం సర్వపాపతతి శమనీం ।
తంత్రజాల వినుత బలాం స్తౌమి సర్వమతి మమలాం ॥

చిదానంద తత్త్వాలతో కూడిన శ్రేష్ఠమైన దివ్య శరీరాన్ని కలిగి, సకల సద్గుణాలున్న దేవతల జంటను సృజించిన దేవి ఆ మిథునంలో ప్రకాశించే పురుషునిలో **'సోఽహంబ్రహ్మ'** అని ప్రకాశిస్తూ ఉంది. ఆ స్త్రీ భాగానికి **బ్రహ్మ శక్తిని** నేనే! అనే బుద్ధిని కలిగిస్తూ ఉంటుంది. ఈ శక్తి (మూలశక్తి అనేది ఈశ్వరాభిమానం కలిగింది) అభిమాన బలవశంతో అధిక వైభవంతోఉన్న ఆ స్త్రీ మూర్తిని తానే అధిదేవతగా కలిగిన శరీరిణిగా భావిస్తూ ఉంటుంది. ఆమె ఈ ఆదిపురుషుని సగుణ దైవ రూపాన్ని పుత్రభావంతో కల్పించి, తాను స్త్రీ ఆకారాన్ని పొంది అతనితో ప్రాణనాయకునిగా భావించి రతి సల్పుతూ ఉంది. ఆమెయే జగన్మాత. సర్వ పాపాలనూ నశింపజేస్తూం టుంది. తంత్రజాలం ఆమెను పొగుడుతూ ఉంటుంది. ఆమె సర్వానికీ బుద్ధి రూపిణిగా, అమలగా, పరమమైనదిగా ఉంది. ఆ తల్లిని నేను స్తుతిస్తున్నాను.

9. సా మతి ర్విదిత విషయా సారుచి ర్వితత విషయా ।
సా రతి ర్వినుత విషయా సాస్థితి ర్విధుత విషయా ॥

10. యత్ర యత్ర మమధిషణా గ్రాహ్యవస్తుని గతిమతీ ।
తత్ర తత్ర విలసతు సా సర్వగా సకల చరితా ॥

విషయాలను తెలుసుకునే బుద్ధీ, విషయాల్లో వ్యాపించే కాంతి కూడా ఆమెయే. అంతే కాదు. వాటిలో ప్రసిద్ధమైన అభిమానమూ ఆమెయే. విషయాలను అణిచేది కూడా ఆమెయే. ఎక్కడెక్కడైతే గ్రహింపదగిన వస్తువుపై నా బుద్ధి మరలుతూంటుందో అక్కడంతా సకల చరితయైన ఆ తల్లి వ్యాపించి వెలుగొందుగాక!

11. దుర్బలస్య బహుళ బలై రర్దితస్య జగతి ఖలైః ।
ఆది దేవి తవ చరణం పావనం భవతి శరణం ॥

ఓ తల్లీ! ఈ జగత్తులో బలవంతులైన దుర్మార్గుల వల్ల పీడింపబడుతున్న బలహీనులకు పవిత్రమైన నీ పాదమే శరణు.

*12.* పౌరుషే భవతి విఫలే త్వా మయం జనని భజతే ।
కింను తే యది విముఖతా పౌరుషం కథయ భజతాం ॥

*13.* కర్తు రప్రతిహత గిరః పౌరుషా చ్ఛతగుణమిదం ।
ధ్యాతు రస్ఖలిత మనసః కార్య సిద్ధిషు తవ పదం ॥

*14.* పౌరుషం విదితమఫలం కాంక్షి తే మమ సురనుతే ।
శక్త మీదృశితు సమయే శ్రద్ధధామి తవ చరణం ॥

*15.* పౌరుషం యది కవిమతం దేవితేపి పద భజనం ।
దైవవాదపటు వచసో మూకతైవ మమ శరణం ॥

తమ పౌరుషం ఓడిపోయినపుడు మనుష్యులు నిన్ను సేవిస్తూ ఉంటారు. మరి నీకు ఇష్టం లేకపోతే ఆ సేవించేవారి పౌరుషం ఏమైపోతుందో నీవే చెప్పు తల్లీ! పౌరుషంతో కూడిన వారి వాక్సిద్ధికంటే కూడా, మనస్సు నిశ్చలంగా ఉంచి ధ్యానం చేసేవారికి నీ పాదం వందరెట్లు ఎక్కువగా కార్యసిద్ధిని కలగజేస్తుంది. ఐతే నా కోరిక విషయానికొస్తే, ఆ విషయంగా లాభంలేదని తెలుస్తూ ఉంది. ఇలాటి సమయంలో నీ పాదమే సమర్థవంతమైనదని నేను ఎంతో శ్రద్ధగా నమ్ముతున్నాను. నీ పాదాలను స్మరించడం కూడా పౌరుషమే అంటావా? దైవవాదినైన నేను ఇక మాటాపలుకూ లేకుండా మౌనంగా ఉండిపోతాను. అదే మేలు.

*16.* పూర్వజన్మ సుకృతబలం దైవమంబ నిగదతి యః ।
భక్తి పౌరుష విరహిణో భావితస్య రిపు దయితం ॥

ఎవరైతే పూర్వ జన్మ సుకృతబలమే దైవమని అంటారో అలాంటివారికి, భక్తి పౌరుషాలు లేనివారికి కాబోయే దైవం కాస్తా శత్రువై పోతాడు (పౌరుషం అంటే పురుషయత్నం. కేవలం తన పూర్వజన్మ కర్మయే తనకు ఇహంలో ప్రేరేపించే దైవం అని గనక అనుకుంటే, అటువంటివారికి దైవం జడమే. ఎందుకంటే, కర్మ అనేది జడ పదార్థం. అపుడు ఆ జడమైన దైవం తాను అనుకొన్నట్లు ప్రేరేపించలేకపోతుంది. అపుడు అది కాస్తా తనకు శత్రువవుతుంది. బుద్ధిననుసరించి కర్మ ఉంటుంది).

*17.* ఉద్యతస్య తవ చరణం సంశ్రితస్యచ సురనుతే ।
పూర్వ జన్మ సుకృతబల శ్రద్ధయాఽలమహృదయయా ॥

18. అస్తు పూర్వభవ సుకృతం మాస్తువా జనని జగతాం ।
సాంప్రతం తవపదయుగం సంశ్రితోస్మ్యేవ విస్సృజవా ॥

19. నాస్తి సంప్రతి కిమపి కిం భూతిమాప్స్యసి కిము తతః ।
అన్య జన్మని వితరణే కాప్రసక్తి రమర నుతే ॥

నీ పాదాలను ఆశ్రయించి పౌరుషాన్ని చూపే ప్రయత్నంలో, నమ్మదగని **పూర్వజన్మ సుకృత బలమనే** దానిమీద శ్రద్ధపెట్టాల్సిన పని లేదు (ఈ జన్మలో చేసే కర్మకు వచ్చే జన్మలో తప్ప ఫలితం రాదనే వారికిది సరైన జవాబు). అసలు పూర్వజన్మ సుకృత బలం అనేది ఉందో లేదో. ఇపుడు మాత్రం నీ పాదాలనే నేను ఆశ్రయిస్తున్నాను. రక్షిస్తే రక్షించు. లేకపోతే లేదు (ప్రేరణ కలిగించేది బుద్ధియే కానీ జడమైన కర్మ కాదు. అందువల్ల బుద్ధిని సరైన రీతిలో ఉంచుకుని, జడమైన ఆ కర్మఫలాన్ని ఆరాధించడం మానుకోవాలి. ఆ తరువాతే ఆ చిద్రూపిణియైన దేవతను ఆరాధించాలి). ఐనా, పూర్వ జన్మఫలం ప్రకారం ఇపుడు ఫలమేమీ లేదు. ప్రస్తుత కర్మఫలంగా ఐశ్వర్యాన్ని పొందగోరితే ఆ తరవాత ఏమిటి? ఇక ఈ జన్మలో చేసే కర్మకు వచ్చే జన్మలో ఫలాన్నివ్వడం అనే దాని ప్రసక్తి ఎక్కడుంటుంది? చెప్పు తల్లీ!

20. నాన్య జన్మని బహుశివం నాపి నాకభువన సుఖం ।
కామయే ఫల మభిమతం దేహి సంప్రతి శచి నవా ॥

ఓ తల్లీ! వేరే జన్మల్లో నాకు సుఖాలు కావాలని నేను కోరడం లేదు. స్వర్గ సుఖమైనా కోరడం లేదు. నాకు కావలసిన ఫలాన్ని నేను కోరుకుంటున్నాను. ఇస్తే ఇవ్వు. లేకుంటే లేదు (ఫలాన్నిచ్చేది దైవం కాబట్టి, ఆ దైవం ఇప్పటి పుణ్యకర్మకు ఇప్పుడైనా ఇవ్వగలదు కదా! అనేదే దీని భావం).

21. మేదినీ భువన తలతో నిస్తులాదుత గగనతః ।
భాస్కరా దుత రుతినిధేః కామ్య మీశ్వరి వితర మే ॥

22. విష్టపే క్వచన వరదే దాతు మీశ్వరి కృతమతిం ।
వారయే జ్జనని న పర స్త్వాం జనస్తవ పతి మివ ॥

23. దేహివా భగవతి నవా పాహివా శశిముఖి నవా ।
పావనం తవ పదయుగం నత్యజామి హరిదయితే ॥

ఓ శచీదేవీ! భూలోకంలో నుండైనా, వేరే ఉమానమే లేని ఆకాశంనించైనా లేదా కాంతినిధియైన సూర్యుడినుంచైనా సరే నా కోర్కెను తీర్చవమ్మా. నీవు సర్వేశ్వరివి

కాబట్టి, నీవు ఫలాన్ని ఇవ్వాలనుకుంటే (నీ భర్తను అడ్డుకునేవారూ లేనట్టే) నిన్ను అడ్డుకునేవారెవరూ లేరు. ఐనా సరే. ఇస్తే ఇవ్వు. లేకుంటే మాను. రక్షిస్తే రక్షించు. లేకుంటే లేదు. ఏది ఏమైనా సరే. నేను మాత్రం పావనమైన నీ పాదాలను మాత్రం వదలను.

*24. రక్షితుం భరత విషయం శక్త మింద్ర హృదయ సఖీ ।*
*చంద్రబింబ రుచిర ముఖీ సా క్రియా ద్భువి గణపతిం ॥*

చంద్రబింబంవంటి ముఖారవిందం కలిగిన ఆ ఇంద్రాణీదేవి ఈ భరతభూమిని రక్షించడానికి ఈ గణపతిని భూలోకంలో శక్తిమంతునిగా చేయుగాక.

*25. సంప్రహృష్యతు హలముఖీ ర్భాస్వతీ ర్గణపతి మునేః ।*
*సా నిశమ్య సురనృపతే ర్మోహినీ సదయ హృదయా ॥*

ఎంతో దయతో కూడిన ఆ ఇంద్రాణీదేవి, ప్రకాశిస్తూ ఉన్న ఈ గణపతి ముని విరచితమైన హలముఖీ వృత్తాలను విని ఎంతో సంతోషించుగాక.

బార్హతం శతకంలోని మొదటిదైన హలముఖీ స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



# 4.2. భుజగశిశుభృతా స్తబకం

1. మరుదధిప మనోనాథా మధుకర చికురాస్మాకం ।
   వృజిన విధుతి మాధత్తాం విశద హసిత లేశేన ॥

తుమ్మెదల్లాంటి ముంగురులున్న ఇంద్రాణీదేవి తన నిర్మలమైన చిరునవ్వుతో మా పాపాలను నాశనం చేయుగాక!

2. అఖిల నిగమ సిద్ధాంతో బహు మునివర బుద్ధాంతః ।
   సుర పరిబృఢ శుద్ధాంతో భరత వసుమతీ మవ్యాత్ ॥

అన్ని వేదాలూ పొగిడినదీ, అనేక మునులు తెలుసుకున్న అంతం కలదీ అయిన ఇంద్రుడి అంతఃపుర స్త్రీయైన ఇంద్రాణీదేవి ఈ భారత భూమిని రక్షించుగాక!

3. భగవతి భవతీ చేతో రతి కృదభవ దింద్రస్య ।
   సతవ జనని సంతాన ద్రుమవన మతి రమ్యం వా ॥

అమ్మా! నీవు ఇంద్రుడి మనస్సుకు హాయిని కూర్చేదానివి. నీ మనస్సుకు హాయినిచ్చే వాడు ఇంద్రుడు. రమ్యమైన కల్పక వనమే మీ ఇద్దరికీ హాయినిస్తొంది.

4. పతి రఖిల యువశ్రేష్ఠః కిమపి యువతి రత్నం త్వం ।
   వనవిహృతిషు వాంచేతో హరణ మభవ దన్యోన్యం ॥

యువకులందరిలోకీ శ్రేష్ఠుడు నీ పతి. నీవో యువతీ రత్నానివి. మీ అన్యోన్యత అనేది మీ ఇద్దరి మనస్సులూ వన విహారాల్లో ఒకదానితో మరొకటి హరింపజేస్తున్నది.

5. మధుర లలిత గంభీరై స్తవ హృదయ ముపన్యాసైః ।
   వనవిహరణ లీలయా మహరదయి దివోరాజా ॥

6. కలవచన విలాసేన ప్రగుణ ముఖ వికాసేన ।
   భువనపతి మనోఽహార్షీ ర్జనని వన విహారే త్వం ॥

7. కనక కమల కాంతాస్యా ధవళ కిరణ వక్త్రేణ ।
   అసిత జలజ పత్రాక్షీ సిత నళిన దళాక్షేణ ॥

8. అళిచయ నిజధమ్మిల్లా నవజలధర కేశేన ।
   మృదులతమ భుజావల్లీ ధృఢ తమ భుజదండేన ॥

9. అమృత నిలయ బింబోష్ఠీ రుచిర ధవళ దంతేన ।
అతి ముకుర లసద్గండా వికచ జలజ హస్తేన ॥

10. యువతి రతితరాం రమ్యా సులలిత వపుషాయూనా ।
భగవతి శచి యుక్తా త్వం త్రిభువన విభునేంద్రేణ ॥

అమ్మా! అలా వన విహారం చేసేటపుడు ఇంద్రుడు తన మధురమైన, లలిత మైన, గంభీరమైన మాటలతో నీ హృదయాన్ని ఆకర్షించాడు. నీవు నీ చక్కని మాటకారి తనంతో, అంతకు మించిన గుణాలు కలిగిన ముఖవిలాసంతో ఆ ఇంద్రుని మనస్సును ఆకర్షించావు. నీవు బంగారంతో తయారైన పద్మంలాగా సొగసైన ముఖాన్నీ, నల్ల కలువరేకుల్లాటి కళ్లనూ కలిగి ఉంటే, ఆ ఇంద్రుడు తెల్లని కాంతులీనే ముఖాన్నీ, తమ్మిరేకుల వంటి కళ్లనీ కలిగి ఉన్నాడు. నీవు తుమ్మెదల గుంపులా కనిపించే జడ కొప్పునూ అతి మృదువైన భుజాలనూ కలిగి ఉంటే, ఇంద్రుడు వర్షాకాలంలో మేఘంలాటి జుట్టునూ అతి ధృఢమైన భుజదండాలనూ కలిగి ఉన్నాడు. నీవు అమృతానికి నిలయమైన దొండపండ్లను తలపించే పెదాలనూ, అద్దాలను మించి ప్రకాశించే చెక్కిళ్లనూ కలిగి ఉన్నావు. మెరిసే దంతాలతో వికసించిన పద్మంలాటి చేతులు కలిగి ఉన్నాడు ఇంద్రుడు. అత్యంత సుందరమైన యువతివై నీవు అత్యంత సుందరుడైన యువకునిలాగా ఉండే త్రిభువనాలకూ పతియైన ఇంద్రునితో కలిసి ఉన్నావు.

11. వికచ కుసుమ మందార ద్రుమ వన వరవాటీషు ।
విహరణ మయి కుర్వాణా మనసిజ మనుగృహ్ణాసి ॥

12. తవ శచి చికు రేరాజ త్కుసుమ మమర వృక్షస్య ।
నవ సలిల భృతో మధ్యే స్ఫురదివ నవ నక్షత్రం ॥

13. అభజత తరు రౌదార్యం విభవమపి మహాంతం సః ।
వికచ కుసుమ సంపత్త్యా భగవతి భజతే యస్త్వాం ॥

తల్లీ, వికసించిన పూలున్న మందారపు వనంలో విహరిస్తూ నీవు ఆ మన్మ థుని అనుగ్రహిస్తూ ఉన్నావు. నీ ముంగురులలో ప్రకాశించే కల్పక పుష్పం (కల్ప వృక్షానికి పూసే పూవు) కొత్త మేఘాల మధ్య ఉండి, ప్రకాశించే కొత్త నక్షత్రంలాగా మెరుస్తూ శోభిస్తూ ఉంది. ఏ కల్ప వృక్షమైతే వికసించిన పూలతో నిన్ను పూజిస్తూ ఉందో, ఆ చెట్టు తన ఔదార్యాన్నీ, ఐశ్వర్యాన్నీ నీ వల్లనే పొందుతూ ఉంది.

14. అమర నృపతి నాసాకం కుసుమిత వనవాటీషు ।
భగవతి తవ విశ్రాంతే స్సజయతి సమయః కోపి ॥

15. అమర తరువర చ్ఛాయా స్వయి ముహురుపవిశ్య త్వం ।
శచి కృతి జన రక్షాయై మనసి వితనుషే చర్చాం ॥

16. కిము వసు వితరాణ్యస్మై సుమతి ముత దదా న్యస్మై ।
క్షమతమ మధవాముష్మి న్బలమురు ఘటయానీతి ॥

17. హరి తరుణి కదావామే వినమదవన చర్చాసు ।
స్మరణ సమయ ఆయాస్య త్యమల హృదయ రంగే తే ॥

18. శచి భగవతే సాక్షాత్తే చరణ కమల దాసోఽహం ।
ఇహతు వసుమతీ లోకే స్మర మమ విషయం పూర్వం ॥

తల్లీ! పుష్పవన వాటికలలో ఇంద్రుడితో కలసి నీవు విశ్రాంతిని పొందే సమయం ఎంతో గొప్పది. ఆ అమరవృక్షాల నీడలో కూర్చుని నీవు మనస్సులో పుణ్య జనులను ఎలా రక్షించాలీ అని ఆలోచిస్తున్నావులా ఉంది. ఆ పుణ్య జనులకు ధనమిస్తావా? జ్ఞానమిస్తావా? లేక అధిక బలాన్నిస్తావా? ఏమివ్వాలని ఆలోచిస్తున్నావు? నీపై ఎంతో భక్తితో ఉన్నవారి రక్షణ విషయంగా నీవు చేసే చర్చలలో నా గురించి నీ మదిలో ఆలోచించే సమయం ఎపుడొస్తుందీ? నేను సాక్షాత్తూ నీ పాదాలకు దాసుడను. అందువల్ల ఈ భూలోకంలో నా విషయాన్ని మొదట స్మరించు.

19. నయది తవ మనోదాతుం స్వయమయి లఘు వే మహ్యాం ।
ఉపవన తరు కర్ణేవా వదమ దభిమతం కర్తుం ॥

20. నిజ విషయ మతిశ్రేష్ఠం విపది నిపతి తంత్రాతుం ।
స్వకులమపి సదధ్వానం గమయితు మపథే శ్రాంతం ॥

21. అఖిల భువన సమ్రాజః ప్రియ తరుణీ భవత్యైవ ।
మతిబల పరిపూర్ణోఽదయం గణపతిముని రాధేయః ॥

ఓ ఇంద్రాణీదేవీ! అల్లుడనైన నాకు స్వయంగా చెప్పడానికి నీకు ఇష్టం లేకపోతే ఉపవనంలో ఉండే ఈ చెట్టు చెవిలోనన్నా చెప్పవమ్మా! ఆపదలో పడి ఉన్న అతి శ్రేష్ఠమైన నా భారతదేశాన్ని రక్షించడానికి, వంకర మార్గాలను పట్టిపోయి అలిసిపోయిన నా కులాన్ని సన్మార్గంలో పెట్టడానికి నీవు ఈ గణపతిమునిని బుద్ధి

పరిపూర్ణునిగావించు.

*22. నకిము భవతి శందేశే గతివతి కలుషే కాలే ।*
*తవ భజన మఘం సద్యో హరిహయ లలనే జేతుం ॥*

*23. త్రిజగతి సకలం యస్య ప్రభవతి పృథులే హస్తే ।*
*స బహుళ మహిమాకాలో మమ జనని విభూతిస్తే ॥*

ఓ ఇంద్రాణీదేవీ! సుఖప్రదమైన ఈ దేశంలో, కలుషితమైపోయిన ఈ కాలంలో నీకు పూజచేయడంవల్ల పాపాలు వెంటనే తొలగిపోవా ఏమి? అమ్మా, ఈ ముల్లోకాలూ కాలం చేతిలో బందీయే. ఐతే, ఎంతో మహిమ కలిగిన ఆ కాలం కూడా నీ లీలా విభూతియే కదా!

*24. అనవరత గళ ద్బాష్పాం భరత వసుమతీం త్రాతుం ।*
*వితరతు దయితా జిష్ణో ర్గణపతి మునయే శక్తిం ॥*

ఓ ఇంద్రాణీదేవీ! ఎల్లవేళలా కన్నీరు కారుస్తూ ఉన్న ఈ భారత భూమిని రక్షించడానికి ఈ గణపతిమునికి శక్తినివ్వు.

*25. భుజగ శిశుభృతా ఏతాః కవి గణపతినాగీతాః ।*
*విదధతు ముదితాం దేవీం విబుధపతి మనోనాథాం ॥*

గణపతిముని గానం చేసిన ఈ భుజగశిశుభృతా వృత్తాలు ఇంద్రాణీదేవికి ప్రీతిని కలుగజేయుగాక!

బార్హతం శతకంలోని రెండవదైన భుజగశిశుభృతా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 4.3. మణిమధ్యా స్తబకం

1. మంగళదాయీ పుణ్యవతాం మన్మథ దాయీ దేవపతేః ।
విష్టపరాజ్ఞీ హాసలనో విక్రమదాయీ మే భవతు ॥

పుణ్యాత్ములకు శుభాలనిచ్చేదీ, ఇంద్రుని మోహింపజేసేదీ ఇంద్రాణీదేవి చిరునవ్వు. ఆ చిరునవ్వు నాకు విక్రమాన్ని ప్రసాదించు గాక!

2. దృష్టి విశేషై శ్శీతవరై ర్ద్భార్యనుకంపైః పుణ్యతమైః ।
భారత భూమేస్తాపతతిం వాసనకాంతా సా హరతు ॥

విశేషమైన దయ కలిగి, ఆ ఇంద్రాణీదేవి ఎంతో పవిత్రమైన తన చల్లని కృపాదృష్టిని ఈ భారతదేశంపై ప్రసరించి భారతదేశ తాపాలను హరించుగాక!

3. పావన దృష్టి ర్యోగిహితా భాసుర దృష్టి ర్దేవ హితా ।
శీతల దృష్టి ర్భక్త హితా మోహనదృష్టి శ్శక్ర హితా ॥

పవిత్రమైన దృష్టి కలిగి ఉండటం వల్ల యోగులకూ, ప్రకాశించే దృష్టితో దేవతలకూ, చల్లని దృష్టితో భక్తులకూ, మోహన దృష్టితో ఇంద్రుడికీ ఆమె హితురాలు.

4. ఉజ్వలవాణీ విక్రమదా వత్సలవాణీ సాంత్వనదా ।
మంజులవాణీ సమ్మదదా పన్నగవేణీ సా జయతు ॥

5. శారదరాకా చంద్రముఖీ తో యదమాలాకార కచా ।
మేచక పాథో జాతదళ శ్రీహర చక్షుర్వాసి కృపా ॥

6. చంపక నాసా గండ విభా మండల ఖేల త్కుండల భా ।
ఉక్తిషు వీణా బింబఫల శ్రీహర దంత ప్రావరణా ॥

ఉజ్వలమైన వాక్కులను కలిగి ఉంది గనక ఆమె విక్రమాన్నిస్తుంది. ప్రేమ పూరితమైన వాక్కులను కలిగి ఉంది గనక ఓదార్పునిస్తుంది. మంజులమైన వాక్కును కలిగి ఉంది గనక ఆమె సంతోషాన్నిస్తుంది. అటువంటి పన్నగవేణి అయిన ఆ ఇంద్రాణీదేవి ప్రకాశించుగాక! శరత్కాలపు చంద్రుని పోలిన ముఖాన్నీ, మేఘం లాంటి కొప్పునూ కలిగి, నల్లని కలువరేకులతో సమానమైన కళ్లతో దయను కలిగిన ఆ ఇంద్రాణీదేవి ప్రకాశించుగాక! సంపెంగ పువ్వులాంటి ముక్కు, చెక్కిళ్లపైన ఉండే కాంతితో ఆడుకుంటున్న ఆమె చెవికున్న ఆభరణాల కాంతులు, వీణానాదంతో సరిపోలిన పలుకులూ, దొండపండుకు ఉండే శోభను హరించే అధరాల కాంతినీ

కలిగి ఉన్న ఆ ఇంద్రాణీదేవి ప్రకాశించుగాక!

7. నిర్మల హాస క్షాళి తది గ్భిత్తి సమూహా మోహాహారీ ।
కాంచనమాలా శోభిగళా సంతతలీలా బుద్ధికళా ॥

8. విష్టపధారి క్షీరధర స్వర్ణఘట శ్రీహారి కుచా ।
కాపి బిడౌజో రాజ్యరమా చేతసి మాతా భాతుమమ ॥

ఆమె నిర్మలమైన నవ్వులు దిక్కులనే గోడలను శుభ్రంగా కడిగేస్తూ, మోహాన్ని తొలగిస్తూ ఉంది. ఆమె బంగారు కంఠాభరణంతో ప్రకాశించే కంఠాన్నీ, నిరంతరమైన లీలలను చూపే బుద్ధికళలనూ కలిగి ఉంది. ఆ మహాతల్లి ఈ ప్రపంచాన్ని పోషించడాని కోసం పాలతో నిండిన బంగారు కలశాల్లాగా ప్రకాశించే కుచాలనూ కలిగి ఉంది. అటువంటి దేవేంద్రుని రాజ్యలక్ష్మియైన ఆ ఇంద్రాణీదేవి నా మనస్సులో ప్రకాశించు గాక!

9. దివ్యసుధోర్మి ర్భక్తిమతాం పావక లీలా పాపకృతాం ।
వ్యోమ్ని చరంతీ శక్రసఖీ శక్తిరమోఘా మామవతు ॥

ఆమె తన భక్తులకు దివ్యమైన అమృతం లాంటిది. పాపాత్ములపాలిట అగ్ని లాంటిది. ఆకాశంలో సంచరించే ఇంద్రసఖి అనే ఆ అమోఘమైన శక్తి నన్ను రక్షించుగాక!

10. సమ్మదయంతీ సర్వతనుం సంశమయంతీ పాపతతిం ।
సంప్రథయంతీ సర్వమతీ స్సంఘటయంతీ ప్రాణబలం ॥

11. నిర్జిత శోకా ధూత తమా స్సంస్కృత చిత్తా శుద్ధ తమా ।
వాసవశక్తే ర్వ్యోమజుషః కాచన వీచిర్మాం విశతు ॥

అందరినీ సంతోషపెడుతూ, పాపులను నాశనం చేస్తూ, అందరి బుద్ధులను ప్రకటించేదీ, ప్రాణబలాన్ని సమకూర్చేదీ, శోకాన్ని నాశనం చేసేదీ, చీకట్లను తొలగిం చేదీ, చిత్తాన్ని సంస్కరించేదీ, పరిశుద్ధమైన ఆకాశ శరీరిణీ అయిన ఆ ఇంద్రాణి చూపుల వీచికొక్కటి నాలో ప్రవేశించుగాక!

12. ఉద్గత కీలం మూలమిదం భిన్న కపాలం శీర్షమిదం ।
ఉజ్ఝితమోహం చిత్తమిదం వాసవ శక్తిర్మాం విశతు ॥

13. దృశ్య విరక్తం చక్షురిదం భోగవిరక్తం కాయమిదం ।
ధ్యేయ విరక్తా బుద్ధిరియం వాసవశక్తి ర్మాం విశతు ॥

14. చక్షు రదృశ్య జ్వాలభృతా వ్యాపక ఖేన ప్రోల్లసతా ।
విస్తృత కాయం సందధతీ వాసవశక్తి ర్మాం విశతు ॥

15. కాయ మజస్రం వజ్రదృఢం బుద్ధి మశేషం వ్యాప్తిమతీ ।
దివ్యతరంగై రా దధతీ వాసవశక్తి ర్మాం విశతు ॥

16. మూర్ధ్ని పతంతీ వ్యోమతలా త్సంతతమంత స్సర్వతనౌ ।
సంప్రవహంతీ దివ్యఝరై వాసవశక్తి ర్మాం విశతు ॥

17. భానువిభాయాం భాసకతా దివ్యసుధాయాం మోదకతా ।
కాపి సురాయాం మాదకతా వాసవశక్తి ర్మాం విశతు ॥

కిరణాలు వెళ్లే ఈ మూలాధారం, కపాల భిన్నమైన ఈ శిరస్సు, మోహాన్ని వదిలేసిన ఈ మనస్సు గల నా ఈ దేహంలోకి ఆ వాసవశక్తి ప్రవేశించుగాక (కపాల భేదన జరిగాకే గణపతిముని ఈ ఇంద్రాణీ సప్తశతి వ్రాశారనేది మనకు తెలిసిందే). విరక్తితో ప్రపంచంమీదనుండి దృష్టి మరల్చిన ఈ కళ్లు, భోగాలనుంచి విరక్తమైన ఈ దేహమూ, ధ్యేయవస్తువు నుండి విరక్తమైన బుద్ధీ కలిగిన నన్ను (నాలో) ఇంద్రాణీదేవి ప్రవేశించుగాక! అంతేకాదు. కంటికి కనిపించని జ్వాలలను భరిస్తూ ఎంతో ఎక్కువగా ప్రకాశవంతంగా ఉంటూ విస్తరించిన ఆకాశాన్నే శరీరంగా కలిగిన ఆ ఇంద్రాణీదేవి నాలో ప్రవేశించుగాక! సంపూర్ణమైన బుద్ధిని వ్యాపింపజేస్తూ, ఎల్లవేళలా శరీరాన్ని వజ్రంలాగా దృఢంగా ఉంచే ఆ ఇంద్రాణీదేవి నాలో ప్రవేశించు గాక! ఆకాశం నుంచి శిరస్సుపై పడ్తూ శరీరమంతా వ్యాపించి నిరంతరమైన దివ్య ప్రవాహంగా ఉండే ఆ ఇంద్రాణి నాలో ప్రవేశించుగాక! సూర్యుడిలోని ప్రకాశకత్వమూ, అమృతంలోని ఉల్లాసమూ, సురాపానం వల్ల కలిగే మాదకతా – ఈ మూడు ఆ వాసవ శక్తిలోనే ఉన్నాయి. ఆ వాసవశక్తి నాలో ప్రవేశించుగాక!

18. భాసయతాన్మే సమ్యగృతం మోదముదారం పుష్యతు మే ।
సాధుమదం మే వర్ధయతా న్నిర్జర భర్తుశ్శక్తిరజా ॥

ఇంద్రాణీ శక్తి నా మానసిక సత్యాన్ని బాగా ప్రకాశింపజేయుగాక. నాకు బాగా సంతోషాన్నిస్తూ సాత్వికబలాన్ని కూడా ఇచ్చుగాక!

19. కశ్చన శక్తిం యోగబలా దాత్మశరీరే వర్ధయతి ।
ఏపి వివృద్ధిం భక్తిమతః కస్య చిదీ శే త్వం వపుషి ॥

20. సాధయతాంవా యోగవిదాం కీర్తయతాంవా భక్తిమతాం ।
వత్సల భావాదింద్రవధూ ర్గగ్భభువాంవా యాతివశం ॥

అమ్మా! ఇంద్రాణీ! యోగబలంతో ఒకడు తన దేహశక్తిని పెంపొందించు కుంటే, ఇంకొకరి శరీరంలో నీవే వృద్ధినొందుతూ ఉంటావు. సాధన చేసే యోగ వేత్తలకూ, కీర్తించే భక్తులకూ కూడా వాత్సల్యంతో తన గర్భంనుంచి వెలువడిన వారికి వశమైనట్లే ఆ ఇంద్రాణీదేవి వశమవుతుంది.

*21. యస్య సమాధిఃకోపి భవే దాత్మమనీషా తస్యబలం ।*
*యస్తవ పాదాంభోజరత స్తస్య ఖలు త్వం దేవి బలం ॥*

*22. ద్వాదశవర్షీ యోగబలా ద్యాఖలు శక్తిర్యుక్త మతేః ।*
*తాం శచి దాతుం భక్తిమతే కాపి ఘటే తే మాతరలం ॥*

అమ్మా! ఇంద్రాణీ దేవీ! 12 సంవత్సరాలు యోగబలనియుక్తుడై ఉండిన వానికి ఏ శక్తి అయితే కలిగిందో, నీ భక్తుడనైన నాకు అటువంటి శక్తినే ఇవ్వాలీ అని నీవనుకుంటే ఒక్క గడియ చాలు. నాకు తప్పక ఇవ్వగలవు.

*23. యోగబలాద్వా ధ్యానకృతో భక్తిబలాద్వా కీర్తయతః ।*
*యాతు వివృద్ధిం విశ్వహితా వాసవశక్తిర్మే వపుషి ॥*

యోగబలంతో ధ్యానించే వారికీ, భక్తి బలంతో కీర్తించే వారికీ ఏ శక్తి అయితే వృద్ధిచెందుతుందో, ఆలాటి ఇంద్రాణీ సంబంధమైన శక్తిని నాశరీరం కూడా పొందు గాక!

*24. దుఃఖిత మేత చ్ఛ్రీరహితం భారతఖండం సర్వహితం ।*
*త్రాతు మధీశా స్వర్గగత స్సూక్షమబుద్ధిం మాం కురుతాం ॥*

ఐశ్వర్యాన్ని కోల్పోయి సదా దుఃఖిస్తూన్న సర్వహితమైన ఈ భారత ఖండాన్ని రక్షించడానికి ఇంద్రాణీదేవి నాకు తగిన బుద్ధిని ఇచ్చుగాక!

*25. సంతు కవీనాం భర్తురిమే సుందర బంధా శ్శుద్ధతమాః ।*
*సన్మణి మధ్యా స్స్వర్గగతో రాజ మహిష్యాః కర్ణ సుఖాః ॥*

కవి భర్తయైన ఈ గణపతిముని వ్రాసిన సుందరమైన, అత్యంత శుభ్రమైన ఈ సన్మణిమధ్యా వృత్తాలు ఇంద్రాణీదేవిచెవులకు సుఖాన్నిచ్చుగాక!

బార్హతం శతకంలోని మూడవదైన మణిమధ్యా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 4.4. మాత్రాసమక స్తబకం

1. శుక్ల జ్యోతిః ప్రకరై ర్వ్యాప్త
సూక్ష్మైప్యంతాన్ హరితాం హాసః ।
జిష్ణోః పత్న్యా స్తిమిరారాతి
ర్ని శ్శేషం మే హరతా న్మోహం ॥

కంటికి కనిపించని తెల్లనికాంతితో నలుదిక్కులా వ్యాపించినదీ, చీకటిని పార ద్రోలేదీ అయిన ఇంద్రాణీదేవి చిరునవ్వు నా అజ్ఞానాన్ని పూర్తిగా తొలగించుగాక!

2. శృణ్వత్కర్ణా సదయాలోకా
లోకేంద్రస్య ప్రియనారీ సా ।
నిత్యాక్రోశై ర్విరుదద్వాణీం
పాయాదేతాం భరతక్షోణీం ॥

నేను చేసే ఈ స్తుతిని తన చెవులారా వినే ఆ ఇంద్రాణీదేవి అపారదయ కలిగిన తల్లి. నిత్యశోకంతో చాలా రోదనతో కూడిన వాక్కు కలిగిన ఈ భారతభూమిని ఆ ఇంద్రాణీదేవి రక్షించుగాక!

3. దేవేషు స్వః పరిదీప్యంతీ
భూతేష్విందౌ పరిఖేలంతీ ।
శక్తిర్జిష్ణో ర్ద్విపదాం సంఘే
హంతై తస్యాం భువి నిద్రాతి ॥

స్వర్గంలో దేవతలలో ప్రకాశిస్తూ, చంద్రగోళంలో భూతాలలో క్రీడించే ఇంద్రాణీదేవి ఈ భూమిపై ఉండే మానవులలో మాత్రం నిద్రిస్తూ ఉంది. ఇది చాలా ఆశ్చర్యం కలిగించే విషయం (అజ్ఞానులలో మూలాధార చక్రంలోని శక్తి నిద్రిస్తూ ఉంటుందని అంటారు) కదా!

4. నిద్రాణాయా అపి తేజ్యోతి
ర్గంధాదేతే ధరణీలోకే ।
మర్త్యాః కించిత్ప్రభవంతీ శే
త్వం బుద్ధాచే త్కిము వక్తవ్యం ॥

తల్లీ! నిద్రిస్తూ ఉన్నా నీ తేజస్సు అనే గంధంవల్ల భూలోకంలో ఈ మనుష్యులు

కొంత సమర్థులుగానే ఉన్నారు. కానీ, నీవు ఆ మనిషిలో మేల్కొన్నావని తెలిస్తే ఇక చెప్పడానికేముంటుందీ?

5. మేఘ చ్ఛన్నోఽ ప్యరుణ స్తేజో
దద్యా దేవ ప్రమదే జిష్ణోః ।
అత్ర స్థానా భవతీ గ్రంధి
చ్ఛన్నా ప్యేవం కురుతే ప్రజ్ఞాం ॥

అమ్మా! మేఘాలు తనను కమ్మేసినా సూర్యుడు వెలుతురునిస్తాడు. భూలోక వాసులలో నీవు గ్రంధులతో కప్పబడినా, వారికి ప్రజ్ఞనిస్తూ ఉన్నావు.

6. ధ్యాయామో యత్కథయామో య
త్పశ్యామో యచ్ఛృణుమో యచ్చ ।
జీవామోవా తదిదం సర్వం
నిద్రాణాయా అపితే భాసా ॥

నీవు నిద్రిస్తూ ఉన్నా సరే, నీ కాంతివల్లనే మేము ధ్యానంచేయడం, పలకడం, చూడటం, వినడం, జీవించడం – ఇవన్నీ చేస్తూ ఉన్నాం.

7. నాడీ బంధా దభిమానాచ్చ
చ్ఛన్నా మాతర్భవతీ దేహే ।
ఏకాపాయా దితరో నశ్యే
త్తస్మా ద్ద్వేధా తపసః పంథాః ॥

అమ్మా! నాడీబంధం వల్లా, అభిమానం వల్లా కూడా నీవు దేహంలో కప్పబడి పోయి ఉన్నావు (అందుకే వాటిని గ్రంధులన్నారు). వాటిలో ఏ ఒక దానికి అపాయం కలిగినా రెండూ నశిస్తాయి. అందువల్ల తపస్సుకు రెండు దారులు ఏర్పడ్డాయి (ప్రాణ సంబంధమైనదొకటైతే మనస్సుకు సంబంధించిందింకొకటి. అంటే శబ్ద సంబంధమైనదొకటైతే, రూప సంబంధమైందింకొకటి).

8. చిత్తం యస్య స్వజని స్థానే
ప్రజ్ఞా బాహ్యే నభ వేద్యస్య ।
అథత్వే త్వం భువనాధీశే
బుద్ధా క్రీడాం హృదయే తస్య ॥

అమ్మా, ఎవరికి చిత్తం స్వస్థానంలో ఉంటుందో, ఎవరి ప్రజ్ఞ బయటకు

తెలియదో అటువంటి వారి హృదయంలో నీవే తెలివివై ఉన్నావు (మనస్సును తన మూలమైన హృదయంలోనే అణిచి ఉంచి, ఆలోచనకు అందకుండా పోవడం అనే రమణమహర్షి ఉపదేశంలోని ఒక భాగం ఇక్కడ వెల్లడవుతూంది).

9. వాణీ యస్య స్వజనిస్థానే
దూరే కృత్వా మనసా సంగం ।
మాత స్తత్ర ప్రతి బుద్ధా త్వం
శ్లోకైర్లోకం కురుషే బుద్ధమ్ ॥

అమ్మా, ఎవరి మాటైతే మనస్సుతో కలవకుండా ఉంటుందో (అంటే ప్రాణం మూలాధారంలోనే ఉంటుందో) అటువంటి వారిలో నీవు చాలా జాగ్రత్తగా ఉండి, ఈ లోకంలో వారు కీర్తి జ్ఞానాలు కలిగి ఉండేట్లు చూస్తున్నావు.

10. హిత్వా దృశ్యాన్యతి సూక్ష్మాయాం
చక్షుర్యస్య స్వమహోవృత్తౌ ।
విశ్వా లిప్తా జగతాం మాత
ర్జాగ్రత్యస్మిన్ అచలాభాసి ॥

11. శృణ్వత్కర్ణో దయితే జిష్ణో
రంతశ్శబ్దం ధ్రియతే యస్య ।
బుద్ధా భూత్వా వియతా సాధో
రేకేభావం కురుషే తస్య ॥

12. యాతా యాతం సతతం పశ్యే
ద్యః ప్రాణస్యప్రయతో మర్త్యః ।
విశ్వస్యేష్టాం తనుషే క్రీడాం
తస్మిన్ బుద్ధా తరుణీంద్రస్య ॥

దేవీ! ఎవరి కళ్లు తనకు కనిపించే దృశ్యాలను విడిచి, ఎలాటి విషయంపైనా ఆలోచనా లేకుండా అతి సూక్ష్మమైన తన లోపలి తేజస్సు మీద మనస్సు లగ్నం చేసి ఉంటుందో, అటువంటి వారిలో నీవు మేల్కొని నిశ్చలగా ఉండి ప్రకాశిస్తావు. ఎవడైతే తను వినే చెవిలోని అంతశ్శబ్దాన్ని గ్రహిస్తాడో అటువంటి సాధకుడిలో నీవు మేల్కొని ఆకాశంతో ఐక్యమయ్యే భావాన్నిస్తావు (శబ్దమూలాన్ని తెలుసుకునేలా చేస్తావు అని అర్థం). ఎవడైతే పవిత్రంగా ఉండి ప్రాణం రాకపోకలను చూస్తాడో, అటువంటివానిలో మేలుకొన్న ఇంద్రాణివై ఈ విశ్వానికి ఇష్టమైన ఆటను ఆడతావు.

13. స్వాంతం యస్య ప్రభవేత్కార్యే
ష్వంబై తస్మిన్నయి నిద్రాసి ।
ఆత్మా యస్య ప్రభవేత్కార్యే
ష్వంబై తస్మిన్నయి జాగర్షి ॥

14. యస్యాఽహంతా భవతి స్వాంతే
తస్య స్వాంతం ప్రభవేత్కర్తుం ।
యస్యాఽహంతా భవతి స్వాత్మ
న్యాత్మా తస్య ప్రభవేత్కర్తుం ॥

ఓ తల్లీ! ఎవరి చిత్తమైతే పనిచేయడానికి సమర్థంగా ఉందో అటువంటివారిలో నీవు నిద్రించి ఉంటావు. ఎవరి ఆత్మ అయితే పనిచేయడంలో సమర్థత కలిగి ఉందో అలాంటివారిలో నీవు మేల్కొని ఉంటావు (**అన్నిటికీ నా చిత్తమే కర్త** అని అహంకరించే వాడొకడైతే, **కర్త స్థానం ఆత్మ** అని తెలిసిన వాడింకొకడు). ఎవరి అహంకారమైతే మనస్సులో ఉంటుందో, వాడి మనస్సు సామర్థ్యాన్ని కలిగి ఉంటుంది. కానీ నీవు అందులో నిద్రిస్తావు. అందువల్ల అతని ఆత్మను అహం కప్పేస్తుంది. అదే ఎవరైతే తన అహాన్ని ఆత్మలో ఉంచుకుంటాడో అతని ఆత్మ పనిచేసే సామర్థ్యంతో ఉంటుంది. ఎందుకంటే, ఆ ఇంద్రాణీదేవి అతనిలో ఉండి చేయిస్తుంది.

15. స్వాంతం యస్య ప్రభవేత్కర్తుం
తత్కర్మాల్పం భవతి వ్యష్టేః ।
ఆత్మా యస్య ప్రభవేత్కర్తుం
తచ్ఛ్లాఘ్యం తే బలజిత్కాంతే ॥

ఓ తల్లీ, ఎవరి మనస్సైతే పనిచేసే సామర్థ్యాన్ని పొందుతుందో, అటువంటి వారిలో ఆ కర్మ అనేది అల్పమై పోతుంది. ఎవరి ఆత్మ క్రియాసామర్థ్యాన్ని పొందు తుందో అతని కర్మ కీర్తిని పొందుతుంది.

16. ఏతత్స్వాంతం హృదయా జ్జాతం
శీర్షే వాసం పృథగాధాయ ।
హార్దా హంతాం స్వయమాక్రమ్య
భ్రాంతానస్మాన్కురుతే మాతః ॥

17. అస్మాకం భోః కురుతే బాధా
మస్మజ్జ్యోతిర్జనని ప్రాప్య ।
స్వాంతే నైతత్కృత మన్యాయ్యం
కాంతే జిష్ణో శ్శృణు రాజ్ఞీ త్వం ॥

18. స్వాంతేతేజో హృదయాదాయా
చ్చంద్రే తేజో దినభర్తుర్వా ।
అశ్రాంతం యో మనుతే ధీర
స్తస్యస్వాంతం హృదిలీనం స్యాత్ ॥

19. మూలాన్వేషి స్ఫురదావృత్తం
నీచైరాయా త్కబళీకృత్య ।
జానం త్యేకా హృదయస్థానే
యుంజానానాం జ్వలసీశానే ॥

అమ్మా! హృదయాన్నుండి పుట్టిన చిత్తం విడిగా శిరస్సులో వేరే కర్తగా ఉండి హృదయంలోని అహాన్ని ఆక్రమించి, మమ్మల్ని భ్రాంతిలో ముంచుతూ ఉంది. ఈ చిత్తం అనేది మా తేజస్సును పొంది మాకే అనేక బాధలు కలిగిస్తూ ఉంది. ఈ అన్యాయానికి మా మనస్సే కారణమవుతోంది. ఓ ఇంద్రాణీదేవీ! విను. మా హృదయంలోని తేజస్సు, మా మనస్సుకు తేజస్సులాగా (చంద్రుడికి సూర్యుని తేజస్సు ఉన్న రీతిలో) ఉంటోంది. ఇది తెలిసి ఎవడైతే నిత్యము తలుస్తూ ఉంటాడో, అతడి చిత్తం హృదయంలో లీనమైపోతుంది. ఆ చిత్తం హృదయంలో లీనమై, మూలాన్ని అన్వేషిస్తూ, మాటిమాటికీ స్ఫురిస్తూ, గ్రంధులన్నిటినీ కప్పివేసి కిందకు వస్తుంది. అటువంటి యోగుల హృదయాల్లో నీవొక్కదానివే ప్రకాశిస్తావు.

20. శీర్షే చంద్రో హృదయే భాను
ర్నేత్రే విద్యు త్కులకుండేగ్నిః ।
సంపద్యంతే మహసోంశై స్తే
జిష్ణోః కాంతే సుతరాంశస్తే ॥

21. మన్వానాం త్వాం శిరసిస్థానే
పశ్యంతీంవా నయన స్థానే ।
చేతంతీంవా హృదయస్థానే
రాజంతీంవా జ్వలన స్థానే ॥

22. యోనా ధ్యాయే జ్జగతాం మాతః
కశ్చిచ్ఛ్రేయానవనౌ నాఽతః ।
పూతం వంద్యం చరణం తస్య
శ్రేష్ఠం వర్ణ్యం చరితం తస్య ॥

అమ్మా! శిరస్సులో చంద్రుడు, హృదయంలో సూర్యుడు, కళ్లల్లో విద్యుత్తూ, కుండలినీలో ఉండే అగ్ని - ఇలా (దేహంలో) అన్నీ కూడా నీ తేజస్సుకు చెందిన అంశలనే కలిగి ఉన్నాయి. శీర్ష స్థానంలో నిన్ను ఆలోచనా రూపంగానూ, కళ్ల స్థానంలో చూపుగానూ, హృదయ స్థానంలో ఉండే చైతన్యంగానూ, కుండలినీ స్థానంలో దీపంగానూ నిన్ను ధ్యానించేవాడు అత్యంత శ్రీమంతుడు. అతనికంటే శ్రీమంతులెవరూ ఈ లోకంలో ఉండరు. అతడి పాదం పవిత్రమై పూజార్హమవుతుంది. అతడి చరిత్ర మిక్కిలి శ్రేష్ఠమై వర్ణించడానికి అర్హమవుతుంది.

23. దోగ్ధ్రీం మాయాం రసనాంవా యో
మంత్రం మాత ర్జపతి ప్రాజ్ఞః ।
సోఽయం పాత్రం కరుణాయా స్తే
సర్వం కామ్యం లభతే హస్తే ॥

ఓ తల్లీ! మాయా బీజమైనా (హ్రీం అనేది మాయా బీజం), దోగ్ధ్రీ బీజమైనా (హూం అనేది దోగ్ధ్రీ బీజం), రసనా బీజమైనా (క్రీం అనేది రసనా బీజం) - ఏదైనా సరే ఎవడైతే మంత్రసహితంగా జపిస్తాడో అతడు నీ కరుణకు పాత్రుడవుతున్నాడు. అతనికి సకల కార్యాలూ సిద్ధిస్తాయి.

24. భిన్నాంభిన్నాం సుతరాంసన్నా
మన్నాభావాదభితః ఖిన్నాం ।
ఏతాంపాతుం భరతక్షోణీం
జాయేజిష్ణోః కురుమాం శక్తః ॥

ఓ తల్లీ! భిన్నాభిన్నమైపోతూ, కృశించిపోతూ, అన్నమే లేకుండా సదా దుఃఖిస్తూ ఉన్న ఈ భారతభూమిని రక్షించే శక్తినివ్వు.

25. క్లుప్తై స్సమ్యగ్బృహతీ ఛంద స్యై
తై ర్మాత్రాసమకై ర్వృత్తైః ।
కర్ణాధ్వానం ప్రవిశద్భి స్సా
పౌలోమ్యంబా పరితృప్తాస్తు ॥

చక్కగా రచించిన బృహతీ ఛందస్సును కలిగిన ఈ మాత్రాసమక వృత్తాలు ఆ ఇంద్రాణీదేవి చెవులకు సోకి ఆమెకు తృప్తినిచ్చుగాక!

బార్హతం శతకంలోని నాలుగవదైన మాత్రాసమక స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

దీనితో ఇంద్రాణీ సప్తశతిలోని నాలుగవదైన బార్హతం శతకం
పూర్తి అయింది.



# 5. పాంక్తం శతకం

పాంక్తం శతకం అనేది ఇంద్రాణీ సప్తశతిలోని ఐదవ శతకం. మయూరసారిణీ, మనోరమా, మణిరాగ, మేఘవితాన అనే 4 స్తబకాలు కలిసి పాంక్తం అనే శతకం అవుతుంది. ఈ శతకంలో తొలి స్తబకంపేరు మయూరసారిణీ స్తబకం. ప్రేమకు నివాసమై, నిర్మలతకు నిలయమై నిత్యమూ పాపాలను నశింపజేసే ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు నా ఆపదలను తొలగించుగాక! అంటూ కవి తన శతకాన్ని ఆరంభిస్తాడు.

## 5.1. మయూరసారిణీ స్తబకం

*1.* *ప్రేమవాస భూమిరచ్ఛ భావ*
*స్థానమాన మజ్జనాఘహా మే ।*
*ఇంద్రసుందరీ ముఖాబ్జభాసీ*
*మందహాస ఆపదం ధునోతు ॥*

ప్రేమకు నివాసమై, నిర్మలతకు నిలయమై నిత్యమూ తన భక్తుల పాపాలను నశింపజేసే ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు నా ఆపదలను తొలగించుగాక!

*2.* *వీక్షితైః కృపాన్వితై ర్హరంతీ*
*పాతకాని మంగళం భణంతీ ।*
*జంభభేది జీవితేశ్వరీ మే*
*జన్మదేశ ముజ్జ్వలం కరోతు ॥*

దయాపూరితమైన చూపులతో పాతకాలను హరించి, శుభాలనిచ్చి ఆ ఇంద్రాణీ దేవి నా జన్మభూమిని ఉజ్జ్వలంగా చేయుగాక!

*3.* *అంబరంచ దేవతానతభ్రూ*
*రంబతే తనుద్వయం యదుక్తం ।*
*ఆదిమా తయోర్వృషాకపిం తం*
*దేవ్యజీజన త్వరం జయంతం ॥*

4. ఏతమేవ దేవి లోకబంధుం
సూరయో వృషాకపిం భణంతి ।
వర్షహేతు దీధితి ర్వృషాయం
కం పిబన్కరైః కపిర్నిరుక్తః ॥

5. కేచిదింద్రనారి చంద్రరేఖా
శేఖరం వృషాకపిం గదంతి ।
పండితాః పరేతు శేషశయ్యా
శాయినం వృషాకపిం తమాహుః ॥

అమ్మా! నీకు ఆకాశమనీ, అణుకువగల భ్రూలతలుండే దేవత అనీ రెండు రూపాలున్నాయని అందరూ అంటారు. మొదటి రూపం సూర్యుని (వృషాకపి) కంటే, రెండో రూపం జయంతుని కన్నది. సూర్యుని పండితులంతా లోకబాంధవుడంటున్నారు. సూర్యుడు వృషాకపి. అంటే వర్షాలకు కారణమైన కిరణాలున్నవాడు గనక వృషా అనీ, కిరణాలతో నీటిని తాగేస్తాడు గనక కపి అనీ అర్థం. ఐతే, కొందరు వృషాకపి అంటే చంద్రరేఖను సిగలో ఉంచుకున్న శివుడనీ, ఇంకొందరు శేషశాయి అయిన విష్ణువనీ అంటున్నారు.

6. బ్రహ్మణస్పతింతు వైద్యు తాగ్నే
రంశజం మరుద్గణేషుముఖ్యం ।
విశ్వరాజ్ఞి విఘ్న రాజమేకే
విశ్రుతం వృషాకపిం వదంతి ॥

7. భాస్కరశ్చ శంకరశ్చ మాత
ర్మాధవశ్చ మంత్రనాయకశ్చ ।
ఆత్మజేషు తేన సంతి నాంత
ర్వ్యాప కాంతరిక్ష విగ్రహాయాః ॥

8. వాసవోఽపి దేవిదేవతాత్మా
వల్లభ స్తవ చ్ఛలాంగనాయాః ।
ఆత్మజాతఏవ కీర్తనీయో
దేవతాపథేన దేహవత్యాః ॥

అమ్మా! ఈ వృషాకపి విద్యుత్ అంశకు జన్మించి, మరుద్గణాలకు ముఖ్యుడై, వేదమంత్రాలకే అధిపతియైన బ్రహ్మణస్పతి అనీ, ప్రసిద్ధిగాంచిన వినాయకుడనీ

కూడా మరికొందరు చెబుతారు. ఐతే, భాస్కర, శంకర, మాధవ, విఘ్నేశ్వరులనే వృషాకపి నామధేయులు అంతర్వ్యాప్తమైన అంతరిక్షాన్ని శరీరంగా కలిగిన నీకు పుత్రులు కారనే మాట ఎక్కడాలేదు. దేవతా స్వరూపుడైన ఇంద్రుడు కపట స్త్రీ రూపాన్ని ధరించిన నీకు భర్త. ఆ ఇంద్రుడు కూడా ఆకాశశరీరిణివైన నీకు పుత్రుడేనని చెప్పాల్సి ఉంది.

*9. సా శవ స్యుదీరితాసి ధీరై*
*ర్దేహినీ విహాయసేంద్రసూ స్త్వం ।*
*లింగభేదతోఽనురూపత స్త*
*త్కీర్తనం శవోహి శక్తివాచీ ॥*

నిన్ను పండితులు శవసి అని పిలుస్తారు. ఆకాశశరీరిణివైనావు గనక నిన్ను ఇంద్రసూః (ఇంద్రుని కన్నది) అంటున్నారు (ఐనా సరే. ఇంద్రుని మాత్రం ఎవరూ వృషాకపి అని పిలవడం లేదు). లింగభేదం వల్ల, ఒకే రూపం వల్ల శవసి అంటున్నారు నిన్ను. ఎందుకంటే శవ శబ్దం అనేది శక్తి వాచకం.

*10. నాదితి ర్విభిద్యతే శవస్యా*
*స్సర్వ దేవమాతరం విదుర్యాం ।*
*యా మరుత్ప్రసూ రభాణి పృశ్ని*
*స్సాపి భిద్యతే తతోన దేవ్యాః ॥*

*11. శక్తిరేవ సా న్యగాది పృశ్ని*
*శ్శక్తిరేవ సాఽదితి ర్న్య భాణి ।*
*శక్తిరేవ సాఽభ్యధాయి భద్రా*
*శక్తిరేవ సా శవ స్యవాది ॥*

*12. విజ్ఞనః ప్రకృష్ట శక్తిభాగం*
*శబమేవ పృశ్ని మాహ ధేనుం ।*
*యా పరై ర్బుధై రభాణి గౌరీ*
*మానవేష్ట భాషయైవ నారీ ॥*

నిన్ను అదితి అన్నా, శవసి అన్నా ఒక్కటే. ఎవరిని సకల దేవతలూ తల్లిగా కొలుస్తున్నారో, ఎవరు మరుత్తులకు తల్లియై పృశ్ని అని పేరు తెచ్చుకుందో ఆమె వేరెవరో కాదు. ఆమె, ఈ శవసి ఇద్దరూ ఒకటే. శక్తియే పృశ్నిగా, అదితిగా, భద్రగా, శవసిగా వ్యవహరిస్తోంది. అంతే. పండితులంతా గొప్పగా ఎంచిన శక్తిభాగమే

పృశ్ని. దానినే ధేనువనీ అంటారు. ఆ శక్తిభాగాన్నే పండితులు మానవులకు ఇష్టమైన భాషలో గౌరీ అని, స్త్రీ అనీ చెప్పారు.

13. వ్యాపకత్వ కల్పితం విశాలం
దేశమేవ శక్తిభాగ మాహుః ।
బుద్ధిశాలి నోఽదితిం సవిత్రీం
యాపరైర్విచక్షణై స్మృతా ద్యౌః ॥

14. నిత్యమోద రూప శక్తిభాగం
పండితాః ప్రకీర్తయంతి భద్రాం ।
ఉక్తిభేద చాతురీ ప్రలుబ్ధాః
నూరయః పరే శివాం జగుర్యాం ॥

బుద్ధిమంతులు వ్యాపకత్వంతో కూడిన విశాల దేశాన్ని శక్తిభాగం అంటున్నారు. విచక్షణ గల ఇంకొందరు ఆకాశాన్ని సవిత్ర అనీ, అదితి అనీ పిలిచారు. నిత్యానంద రూపమైన శక్తి భాగాన్ని పండితులు భద్ర అని పిలిస్తే, చతురతతో మాట్లాడేవారు ఆమెనే శివం అని అంటున్నారు.

15. వీర్యరూపభాగ ఏవ గణ్యాః
పండితై శవస్య భాణిశక్తేః ।
ఓజసో న సోఽతిరిచ్య తేంశో
భిద్యతే తతోన వజ్ర ముగ్రం ॥

16. వజ్రమేవ భాషయా ప రేషా
ముచ్యతే ప్రచండ చండికేతి ।
యద్విభూతిలేశ చుంబితాత్మా
జీయ తేన కేనచి త్పృథివ్యాం ॥

17. సర్వతో గతి శ్శచీతి శక్తిః
కీర్త్యతే బుధై రుదార కీర్తిః ।
సర్వభాగ వాచకం పదంతే
పావనం పురాతనం ప్రియం నః ॥

శవసి అనేది పండితులంతా లెక్కించే శక్తి వీర్య రూపభాగమే. అదీ, ఓజస్సూ వేరే కాదు. దానికంటే ఉగ్రంగా ఉండే వజ్రాయుధమూ వేరే కాదు. రహస్యమైన

భాషలో వజ్రానికే ప్రచండచండిక అని పేరు. ఈ చండికాశక్తిని పొందిన వ్యక్తిని ఎవరూ జయింపలేరు. అటువంటి ఉదారకీర్తిని కలిగిన సర్వవ్యాపియైన శక్తినే **శచీదేవి** అని పండితులు చెప్పారు. సర్వాన్నీ నిరూపించే పేరుగల ఆమె పావని. పురాతనమైన శచి అనే పేరు మాకెంతో ప్రియమైంది.

*18.* *యశ్శచీతి నామకీర్తయే న్నా*
*పుష్కరేణ తే శరీరవత్యాః ।*
*దివ్య సుందరీ తనో రుతాహో*
*తం పరాభవేన్న దేవి పాపం ॥*

*19.* *అంబరం వరం తవాంబ కాయం*
*యస్సదా విలోకయన్ను పాస్తే ।*
*లోకజాల చక్రవర్తి జాయే*
*తం పరాభవేన్న దేవి పాపం ॥*

ఓ తల్లీ! ఎవరైతే ఆకాశశరీరిణియై దివ్య స్త్రీదేహాన్ని పొందిన శచీదేవి పేరును కీర్తిస్తారో వారిని పాపమంటదు. ఎవరైతే శ్రేష్ఠమైన నీ ఆకాశరూపాన్ని చూస్తూ సదా ఆరాధిస్తారో అలాటి వారిని పాపమనేది తాకనే తాకదు.

*20.* *పూర్ణిమా సుధాంశు బింబవక్త్రం*
*ఫుల్ల వారిజాతపత్ర నేత్రం ।*
*శుభ్రతా నిధాన మందహాసం*
*కాలమేఘకల్ప కేశపాశం ॥*

*21.* *రత్న దర్పణాభ మంజుగండం*
*చంపక ప్రసూనచారు నాసం ।*
*కుందకుట్మలాభ కాంత దంతం*
*కల్పపల్లవాభ దంతచేలం ॥*

*22.* *సద్వరాఽభయ ప్రదాయి హస్తం*
*సర్వ దేవవంద్య పాదకంజం ।*
*దివ్య రత్న భూషణై రనర్ఘై*
*ర్భూషితం కనత్సువర్ణవర్ణం ॥*

*23.* *దివ్య శుక్ల వస్త్రయుగ్మ ధారి*
*స్వర్గ సార్వభౌమ నేత్రహారి ।*
*యస్మరే ద్వరాంగనావపు స్తే*
*తం పరాభవేన్న దేవి పాపం ॥*

పున్నమిచంద్రుని తలపించే ముఖం, వికసించిన పద్మదళాలవంటి కళ్లు, నిర్మల నిధియైన చిరునవ్వు, వర్షాకాలపు మేఘంలాంటి కొప్పు, రత్న ఖచితమైన అద్దంలాంటి చెక్కిళ్లు, సంపెంగపూవులాటి సొగసైన ముక్కు, మల్లెమొగ్గల్లాంటి అందమైన పలు వరస, కల్పవృక్షపు చిగురుల్లాంటి రంగున్న పెదాలు, ఇష్టమైన వరాలనూ, అభయాన్నీ ఇచ్చే చేతులూ, సకల దేవతలూ నమస్కరించే పాదాలూ కలిగి ఉంటుంది ఇంద్రాణీదేవి. వెలలేని దివ్యరత్నాభరణాలతో అలంకరించుకుని బంగారుఛాయవంటి రంగు కలిగి దివ్యమైన తెల్లని వస్త్రాలను ధరించి, ఇంద్రుని కళ్ళకు సొగసుగా కనిపించే అటువంటి దేవతను ఎవరైతే స్మరిస్తారో, అటువంటి వారిని ఏ పాపాలూ తాకవు.

*24.* *భారతక్షి తే రిదం జనన్యా*
*శ్శోకజన్య బాష్ప వారిహర్తుం ।*
*దేహి శక్తి మాశ్రితాయ మహ్యం*
*పాహి ధర్మ మింద్రచిత్తనాథే ॥*

ఓ తల్లీ, భారతమాత కన్నీటిని ఆపడానికి ఆశ్రితుడనైన నాకు శక్తినివ్వు! ధర్మాన్ని రక్షించు!

*25.* *సద్వసిష్ఠ సంతతే రిమాభి*
*స్సత్కవే ర్మయూర సారిణీభిః ।*
*సమ్మదం ప్రయాతు శక్ర చేత*
*స్సం ప్రమోహినీ సరోజనేత్రా ॥*

వాసిష్ఠ గోత్రంలో పుట్టిన ఈ సత్కవి వ్రాసిన ఈ మయూరసారిణీ వృత్తాల వల్ల ఇంద్రాణీదేవి సంతోషించుగాక!

పాంక్తం శతకంలోని మొదటిదైన మయూర సారిణీ స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 5.2. మనోరమా స్తబకం

1. హసిత మాత తాయి పాతక
ప్రమథన ప్రసిద్ధ విక్రమం ।
అమరభూమి పాల యోషితో
మమ కరోతు భూరిమంగళం ॥

దుర్మార్గుల పాపాలను శిక్షించడానికి ప్రసిద్ధమైన పరాక్రమం గల ఆ ఇంద్రాణీ దేవి చిరునవ్వు నాకు ఎక్కువ శుభాలనిచ్చు గాక!

2. కరుణయా ప్రచోదితా క్రియా
ర్భరతభూమి మక్షయశ్రియం ।
చరణ కంజరాజ దిందిరా
సురనరేశ్వరస్య సుందరీ ॥

పాదపద్మాలలో లక్ష్మీదేవి ప్రకాశిస్తూ ఉన్న ఇంద్రాణీదేవి దయవల్ల ప్రేరణపొంది ఈ భారతభూమి అక్షయమైన సంపదను పొందుగాక!

3. న భవనం నవా జగత్పృథ
క్షీవసనాయితే సురార్చితే ।
యదఖిలాని విష్టపాని తే
వపుషి సర్వమందిరాణిచ ॥

4. మతి దవిష్ఠసీమ భాసురం
తవ శరీరమేవ పుష్కరం ।
పరమ పూరుషస్య వల్లభే
భువనమేక ముచ్యతే బుధైః ॥

5. తరణ యస్సుధాంశవ స్తథా
సహభువా గ్రహా స్సహస్రశః ।
అయి జగంతి విస్తృతాని తే
వపుషి పుష్కరే జగత్య జే ॥

ఓ ఇంద్రాణీదేవీ! నీకు ఉండటానికి ఇల్లు లేదు. ఒక వేళ ఈ జగమే నీ ఇల్లు అని అంటే ఆ సమస్తమూ నీకు శరీరమైపోతూ దానిలో ఉన్న సర్వభువనాలూ నీకు

మందిరాలైపోతున్నవి (ఆమె శరీరం ఈ భువనాల కన్నా అతి సూక్ష్మంగా ఉంటుంది. అందువల్ల వాటి లోపల ఆకాశం నివసించి ఉంటుంది. అలా అవి ఆమెకు నివాసాలుగా అవుతున్నాయి. ఆకాశ శరీరిణికి అందులోని భువనాలే తిరిగి ఆమెకు ఇళ్లు కావడమనే ఇక్కడ కవి చమత్కారం). ఐతే, బుద్ధికి దూరంగా ప్రకాశించే ఆకాశాన్నే పండితులు ఒక లోకంగా వర్ణిస్తూ ఉన్నారు (గాయత్రం శతకంలో ముకుళా స్తబకంలో 19వ శ్లోకాన్ని ఒక్కసారి గుర్తుకు తెచ్చుకోవాలి. అందులో ఆకాశం ధూళి రూపంగా, ధూళి లేకుండా, దానికన్నా వేరుగా, పరాకాశంగా - ఇలా నాలుగు విధాలుగా ఉందన్నారు. వాటిలో ఆమెకు శరీరమైన పరాకాశమనే అర్థాన్ని మనం ఇక్కడ తీసుకోవాలి). ఓ ఇంద్రాణీదేవీ! ఆ ఆకాశమనే నీ శరీరంలోనే సూర్యచంద్రులు, భూమితో సహా వేల కొలది గ్రహాలూ, ఇంకా అనేకమైన జగత్తులూ ఉన్నాయి.

6. *బహుభి రుష్ణ భానుభిర్భృతాత్*
*బహుభిరిందుభి ర్వశీ కృతాత్ ।*
*వియతి లోకజాలధాత్రి తే*
*శతగుణం బలం ప్రశిష్యతే ॥*

7. *న విభు రేకకస్య భాస్వతో*
*విభవమేవ నా ప్రభాషితుం ।*
*కిముత తే దధాసి యోఽదరే*
*ద్యుతిమతాం శతాని తాదృశాం ॥*

ఓ ఇంద్రాణీదేవీ! అనేక సూర్యులనుంచి వచ్చే వేడి (శక్తి) కన్నా, అనేక చంద్రుల వశీకరణశక్తి కన్నా ఆకాశంలో ఉండే నీ బలం నూరురెట్లు అధికం. కేవలం ఒక్క సూర్యుని వైభవం గురించి చెప్పడానికే పురుషుడు అసమర్థుడైతే, ఇటువంటి వందలకొద్దీ సూర్యులే నీలో ఉన్నపుడు ఇక నీ వైభవాన్ని పురుషుడెలా వర్ణించగలడు, చెప్పు!

8. *ఇహ విహాయసా శరీరిణీ*
*మతి సమీపవాసినీ మపి ।*
*న ఖలు కోపిలోకితుం ప్రభు*
*ర్భగవతీం పరామయుక్త ధీః ॥*

9. తదిద ముచ్యతే జనో జగ
ద్వపుర మేయ మాదిదేవి తే ।
జనయతే యతోఽఖిలంధృశో
ర్విషయభూతమేత దాతతం ॥

ఓ దేవీ! ఈ ఆకాశాన్నే శరీరంగా చేసుకుని అందరికీ సమీపంగా ఉండే పరాదేవివైన నిన్ను చపలబుద్ధిగలవారు చూడలేరు. అటువంటి అచింత్యమైన నీ శరీరం **జనోలోకం**గా పేరు పొందింది. సర్వత్రా వ్యాపించిన ఈ విశ్వభూతం ఏ విధంగా మానవుడి దృష్టికి పుడుతున్నట్లు కనిపిస్తూ ఉందో, ఆ విధంగానే దాన్ని జనోలోకం అంటున్నారంతా (అందరికీ జన్మనిచ్చే దేవి మాతృత్వ ధర్మం మూలంగా పండితులు ఆకాశ శరీరాన్ని జనోలోకం అన్నారు. సృష్టి కోసం వికసించిన ఈ మాతృత్వ ధర్మం వల్లనే **చిత్, సత్** లనేవి జననీ జనకులయ్యాయి. ఇదే విషయాన్ని కవి తన ఉమాసహస్ర కావ్యంలో చెప్పారు. మహర్లోకమనే మహిమనే లోకాలోక మంటారు. ఆ మహిమ జనోలోకంనించే వెలువడుతుంది. అందువల్ల వికసించిన జనయిత్రృత్వ ధర్మం మహత్తు కలిగిన జనోలోకమై, మహోజ్జనోలోకంగా కవి ఉమా సహస్రంలో చెప్పారు).

10. బహుళ తారకా గణైర్యుతం
కిమపి ఖం తవేహ వర్ష్మణి ।
శచి విభజ్య భాషయైకయా
సుకవయో మహూజగద్విదుః ॥

11. ఇద మినేందు భూమిలక్షణై
ర్దినకరై స్సుధాకరై గ్రహైః ।
బహుజగద్భిరన్వితం మహో
జగ దశేషధాత్రి నైకకం ॥

ఓ దేవీ! కొందరు కవులు అనేక తారకా గణాలతో కూడిన ఒకానొక ఆకాశాన్ని నీ ఆకాశ శరీరంనుంచి వేరుచేసి, దానినే మహర్లోకంగా చెప్పారు. ఐతే, సూర్య, చంద్ర, భూ లక్షణాలతో (తేజస్సు, నీరు, అన్నమాణు భూతత్వాలతో) కూడిన సూర్యుడు, చంద్రుడు, గ్రహాలుగా ఉండే పలు జగత్తులతో నిండిన ఈ మహర్లోకమంతా ఒక్కటి కాదు (అంటే ఈ సువర్లోక, భువర్లోక, భూలోకాలు కలిసే మహర్లోకమని గ్రహించాలి).

12. అజరమవ్యయం సనాతనం
మునిజనైక వేద్య వైభవం ।
న భవతీం వినా తపో జగ
త్పృథ గ శేషనాథ నాయికే ॥

13. సకల దృశ్య మూలకారణం
తవచ సంశ్రయో నిరాశ్రయః ।
జనని సత్యలోకసంజ్ఞ యా
పరమ పూరుషోఽభిధీయతే ॥

ఓ తల్లీ! ముసలితనమూ, నాశనమూ లేకుండా సనాతనమై మునిజనులు తెలుసుకునే వైభవంగల తపోలోకం అనేది నీకంటే వేరుగా ఏమీ ఉండదు. ఈ ప్రపంచానికే మూలకారణమై, నీకాధారమై, వేరే దేనినీ ఆశ్రయించకుండా ఉండేది ఒక పరమ పురుష వస్తువు. అదే సత్యలోకపు సూచనల (సంజ్ఞల) వల్ల తెలుస్తూంది.

14. అయిపురాతనర్షి భాషయా
గగనమేతదాప ఈరితాః ।
అథ యదాసు వీర్యముజ్జితం
భగవత స్త్వమేవ తత్పరే ॥

15. శచివిరాడ్భువత్య భాషత
శ్రుతి రపీదమేవ నామ తే ।
వితత విశ్వ విగ్రహాత్మని
ప్రథిత మేతదాహ్వాయం వరం ॥

16. ఉపనిషద్గిరా విరాడ్వధూః
పురుష ఏషభాషయాన్యయా ।
ఉభయథాపి సాధు తత్పదం
భవతి తేన సంశయాస్పదం ॥

17. న వనితా నవా పుమాన్భవే
జ్జగతి యోంతరశ్శరీరిణాం ।
తనుషు లింగభేద దర్శనా
తనుమతశ్చ లింగముచ్యతే ॥

ఓ తల్లీ! ప్రాచీనకాలపు ఋషులు ఈ గగనాన్ని తమ భాషలో ఉదకం (కం అంటే ఆకాశం, ఉదకం, నీరు) అన్నారు. ఆ తరవాత భగవంతుని వీర్యమనేది ఆ నీటిలో చేరిందనీ, దాన్ని భరించింది నీవేననీ అంటారు. ఈ వీర్యయుక్తమైన జనోలోకమనే పేరునే విరాట్ అని శ్రుతి చెబుతోంది. సువిశాలమైన ఈ విశ్వ స్వరూపిణియైన శరీరానికి (అంటే గర్భంలో విశ్వాన్ని కలిగిన నీకు) విరాట్ అనేది ప్రసిద్ధమైన పేరు. ఉపనిషత్తుల భాషలో చెప్పిన ఈ **విరాట్** వధూ స్వరూపాన్ని ఇతర భాషలు (శ్రుతి భాషల్లో కాకుండా, పౌరాణిక కావ్యాల భాషల్లో) పురుష రూపంగా వర్ణించాయి. ఇలా పురుష, స్త్రీ లింగాలలో రెండు విధాలైన విరాట్ అనే పదం సాధువు అవడంవల్ల సంశయాన్ని కలిగిస్తూఉంది. ఎలాగంటే, లోకంలో శరీరంలో ఉండే వీర్య వస్తువుకు లింగ భేదం లేదు. స్థూలశరీరానికి ఉండే లింగ భేదంవల్ల శరీర మతాన్ని అనుసరించి అంతరాత్మకు (విరాట్‌కు) లింగాన్ని ఆపాదించా రంతే.

*18. అఖిలనాథ వీర్యధారణా*
*ద్గగనభూమి రంగనామతా ।*
*సకలలోక బీజ భృత్త్వతో*
*గగనదేశ ఏష పూరుషః ॥*

*19. స్ఫుట విభక్తగాత్రలక్ష్మణాం*
*నియతవాదినా మదర్శనాత్ ।*
*న పురుషో వియద్యథా వయం*
*న వనితా వియద్యథైవ నః ॥*

*20. అభివిమానతోఽ ధవా శచీ*
*విబుధరాజయో ర్వ్యిలక్షణాత్ ।*
*వరవిలాసినీ వియత్తను*
*స్సదవికార ముత్తమః పుమాన్ ॥*

ఓ తల్లీ! సర్వేశ్వరుని వీర్యాన్ని ధరించినందువల్ల ఆకాశాన్ని స్త్రీ అన్నారు. సకలలోక కారణబీజాన్ని ధరించి ఉండటం వల్ల అదే ఆకాశాన్ని పురుషుడని అన్నారు. కేవలం కంటికి కనిపించేదాన్నే నమ్మే నియత వాదినులు మాత్రం వారికి ప్రస్ఫుటమైన శరీర లక్షణాలు కనపడలేదు కాబట్టి ఆకాశం పురుషుడూ కాదు, స్త్రీ కూడా కాదని అన్నారు. అలాకాకపోయినా, అన్నిటా వ్యాపించి ఉన్న ఆ అవికార సద్వస్తువు భేదంలేని

శచీంద్రులను బోలి శ్రేష్ఠమైన శచీదేవి స్త్రీ లక్షణాన్నీ, ఆకాశశరీరాన్ని పొందిన పురుష (ఇంద్ర) లక్షణాన్ని కలిగి ఉందని చెప్పవచ్చు.

*21.* *హృదయమల్పమ ప్యదో జన*
*న్యనవమం విశాల పుష్కరాత్ ।*
*విమల దేహ దుర్గమధ్యగం*
*సకలరాజ్ఞి సౌధమస్తు తే ॥*

ఓ అంబా, నిర్మల దేహమనే దుర్గానికి మధ్యలో ఉండి, విశాల ఆకాశానికన్నా చిన్నదైనా, శ్రేష్ఠతలో ఏమాత్రం తీసిపోని ఈ నాహృదయం నీకు సౌధమగుగాక! (ఆకాశంలోని సత్‌రూప లక్షణమైన వీర్యమే హృదయమైనట్లు అనిపిస్తుందిక్కడ. అందువల్ల **సత్** అనేదే ఆకాశానికి వీర్య లక్షణమైందని భావించాలి. హృదయమే ఆకాశాన్ని పొందిన సత్ చిత్ లక్షణం).

*22.* *వికసితం నిజాంశు వీచిభి*
*ర్హృదయ మాలయం విశాంబ మే ।*
*వికచ ముష్ణభానుభానుభి*
*ర్దశశత చ్ఛదం యథా రమా ॥*

ఓ తల్లీ! వేడి కిరణాలున్న సూర్యునివల్ల వికసించిన వెయ్యి దళాలున్న ఆ పద్మంలోకి లక్ష్మీదేవి ప్రవేశించిన రీతిలో నీవు నీ కిరణాలవల్ల వికసించిన నా హృదయమనే ఆలయాన్ని ప్రవేశించు (హృదయం అనేది సూర్యునికి పోలిక. ఆ ఆలయానికి ఆవరణం సహస్రార కమలం. పద్మమనేది లక్ష్మీనివాస స్థానం. అందువల్ల లక్ష్మీదేవిని ఆహ్వానించడమైంది).

*23.* *హృదయ సాధు సౌధశాయినీం*
*నయన రమ్య హర్మ్య చారిణీం ।*
*భువనరాజచిత్త మోహినీం*
*నమత తాం పరాం విలాసినీం ॥*

హృదయమనే యోగ్యమైన భవనంలో శయనించేదీ, కళ్లనే మేడ భాగాలలో సంచరించేదీ, ఇంద్రుడి చిత్తాన్ని సైతం మోహింపజేసేదీ అయిన ఆ పరాదేవికి నమస్కరించాలి (అపుడు మదిలోని ప్రజ్ఞే కళ్లలో దృశ్యంగా ఉంటుందని భావం).

24. తవ పరే మరీచివీచయ
స్తనుగుహాం ప్రవిశ్య విశ్రుతే ।
భరతభూమి రక్షణోద్యతం
గణపతిం క్రియాను రుజ్జ్వలం ॥

ఓ ఇంద్రాణీదేవీ! నీ కాంతి తరంగాలు శరీరగుహగా ఉండే హృదయంలోకి జొచ్చుకొని వచ్చి ఈ భరతభూమిని రక్షించడానికి పూనుకున్న ఈ గణపతిని ప్రజ్వలింప జేయుగాక!

25. గణపతేర్మనోరమా ఇమా
స్సుగుణవేదినాం మనోరమాః ।
అవహితా శృణోతు సాదరం
సుర మహీపతే ర్మనోరమా ॥

మంచి గుణాలను తెలుసుకునే పండితులను సంతోషపెట్టే గణపతి విరచితమైన ఈ మనోరమా వృత్తాలను ఇంద్రాణీదేవి జాగ్రత్తగా, ప్రేమగా వినుగాక!

పాంక్తం శతకంలోని రెండవదైన మనోరమా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 5.3. మణిరాగ స్తబకం

1. జ్యోతిషాం నృపతి స్సకలానాం
శాంతిమేవ సదాభిదధానః ।
నిర్మలో హరతా త్సురరాజ్ఞీ
మందహాసలవో మమపాపం ॥

కాంతులన్నిటికీ ప్రభువై, సదా శాంతిని చేకూరుస్తూ, నిర్మలంగా ఉండే ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు నా పాపాలను హరించుగాక.

2. దుష్టలోక దవిష్ఠపదాబ్జా
శిష్టశోక నివారణదక్షా ।
నాకలోక మహీపతి రామా
భారతస్య ధునోత్వ సుఖాని ॥

దుష్టుల సమూహాలకు అందనిదీ, శిష్టలోకాన్ని నివారించే శక్తి కలదీ, స్వర్గానికి రాణీ అయిన ఆ ఇంద్రాణీదేవి ఈ భారతదేశపు కష్టాలను తొలగించుగాక!

3. దేవమౌళిమణీ కిరణేభ్యో
విక్రమం స్వయమేవ దదనా ।
దేవరాజ వధూపద పద్మ
శ్రీస్తనోతు సదా మమ భద్రం ॥

దేవతల కిరీటాల్లో ఉండే మణుల కాంతులకు తాను స్వయంగా మరింత కాంతిని చేకూర్చే ఇంద్రాణీదేవి పాదపద్మాలశోభ సదా నాకు క్షేమాన్ని ఇచ్చుగాక!

4. దేవి తే వదనం బహు కాంతం
సాక్షి తత్ర పురందర చేతః ।
అంబ తే చరణావతికాంతా
వత్ర సాక్షి మనస్స్మరతాం నః ॥

అమ్మా! నీ ముఖం ఎంతో కాంతితో కూడి ఉంది. దానికి ఇంద్రుడి మనస్సే సాక్షి. దేవీ, నీ చరణాలు అతి కాంతివంతంగా ఉన్నాయి. వాటిని స్మరించే మా మనస్సే దీనికి సాక్షి!

5. భాసురం సురసహంతి వంద్యం
సుందరం హరి లోచన హారి ।
పావనం నతపాప విధారి
స్వర్గరాజ్ఞి పదం తవసేవే ॥

అమ్మా! దేవతలు నమస్కరిస్తారు కాబట్టి నీ పాదాలు ప్రకాశవంతంగా ఉన్నాయి. ఇంద్రుడి దృష్టిని ఆకర్షిస్తుంది కాబట్టి అవి సుందరంగా ఉన్నాయి. నీ భక్తుల పాపాలను తొలగిస్తాయి కాబట్టి పావనమైనవి. అటువంటి నీ పాదాలను నేను సేవిస్తున్నాను.

6. జంఘికే జయతస్తవమాతః
సంఘ ఏవరుచాం యదధీనః ।
వాసవస్య దృశాంచ సహస్రం
యద్విలోకన లోభవినమ్రం ॥

7. సక్థినీ తవ వాసవకాంతే
రామణీయక సార నిశాంతే ।
వందతే వినయే సమయేయే
వందితస్తవ పావని వాణీ ॥

8. ఇంద్రనారి కటిస్తవ పృథ్వీ
మండల స్యతులా మహనీయే ।
మధ్యమం నభసః ప్రతిమానం
భోగినాం భువనస్యచ నాభిః ॥

9. ధీరతాం కురుతే విగతాసుం
యా సుపర్వ వతేర్ని శితాగ్రా ।
సా తవాంబ మనోభవశస్త్రీ
రోమరాజిరఘం మమహంతు ॥

10. రోమరాజి భుజంగశిశుస్తే
దేవి దేవపతేర్హృదయస్య ।
దంశనేన కరోత్యయి మోహం
జీవితాయ చిరాయ విచిత్రం ॥

ఓ దేవీ! నీ పిక్కలలోనే కాంతుల సమూహమంతా ఘనీభవించడంవల్ల అవి బాగా ప్రకాశిస్తూన్నాయి. లేకుంటే ఇంద్రుడు వాటినే చూడాలని ఎందుకు (కక్కుర్తి పడుతూ) ఆరాటపడతాడూ? నీ తొడలు సైతం సౌందర్యసారపు నిలయాలే. వినయ మైన సమయంలో ఇతర భక్తుల్లాగా ఆ సరస్వతీదేవీ కూడా వాటికి నమస్కరిస్తూ ఉంది. ఇక నీ కటి పృథ్వీమండలంలాగా ఉంది. నడుము ఆకాశంలాగా ఉంది. నాభి పాతాళంలా ఉంది. నల్లని జాతిసర్పంలాగా ఉండే నీ వాలు జడ, ఆ దేవేంద్రుడి ధైర్యాన్ని కూడా హరించి వేస్తుంది. అదే మన్మథునికి బాణంగా కూడా ఉంది. అటువంటి ఆ రోమరాజి (రాజి అంటే ఒక జాతిసర్పం. రోమరాజి అంటే, రోమాలు నల్లగా ఉంటాయి గనక నల్లని వాలుజడనే పాముగా వర్ణించారు కవి) నా పాపాలను హరించు గాక! విచిత్రంగా ఈ రోమరాజి ఇంద్రుడి హృదయానికి తగిలి చిరాయువుగా ఉండాలని తపించే అతనికి మోహాన్ని కలిగిస్తూ ఉంది.

*11.* *పూర్ణ హేమ ఘటా వివశక్రా*
*వాహితాం దధతావయి శక్తిం ।*
*విశ్వపోషణ కర్మణి దక్షా*
*వంబదుగ్ధ ధరౌ జయతస్తే ॥*

*12.* *లోకమాత దురోరుహ పూర్ణ*
*స్వర్ణకుంభగతా తవ శక్తిః ।*
*లోకపాలన కర్మణి వీర్యం*
*దేవి వజ్రధరస్య బిభర్తి ॥*

*13.* *అక్షయామృత పూర్ణఘటౌ తౌ*
*శక్రపత్ని కుచౌ తవ పీత్వా ।*
*లోక బాధక భీకర రక్షో*
*ధూననే ప్రబభూవ జయంతః ॥*

ఓ తల్లీ, నిండుగా నీరున్న బంగారు కుండల్లా ఉండి దేవేంద్రుడు ఉంచిన శక్తిని ధరించే నీ కుచాలు విశ్వాన్ని పోషించే పనిలో సమర్థంగా ఉండి ప్రకాశిస్తూ న్నాయి. అవి నీశక్తిని కలిగి ఇంద్రుడికి పాలించే శక్తినిస్తున్నాయి. అక్షయమైన, అమృతమయమైన ఆ పూర్ణ ఘటాలనే కుచాలనుండి పాలను తాగి జయంతుడు లోక కంటకులైన భీకర రాక్షసులను సంహరించడంలో సమర్థుడయ్యాడు.

14. హస్తయోస్తవ మార్దవ మింద్రో
భాషతాం సుషమామపి దేవః ।
దాతృతా మనయో ర్మని వర్గో
వర్ణయత్యజరే పటుతాంచ ॥

15. పుష్పమాల్య మృదోరపి బాహో
శ్శక్తి రుగ్రతమా శరనాశే ।
దృశ్య తే జగతా మధిపే తే
భాషతాం తవకస్తను తత్త్వం ॥

ఓ దేవీ! నీ చేతుల సున్నితత్వాన్ని గురించీ, వాటి కాంతుల గురించీ ఆ ఇంద్రుడే చెప్పగలగాలి. మునులు కేవలం ఆ చేతులకుండే దాతృత్యగుణాలను మాత్రం వర్ణించగలిగారు. ఇక పూలమాలల్లా ఉండే నీ మృదువైన బాహువుల శక్తి రాక్షస సంహారంలో బాగా ఉగ్రంగా కనిపించింది. నీ శరీరతత్వాన్ని ఎవరూ సరిగ్గా అంచనా వేయలేరు.

16. కంబుకంఠి తవేశ్వరి కంఠ
స్తారహార వితాన విరాజీ ।
దేవరాడ్భుజ లోచన పథ్యో
దేవి మే భణతా ద్బహుభద్రం ॥

17. ఆననస్య గభస్తి నిధేస్తే
రామణీయక మద్భుత మీష్టే ।
అప్యమర్త్య నుతాఖిల సిద్ధే
ర్వాసవస్య వశీకరణాయ ॥

ఓ దేవీ! ముత్యాల హారంతో ప్రకాశిస్తూ, ఇంద్రుడి కళ్లకు ఇంపైన నీ కంఠం నాకు జాగ్రత్తలను బాగా చెప్పుగాక! దేవతలంతా పొగిడే, సర్వసిద్ధులూ కలిగిన ఇంద్రుడినే వశంచేసుకునే శక్తి కాంతులన్నిటికీ నిధియైన నీ ముఖవర్చస్సుకు ఉంది.

18. నప్రసన్న మలం రవిబింబం
చంద్రబింబ మతీవ నభాతి ।
సుప్రసన్న మహోజ్జ్వల మాస్యం
కేన పావని తే తులయామః ॥

ఓ తల్లీ! సూర్యబింబంలో ఎక్కువ ప్రసన్నత కనిపించదు. చంద్రుడిలో ఎక్కువగా (ఉజ్జ్వలంగా) ప్రకాశించే గుణం లేదు. సుప్రసన్నంగా ఉండే నీ మోమును ఇక దేనితో పోల్చగలం? (రవిచంద్రులలో లేని గుణాలు సైతం నీ ముఖంలో ఉన్నాయి. అందువల్ల నిరుపమానమైన నీ ముఖాన్ని దేనితోనూ పోల్చలేం.)

*19. లోచనే తవలోక సవిత్రి*
*జ్యోతిషశ్చ శవసశ్చ నిధానే ।*
*వక్త్ర మబ్జసమే నను లజ్జే*
*ధోరణీ మనుసృత్య కవీనాం ॥*

*20. ఆయతోజ్జ్వల పక్ష్మల నేత్రా*
*చంపక ప్రసవోపమ నాసా ।*
*రత్నదర్పణ రమ్య కపోలా*
*శ్రీలిపి ద్యుతి సుందరకర్ణా ॥*

*21. అష్టమీ శశి భాసుర ఫాలా*
*విష్టపత్రయ చాలక లీలా ।*
*స్మేర చారుముఖీ సుర భర్తుః*
*ప్రేయసీ విదధాతు శివంమే ॥*

అమ్మా! ఇంద్రాణీదేవీ! ప్రకాశవంతమైన నీవిశాలమైన కళ్లు, సంపెంగ పువ్వువంటి నీ ముక్కు, రత్నఖచితమైన అద్దాల్లాటి నీచెక్కిళ్లు, శ్రీకారాన్ని పోలిన నీ చెవులు, అష్టమినాటి చంద్రుడిలాగా కనిపిస్తున్న నీ ఫాలభాగం, ముల్లోకాలనీ కదిలించేయగల విలాసం, నవ్వుతో మరింత అందంగా ఉన్న నీ ముఖం నాకు శుభాల నిచ్చుగాక!

*22. మందహాసలవేషు వలక్షా*
*మేచకా చికుర ప్రకరేషు ।*
*శోణతా మధరే దధతీ సా*
*రక్షతు ప్రకృతి స్త్రిగుణా నః ॥*

అమ్మా, నీ చిరునవ్వులోని తెల్లనిరంగు, తల వెంట్రుకల్లోని నలుపురంగు, పెదాలపై ఉన్న ఎర్రనిరంగు - ఈ మూడు గుణాలూ (నిజానికి ఇవి సత్వ, రజో, తమో గుణాలకు ప్రతీకలు) కలిగిందే ప్రకృతి. అట్టి ప్రకృతి మమ్ములను రక్షించుగాక

(అంటే ప్రకృతి కూడా నీవే, అని కవి చెప్పకనే చెబుతున్నాడు).

*23. సర్వలోక వధూజనమధ్యే*
*యాం శ్రుతి స్సుభగామభిధత్తే ।*
*యాదివో జగతో రుచిసార*
*స్తాం నమామి పురందరరామామ్ ॥*

లోకాలన్నిటిలోనూ ఉన్న నారీమణులందరిలో ఏదేవినైతే శుభప్రద అని వేదాలు చెబుతున్నాయో, ఈ జగత్తు, ఈ ఆకాశం – ఈ రెండిటిలోనూ ఏదేవి కాంతి సారం గా ఉందో, అటువంటి ఇంద్రాణీదేవికి నేను నమస్కరిస్తున్నాను.

*24. స్వర్గభూపతి లోచనభాగ్య*
*శ్రీశ్శరీరవతీ జలజాక్షీ ।*
*భారతస్య కరోతు సమర్థం*
*రక్షణే నరసింహ తనూజమ్ ॥*

శరీరాన్ని ధరించిన ఇంద్రుడి భార్య, భాగ్యలక్ష్మి, పద్మాల్లాంటి కళ్లున్న ఆ ఇంద్రాణీదేవి భారతదేశ రక్షణ కోసం ఈ నరసింహ పుత్రునికి తగిన సామర్థ్యాన్ని ఇచ్చుగాక!

*25. లోకమాతురిమే రమణీయాః*
*పాక శాసన చిత్తరమణ్యాః ।*
*అర్పితాః పదయోర్విజయం తాం*
*సత్కవేః కృతయో మణిరాగాః ॥*

గణపతిముని రమణీయంగా వ్రాసి ఇంద్రాణీదేవి పాదాల వద్ద సమర్పించిన ఈ మణిరాగవృత్తాలు బాగా ప్రకాశించుగాక!

పాంక్తం శతకంలోని మూడవదైన మణిరాగ స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



# 5.4. మేఘవితాన స్తబకం

1. అమరక్షితి పాలక చేతో
మదనం సదనం శుచితాయాః ।
స్మిత మాదివధూ వదనోత్థం
హరతాదఖిలం కలుషం మే ॥

ఇంద్రుడి మనస్సును గర్వింపజేసేదీ, శుభ్రతకు స్థానమైనదీ అయిన ఆ ఇంద్రాణీదేవి ముఖాన్నుంచి వెలువడే చిరునవ్వు నా సకల పాపాలను హరించు గాక!

2. సుతరామధనామతిఖిన్నా
మధునా బహుళం విలపంతీం ।
పరిపాతు జగత్త్రయనేత్రీ
భరతక్షితి మింద్ర పురంధ్రీ ॥

కడుబీదరాలై, దుఃఖిస్తూ ఇపుడు చాలా రోదిస్తూన్న ఈ భరతదేశాన్ని త్రిలోక పాలకురాలైన ఆ ఇంద్రాణీదేవి రక్షించు గాక!

3. స్థలమే తదమర్త్య నృపాల
ప్రమదే తవ మేఘ వితానం ।
అయి యత్రపరిస్ఫురసీశే
తటిదుజ్జ్వల వేషధరా త్వం ॥

ఓ తల్లీ! మెరుపు అనే ఉజ్జ్వలమైన వేషంతో నీవు ఎక్కడైతే ప్రకాశిస్తావో, ఆ మేఘ సమూహమే నీకు స్థలమై ఉంది (ఈ స్తబకానికి పేరు కూడా మేఘవితానమనే పేరు పెట్టడం కవి చమత్కారం).

4. తటితా తవ భౌతిక తన్వా
జితమంబుధరే విలసంత్యా ।
ఉపమా భువి యాలలితానాం
యువచిత్త హృతాం వనితానాం ॥

5. స్ఫురితం తవలోచన హారి
స్తనితం తవధీర గభీరం ।
రమణీయతయా మిళితా తే
శచిభీకరతా చపలాయాః ॥

భూలోకంలో లలితంగా ఉంటూ యువకుల చిత్తాన్ని దోచే వనితలను పోలి మేఘంలో విలసిల్లే నీ భౌతిక దేహం మెరుపురూపంలో విజయవంతంగా ప్రకాశిస్తూ ఉంది. ఓ శచీదేవీ, అలా కనిపించే నీ మెరుపు దృష్టిని హరిస్తూంటే, నీ గర్జన (ఉరుము) ఎంతో గంభీరంగా ఉంది. మెరుపు రూపంలో ఉండే నీ భయంకరత్వము ఎంతో రమణీయంగా ఉంది.

6. చపలే శచి విస్ఫురసీంద్రం
ఘనజాలపతిం మదయంతీ ।
దితిజాత మవగ్రహ సంజ్ఞం
జనదుఃఖకరం దమయంతీ ॥

7. ప్రభు మభ్రపతిం రమయంతీ
దురితం నమతాం శమయంతీ ।
హరితాం తిమిరాణి హరంతీ
పవమాన పథే విలసంతీ ॥

8. అలఘుస్తనితం విదధానా
బలముగ్రతమంచ దధానా ।
హృదయావరకం మమమాయా
పటలం తటిదాశు ధునోతు ॥

అమ్మా! మేఘాలకు అధిపతియైన ఇంద్రుడిని విజృంభించేలా చేసే నీవు, జనాలకు దుఃఖాన్ని కలిగించిన **అవగ్రహ**మనే రాక్షసుని సంహరించి వెలుగొందు తున్నావు. మేఘాధిపతిని రమింపజేస్తూ, నమస్కరించేవారి పాపాన్ని హరింపజేస్తూ, దిక్కులలోని చీకటిని హరిస్తూ ఆకాశంలో నీవు ప్రకాశిస్తూన్నావు. నీ అధిక గర్జనతో బాటు ఉగ్రమైన బలాన్ని ధరించే మెరుపు, నా హృదయాన్ని ఆక్రమించిన **మాయ** అనే చీకటి పొరను వెంటనే నశింపజేయుగాక!

9. సురపార్థివ జీవిత నాథే
నిఖిలే గగనే ప్రవహంత్యాః ।
తటితస్తవ వీచిషు కాచి
చ్చపలా లసతీహ పయోదే ॥

10. విబుధ ప్రణుతే ధనికానాం
భవనేషు భవంత్యయి దీపాః ।
పటుయంత్రబలా దుదితానాం
తవదేవి లవాః కిరణానాం ॥

11. వ్యజనానిచ చాలయసి త్వం
బత సర్వ జగన్ నృప జాయే ।
విబుధోఽభి దధాత్వథవా కో
మహతాం చరితస్య రహస్యం ॥

అమ్మా! మొత్తం ఆకాశంలో ప్రవహించే విద్యుత్ తరంగాలలో ఒకటైన మెరుపు ఈ మేఘాలలో ప్రకాశిస్తూ ఉంది (ఆకాశంమంతటా వ్యక్తం కాని విద్యుత్ తరంగాల్లో ఒక్క మెరుపుకే ఎంతో శక్తి ఉంటే, ఇక ఆ విద్యుత్ పూర్తిగా మెరుపుల్లా కనిపిస్తే? మానవులు తట్టుకోగలరా?).

ఇంకో విషయం. ధనికుల ఇళ్లలోని విద్యుత్తు దీపాలు పటుయంత్ర బలంవల్ల పుట్టిన కిరణాలతో వెలుగుతున్నాయి. అది నీ కాంతిలో అతి తక్కువ కాంతియే కానీ వేరే కాదు. ఐతే, నీవు (దాంతో) పంకాలను కూడా తిరిగేలా చేస్తున్నావు. ఏమి ఆశ్చర్యమో! గొప్పవారి చరిత్రను ఏ పండితుడైనా మాత్రం ఏం జెప్పగలడూ?

12. ఇహ చాలిత ఈడ్య మనీషై
రయి యంత్ర విశేష విదిజ్ఞైః ।
బహుళాద్భుత కార్యకలాప
స్తటితస్తవ మాతరధీనః ॥

అమ్మా! ఎంతో కొనియాడదగ్గ బుద్ధితో యంత్రవిశేషాలను ఎరిగినవారు అద్భుతమైన పనులను చేస్తున్నా, అవన్నీ విద్యుచ్ఛక్తి అధీనంలోనే ఉంటాయి కదా!

13. అచర స్తరుగుల్మలతాదిః
సకలశ్చరో భువి జంతుః ।
అనితి ప్రమదే సురభర్తు
స్తటితస్తవ దేవి బలేన ॥

14. మనుతే నిఖిలోఽపి భవత్యా
మనుజోఽనితి వక్తి శ్రుణోతి ।
అవలోకయతేచ భణామః
కిముతే జగదంబ విభూతిం ॥

అమ్మా! కదల్లేని చెట్లూ చేమలూ కదిలే సకల జంతుజాలమూ కూడా ఈ భూమ్మీద మెరుపురూపాన్ని కలిగిన దేవత (తటిద్రూపిణి) వైన నీ బలం వల్లనే జీవిస్తున్నాయి. నీ సాయం వల్లనే మానవులు ఆలోచించడం, కదలడం, పలకడం, వినడం, చూడటం – అన్నీ చేస్తున్నారు. నీ ఐశ్వర్యాన్ని మేమేమని వర్ణించగలం?

15. అతి సూక్ష్మ పవిత్ర సుషుమ్నా
పథత స్తనుషు ప్రయతానాం ।
కులకుండ కృశాను శిఖాత్వం
జ్వలసి త్రిదశాలయ నాథే ॥

16. ఇతరో న సురక్షితి పాలా
త్కులకుండ గతో జ్వలనోయం ।
ఇతరేంద్ర విలాసిని నత్వ
త్కులకుండ కృశాను శిఖేయం ॥

17. కులకుండ కృశాను శిఖాయాః
కిరణైః శిరసి స్థిత ఏషః ।
ద్రవతీందు రసారత మేత
ద్వపురాత్మమయం విదధానః ॥

ఓ తల్లీ! అతి సూక్ష్మంగా ఉండే పవిత్రమైన సుషుమ్నా నాడీమార్గంలో కుల కుండాగ్ని జ్వాలవై, పవిత్రమైన దేహాలలో మెరుపురూపంలో నీవు ప్రకాశిస్తున్నావు. కులకుండాన్ని పొందిన ఈ అగ్నీ, ఇంద్రుడూ వేరే వేరే కాదు. ఆ కులకుండంలోని అగ్నిజ్వాలా నీవూ వేరే వేరే కాదు. కులకుండాగ్ని జ్వాలనుంచి వెలువడే కిరణాల

వల్ల శిరస్సులో ఉంటూ, శరీరాన్ని ఆత్మమయం చేసే చంద్రుడు నిరంతరం చల్లదనాన్ని ఇస్తూన్నాడు (తన కిరణాలతో చంద్రుని ద్రవింపజేసి ఆ ద్రవంతో శిరాన్ని ఆత్మమయం చేస్తున్నది వేరే ఏదో కాదు. ఆ కులకుండాగ్ని జ్వాలయే).

*18. మదకృద్బహుళామృత ధారా*
*పరిపూతమిదం మమ కాయం ।*
*విదధాసి భజన్మనుజాప్తే*
*కులకుండ ధనంజయ దీప్తే ॥*

*19. శిరసీ హసతః సితభానో*
*రమృతేన వపుర్మద మేతి ।*
*హృది భాత ఇనస్యచభాసా*
*మతిమేతు పరాం శచి చేతః ॥*

ఓ తల్లీ! నా ఈ శరీరాన్ని మదింప జేసే అనేక అమృతధారలతో నీవు నాకు పవిత్రతను చేకూరుస్తున్నావు. ఈ శిరశ్చంద్రుని అమృత స్రావంవల్ల ఈ శరీరం మదాన్ని పొందుతూంటే, హృదయంలో ప్రకాశించే సూర్యుని కాంతి వల్ల చిత్తం జ్ఞానాన్ని పొందుతూ ఉంది.

*20. మమయోగమదేన నతృప్తి*
*ర్నిజదేశదశా వ్యథితస్య ।*
*అవగంతు ముపాయ మమోఘం*
*శచి భాసయ మే హృదిభానుం ॥*

*21. విదితః ప్రమదస్య విధాతుః*
*శశినో జనయిత్రి విలాసః ।*
*అహ ముత్సుక ఈశ్వరి భానో*
*ర్విభవస్యచ వేత్తు మియత్తాం ॥*

ఓ శచీదేవీ! నా ఈ భారతదేశపు గతిని చూచి ఎంతో దుఃఖిస్తున్న నాకు యోగమదంవల్ల తృప్తి కలగదు. అమోఘమైన ఉపాయాన్ని పొందడానికి నా హృదయంలో సూర్యుని ప్రకాశింపజేయి. ఆనందాన్ని కలిగించే చంద్రకళా విలాసం నాకు తెలిసింది. సూర్యుని వైభవాన్ని కూడా తెలుసుకోవడానికి నేనెంతో ఉత్సాహ పడుతున్నాను.

22. వరుణస్య దిశి ప్రవహంతీ
మదమంబ కరోషి మహాంతం ।
దిశి వజ్రభృతః ప్రవహంతీ
కురుబుద్ధి మకుంఠిత సిద్ధిం ॥

పశ్చిమ దిక్కులో (అంటే, వెనక వైపున్న వెన్నెముకలోని సుషుమ్నలో) ప్రవహిస్తూ మదాన్ని ఎక్కువగా కలిగిస్తూ ఉన్నావు. నీవు కొంత తూర్పుదిశలోకి (అంటే, ముందువైపున్న హృదయంలో, సూర్యుడు ప్రకాశించే వైపు అన్నమాట) ప్రవహించి నా బుద్ధికి శాశ్వతసిద్ధినివ్వు తల్లీ (ఇక్కడ పశ్చిమదిక్కు అంటే పాశ్చాత్యదేశంగానూ, తూర్పుదిక్కు అంటే మన భారతదేశంగానూ అర్థం చేసుకోవాలి).

23. అమలామధిరుహ్యా సుషుమ్నాం
ప్రవహస్యధునాంబ మదాయ ।
అమృతా మధిరుహ్యాచ కించి
త్ప్రవహేశ్వరి బుద్ధిబలాయ ॥

ఓ దేవీ! నిర్మలంగా ఉండే సుషుమ్నను అధిష్ఠించి మదం కోసం ప్రవహిస్తున్నావు. శిరస్సు నుండి ముందువైపుకు హృదయందాకా విస్తరించిన సూక్ష్మనాడియైన అమృతా నాడిని అధిష్ఠించి నాకు కొద్దిగా బుద్ధిబలాన్ని కలగజేసేందుకై ప్రవహించు తల్లీ!

24. భరతక్షితిరక్షణ కర్మ
ణ్యభిధాయ మనోజ్ఞముపాయం ।
అథదేవి విధాయచ శక్తం
కురుమా కృతినం శచి భక్తం ॥

ఓ తల్లీ! భారతభూమిని రక్షించడానికి నా మనస్సులో ఉపాయాలను కలగజేసి నీ భక్తుడనైన నన్ను శక్తిమంతునిగా చేసి కృతకృత్యుని చేయి.

25. నరసింహసుతేన కవీనాం
విభునా రచితైః కమనీయైః ।
పరితృప్యతు మేఘవితానై
ర్మరుతా మధిపస్య పురంధ్రీ ॥

నరసింహ పుత్రుడనైన, కవిశ్రేష్ఠుడైన ఈ గణపతిముని వ్రాసిన కమనీయమైన మేఘవితాన వృత్తాలు ఇంద్రాణీదేవికి తృప్తినిచ్చుగాక!

పాంక్తం శతకంలోని నాలుగవదైన మేఘవితాన స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

దీనితో ఇంద్రాణీ సప్తశతిలోని ఐదవదైన పాంక్తం శతకం
పూర్తి అయింది.



# 6. త్రైష్టుభం శతకం

త్రైష్టుభం శతకం అనేది ఇంద్రాణీ సప్తశతిలోని ఆరవ శతకం. ఉపజాతి, రథోద్ధతా, మౌక్తికమాలా, సుముఖీ అనే 4 స్తబకాలు కలిసి త్రైష్టుభం అనే శతకం అవుతుంది. ఈ శతకంలో తొలి స్తబకం పేరు ఉపజాతి స్తబకం. ఇందులో ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వునే వర్ణిస్తూ, ఆ చిరునవ్వు అటు మునులకు జ్ఞానాన్నీ, ఇటు ఇంద్రుడికి రాగాన్నీ ఇస్తూ, చీకట్లనూ పోగొడ్తుందని అంటూ, అలాంటి ఇంద్రాణీదేవి చిరునవ్వు ప్రకాశించుగాక! అంటూ కవి తన శతకాన్ని ఆరంభిస్తాడు.

## 6.1. ఉపజాతి స్తబకం

*1.* *మందోఽపి బోధం విదధ న్మునీనాం*
*స్వచ్ఛోఽపి రాగం త్రిదశేశ్వరస్య ।*
*అల్పోఽపి ధున్వన్ హరితాం తమాంసి*
*స్మితాంకురో భాతు జయంతమాతుః ॥*

నీ చిరునవ్వు అటు మునులకు జ్ఞానాన్నీ, ఇటు ఇంద్రుడికి రాగాన్నీ ఇస్తుంది. అంతేకాదు. చీకట్లనూ పోగొడ్తుంది. అటువంటి ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు ప్రకాశించుగాక!

*2.* *అశేష పాపౌఘ నివారణాయ*
*భాగ్యస్య పాకాయచ దేవరాజ్ఞీ ।*
*శోకాకులాం భారతభూమిమేతాం*
*లోకస్యమాతా హృదయే కరోతు ॥*

సకల పాపనివారణ కోసం, భాగ్యాన్ని అభివృద్ధి చేసుకోవడం కోసం శోకంతో నిండి ఉన్న భారత భూమిని ఇంద్రాణీదేవి తన మనస్సులో ఉంచుకొనుగాక!

*3.* *ధర్మద్విషా మింద్రనిరాదరాణాం*
*సంహారకర్మణ్యతి జాగరూకాం ।*
*దేవీంపరా దేవపథే జ్వలంతీం*
*ప్రచండచండీం మనసా స్మరామః ॥*

ధర్మానికి శత్రువులై ఇంద్రుడిని నిరాదరించే వారిని సంహరించడంలో జాగ్రత్త వహించేదీ, దేవతలు తిరుగాడే మార్గంలో ప్రజ్వలించే శక్తీ అయిన ఆ ప్రచండచండిని మేము స్మరిస్తున్నాం.

4. వ్యాప్తాతటిద్వా గమనే నిగూఢా
నారీ సురేశాన మనోరమావా ।
శక్తిః సుషుమ్నా పథ చారిణీవా
ప్రచండచండీతి పదస్య భావం ॥

వ్యాపించేది అన్నా, నడకలో నిగూఢంగా ఉండే విద్యుత్ అన్నా, ఇంద్రసతి అన్నా, సుషుమ్నలో సంచరించే శక్తి అన్నా, ఆ ప్రచండచండి అనే అర్థం.

5. సమస్త లోకావని నాయికాయాః
సుపర్వమార్గేణ శరీరవత్యాః ।
మాతుర్మహోంశం మహనీయసారం
విజ్ఞానవంత స్తటితం భణంతి ॥

సమస్త లోకాలకూ నాయకురాలై, ఆకాశ శరీరిణిగా ఉన్న ఇంద్రాణీదేవి మహనీయమైన మహాంశకు సంబంధించిన సారాన్నే అందరూ **విద్యుత్** అని పిలుస్తున్నారు.

6. నిగూఢ తేజస్తను రంబికేయం
ప్రచండచండీ పరితో లసంతీ ।
అవ్యక్త శబ్దేన శరీరవత్యాః
కల్పాః కవీనాం వచనేషు భిన్నాః ॥

నిగూఢమైన తేజోంశ శరీరం కలిగిన ఈ తల్లి అంతటా ప్రకాశిస్తూ, ప్రచండ చండిక అవుతోంది. అవ్యక్తమైన శబ్దాంశతో కూడిన శరీరంగల ఆ దేవి లీలలను కవులు ఎన్నో దేవీనామాలతో పిలిచారు.

7. శబ్దం వినానైవ కదాపి తేజ
స్తేజో వినానైవ కదాపి శబ్దః ।
శక్తి ద్వయం సంతతయుక్త మేత
త్కథం స్వరూపేణ భవే ద్విభక్తః ॥

శబ్దం లేనిదే తేజస్సు లేదు. ఆ తేజస్సు లేనిదే శబ్దం లేదు. అవి రెండూ నిత్యమూ కలిసే ఉండి నీ శక్తి ద్వయంగా అవుతున్నపుడు, ఇక వాటికీ నీ స్వరూపానికీ వ్యత్యాసమెలా ఉంటుందీ?

*8. ఏకైవశక్తిః జ్వలతి ప్రకృష్టా*
*స్వరత్యపి ప్రాభవతః సమంతాత్ ।*
*క్రియా విభేదా దిహ పండితానాం*
*శక్తి ద్వయోక్తిస్తు సమర్థనీయా ॥*

శ్రేష్ఠమైన ఒకే శక్తి వెలుగుతూ, శబ్దం చేస్తూ, సర్వత్రా ప్రకాశిస్తూ, పండితులంతా చెప్పే శక్తి ద్వయం కేవలం క్రియా భేదంలో మాత్రమే సమర్థనీయంగా ఉంది (అందువల్ల కేవలం శబ్దం, వెలగడం అనే క్రియల వల్ల మాత్రమే శబ్దాన్నీ, తేజాన్నీ వేరుచేయగలం. కానీ, నిజానికి రెండూ ఒకటే).

*9. ఏకక్రియాయాశ్చ ఫలప్రభేదా*
*త్పునర్విభాగః క్రియతే బహుజ్ఞైః ।*
*కాళీంచ తారాం స్వరమగ్ర్యమాహుః*
*ప్రచండచండీం లలితాంచ తేజః ॥*

కేవలం ఒకే పనికి వేర్వేరు ఫలితాలు కలగడం వల్ల, దానిని పండితులు మళ్లీ విభజించారు. శ్రేష్ఠ స్వరాన్ని కలిగిన దానిని (ఫలభేదం వల్ల) కాళి అనీ, తార అనీ అంటున్నారు. తేజస్సును (ఫలభేదం వల్ల) చండిక అనీ, లలిత అనీ అంటున్నారు.

*10. సంపద్యతే శబ్దగతేర్హి కాలః*
*శబ్దోవరేణ్య స్త్వదభాణి కాళీ ।*
*ధ్యాతేన శబ్దేన భవంత రేద్య*
*ద్భుధా స్తతః శబ్దముశంతి తారాం ॥*

*11. యదక్షరం వేదవిదామృషీణాం*
*వేదాంతినాం యః ప్రణవో మునీనాం ।*
*గౌరీ పురాణేషు విపశ్చితాం యా*
*సా తాంత్రికాణాం వచనేన తారా ॥*

శబ్దంవచ్చే మార్గంవల్ల కాలమనేది పుడుతూ ఉంది. అటువంటి శ్రేష్ఠమైన శబ్దమే కాళి. ధ్యానం చేసిన శబ్దాలవల్ల సంసారంనుండి తరిస్తున్నారు. అందుకే

పండితులు ఆ శబ్దాన్నే తారా అన్నారు (గతి వల్లనే పరిణామం కనిపిస్తుంది. క్రియాశక్తి తెలుస్తుంది. ఆ క్రియాశక్తివల్ల వస్తురూపానికి చెందిన పూర్వ స్థితిపోయి కొత్త స్థితి వచ్చినట్లు అనిపిస్తుంది. అది కేవలం పరిణామంవల్ల వచ్చిన మార్పు. దానికి కారణ మైన శ్రేష్ఠ శబ్దసంబంధమైన క్రియాశక్తినే కాళి అన్నారు. మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో ఈ శక్తి వైభవం కనిపిస్తూ ఉంటుంది. తారా శబ్దమనేది అన్ని శబ్దాలకూ అంతర్ శబ్దంగా ఉంటుంది. అనుభవాలను ఇచ్చి వికృతులనుండి తరింపజేస్తుంది. మన ఉచ్ఛ్వాస నిశ్వాసాలను తీసుకుంటే, వాటి శబ్దమూలమే తార. అంటే, ప్రణవ స్వరూ పమే నన్నమాట. కేవలం పరిణామ క్రియా శక్తి కాళి అవుతుంది. అంటే ప్రాణమన్న మాట. మూలాధారంలో ప్రవేశించే శక్తి కాళి అయితే, అవ్యక్త ప్రణవ శబ్ద స్వరూపిణియే తార). వేదవిదులైన ఋషులు దేన్నైతే అక్షరంగానూ, వేదాంతులైన మునులు దేనినైతే ప్రణవంగానూ, పురాణపురుషులు దేనినైతే గౌరి గానూ పిలిచారో, తాంత్రికుల భాషలో ఆమే తార అయింది.

*12.* సంపద్యతే సంహృతి రోజసాయ<br>
త్ర్పచండచండీ తదుదీరి తౌజః ।<br>
సిద్ధ్యేః దశేషోఽనుభవో యదోజ<br>
స్యతో బుధా స్తాం లలితాం వదంతి ॥

*13.* ప్రచండచండీం లఘునాపదేన<br>
చండీం విదుః కేచన బుద్ధిమంతః ।<br>
ఏకే విదః శ్రేష్ఠమహోమయీాం తాం<br>
లక్ష్మీం మహత్పూర్వపదాం వదంతి ॥

*14.* అతీవ సౌమ్యం లలితేతి శబ్దం<br>
ప్రచండచండీతి పదంచ భీమం ।<br>
దేవీ దధానా సుతరాం మనోజ్ఞా<br>
ఘోరాచ నిత్యం హృదిమే విభాతు ॥

ఏ యోజస్సు వల్ల సంహారం జరుగుతూ (ప్రకాశిస్తూ) ఉందో దానిని ప్రచండ చండిక అన్నారు. ఏ ఓజస్సు వల్ల సకల అనుభవ సిద్ధి (ఆత్మానుభవమే అన్ని అను భవాలకూ మూలమైన ప్రకాశం) కలుగుతూ ఉందో దానిని పండితులు **లలిత** అన్నారు. ఈ ప్రచండ చండికనే కొందరు క్లుప్తంగా **చండిక** అన్నారు. ఆ శ్రేష్ఠమైన తేజో రూపాన్నే మరికొందరు విద్వాంసులు **మహాలక్ష్మి** అంటున్నారు. ఐతే, **లలిత**

అనే పదం చాలా నెమ్మదైంది. ప్రచండచండి అనే పదం భీకరమైంది. అత్యంత మనోహరమైన, భీకరమైన, శ్రేష్ఠమైన తేజోశక్తి అయిన ఆ ఇంద్రాణీదేవి నా హృదయంలో (మూలానుభవం ఇవ్వడానికి) ప్రకాశించు గాక!

15. ప్రచండచండీంతు శరీరభాజాం
తనూషు యోగేన విభిన్న శీర్షాం ।
శక్తిం సుషుమ్నా సరణౌ చరంతీం
తాం ఛిన్నమస్తాం మునయో వదంతి ॥

16. కపాలభేదో యది యోగవీర్యా
త్సం పద్య తే జీవతఏవ సాధోః ।
తమేవ సంతః ప్రవదంతి శీర్ష
చ్ఛేదం శరీరాంతర భాసిశక్తేః ॥

17. ఉదీర్యసే నిర్జరరాజపత్ని
త్వం ఛిన్నమస్తా యమినాం తనూషు ।
ఉజ్జృంభణే విశ్వసవిత్రి యస్యాః
కాయంభవే ద్వైద్యుతయంత్రతుల్యం ॥

శరీరధారులైన మాకు శరీరాలలో యోగసాధన వల్ల శీర్ష కపాలాలను భిన్నం కావించి, సుషుమ్న నాడిలో సంచరించే శక్తినే మునులు **ఛిన్నమస్త** అంటున్నారు. సాధువుకు యోగబలంవల్ల కపాలభేదనమైతే దానినే శరీరంలోని శక్తి శీర్షచ్ఛేదమైనట్లు చెబుతున్నారు. ఓ ఇంద్రాణీదేవీ! నీవు ఈ యోగుల (అంటే, కపాలసిద్ధి పొందినవారి) శరీరాల్లో ఛిన్నమస్తగా ఉన్నావు. ఆ శక్తి విజృంభించడంవల్ల ఈ శరీరం ఒక విద్యుత్ యంత్రంతో సమానమైంది.

18. పితు ర్నియోగాత్తనయేన కృత్తే
మస్తే జనన్యాః కిల రేణుకాయాః ।
త్వమావిశః పావని తత్కబంధం
తద్వా త్వముక్తాసి నికృత్తమస్తా ॥

అమ్మా! తన తండ్రి (జమదగ్ని) ఆజ్ఞతో కుమారుడు (పరశురాముడు) తన తల్లి రేణుకాదేవి శిరస్సును ఖండించాడు. అపుడు నీవు ఆ కబంధంలో ప్రవేశించావు కాబట్టి నిన్ను **నికృత్తమస్తా** అన్నారు (ఒక విషయం మనం గమనించాలి. ఇక్కడ

నికృత్తమస్త అనేది రేణుక అవుతుందే గానీ ఆమెను జీవింపజేయడానికి యోగుల సుషుమ్నలో ప్రవేశించేలాగా కబంధంలో ప్రవేశించిన శక్తి మాత్రం నికృత్తమస్త కాదు. ఆమె అంశావతారిణియైన రేణుకనుబట్టి ఆ ఛిన్నమస్తా అనే పేరు వచ్చి ఉండాలి).

> 19. *ఛిన్నం శిరః కీర్ణ కవచం దధానాం*
> *కరేణ కంఠోద్గత రక్తధారాం ।*
> *రామాంబికాం దుర్జనకాలరాత్రిం*
> *దేవీం పవిత్రాం మనసా స్మరామి ॥*

కొప్పు విడిపోయి, ఛిన్నమైన శిరస్సును చేతిలో ధరించి, కంఠంనుంచి రక్తం ధారలుగా కారుతూ దుర్జనులకు కాలరాత్రిలాగా భయంకరమై ఉండే ఆ పరశు రాముని తల్లియైన రేణుకాదేవిని (ఈమె వల్లనే లోకంలో ఛిన్నమస్తా శక్తి వైభవం అందరికీ తెలిసింది) నేను మనసారా స్మరిస్తున్నాను.

> 20. *ధ్రువో రమా చంద్రధరస్య రామా*
> *వాగ్వజ్రవైరోచన దీర్ఘనిర్యే ।*
> *కూర్చద్వయం శస్త్రకృశాను జాయే*
> *విద్యానృపాణాం సురరాజశక్తిః ॥*

**ధ్రువః** అంటే ఓం, రమా అంటే శ్రీం, చంద్రధరస్య రామా అంటే హ్రీం, వాక్ అంటే ఐం, వజ్రవైరోచన దీర్ఘనిః యే అంటే **వజ్రవైరోచనయే!** కూర్చద్వయం అంటే **హూం హూం** (దీన్నే ధేను బీజం అంటారు), శస్త్ర కృశానుజాయే అంటే **ఫట్** అనే శస్త్ర బీజం.

వీటికి **స్వాహా** అనే అగ్ని శక్తిని కలిపి వచ్చే మంత్రమే శ్రేష్ఠమైన ఇంద్రుడి శక్తియైన **ఇంద్రాణీ విద్య** (ఇంద్రాణీదేవియే **ఛిన్నమస్త లేదా** ప్రచండ **చండిక.** ఆ ప్రచండచండిక తాంత్రిక మంత్రాన్నే ఈ శ్లోకంలో కవి ప్రస్తావించారు).

> 21. *మాయా ద్వివారంయది సైకవర్ణా*
> *విద్యైకవర్ణాయది ధేను రేకా ।*
> *ధేన్వాది సంబోధనమస్త్ర మగ్నే*
> *ర్విలాసినీ చేతి ధరేందువర్ణా ॥*

*22. చతుష్టయేత్రాన్యతమం గృహీత్వా*
*మంత్రం మహేంద్రస్య మనోధినాథాం ।*
*భజేత యస్తాంత్రిక దివ్యభావ*
*మాశ్రిత్య సిద్ధీః సకలాః సవిందేత్ ॥*

పైన 20వ శ్లోకంలో చెప్పిన మంత్రంలో **హ్రీం** అనే మాయాబీజం రెండుసార్లు వచ్చిన మరొక మంత్రం, **ధేను** బీజమొక్కటే ఇంకొక మంత్రం. మొదట ధేనుబీజం, తర్వాత వజ్రవైరోచని, ఆ తరవాత అస్త్ర బీజం, చివర **స్వాహా** కలది మరొక మంత్రం. ఇలా ముందు చెప్పిన శ్లోకంలో ఒక మంత్రాన్ని చెప్పి, దానిలో మార్పులు చేసి మరి మూడు మంత్రాలను ఇక్కడ చెప్పారు గణపతిముని. మొత్తం నాలుగు మంత్రాలూ ఇలా ఉంటాయి.

1. ఓం శ్రీం హ్రీం ఐం వజ్రవైరోచనీయే హూంహూం ఫట్ స్వాహా (16 అక్షరాలు)
2. ఓం శ్రీం హ్రీం హ్రీం ఐం వజ్రవైరోచనీయే హూంహూం ఫట్ స్వాహా (17 అక్షరాలు)
3. హూం (ఏకాక్షర మంత్రం)
4. హూం వజ్ర వైరోచనీయే ఫట్ స్వాహా (11 అక్షరాలు)

ఈ నాలుగింటిలో ఒక్క మహావిద్యామంత్రాన్నైనా గ్రహించి ఎవరైనా ఆ దేవిని తాంత్రిక విద్యాభావంతో (అంటే, మంత్రాక్షరాలే దేవి అంగాలుగా భావించి మంత్ర రూపాన్ని ఆమె రూపంగా ధ్యానించడమే తాంత్రిక విద్యాభావం) పూజిస్తాడో, అతడు సకల సిద్ధులనూ పొందగలడు.

*23. సంహోత్ర మిత్యద్భుతశక్తి యుక్తం*
*వృషాక పేర్దర్శన మంబ మంత్రం ।*
*యోవైదికం తే మనుజో భజేత*
*కించిన్న తస్యేహ జగత్య సాధ్యం ॥*

ఓ తల్లీ! అద్భుత శక్తి కలిగిన వృషాకపికి తెలిసిన సంహోత్రం అనే నీ వేదమంత్రాన్ని ఎవరైతే పఠిస్తాడో (ఆ మంత్రం ఇదీ – **సంహోత్రం స్మపురా నారీ సమనం వావ గచ్ఛతి, వేధా ఋసత్య వీరిణీంద్ర పత్నీ మహీయతే, విశ్వస్మాదింద్ర ఉత్తరః**), అతనికి ఈ లోకంలో అసాధ్యమనేది ఏదీ ఉండదు (ఇక్కడ వృషాకపి అంటే ఇంద్రుడు కాదు. అది గణపతిముని పేరుకు నామాంతరం. శ్రీరమణుడు

ఉపదేశించిన హృదయ విద్య కేవల విచారణమార్గానికి చెందింది. భక్తి మార్గంతో మంత్ర ధ్యానంవల్ల హృదయ విద్యకు ఉపాయం ఏదన్నా ఉండాలని ఆలోచిస్తున్న సమయంలో కవికి రేణుకాదేవి కృప వల్ల ఇంద్రమంత్ర దర్శనం అయింది. ఆ మంత్రమిదీ – **రాయస్కామో వజ్రహస్తం సుదక్షిణం పుత్రోన పితరంహువే.** దీనిని స్త్రీలు చదివేటపుడు పుత్రోన అనడానికి బదులుగా పుత్రీణ అని చెప్పాలి. ఈ మంత్రానికే స్వాహా అని చేర్చి హోమాలలో పఠిస్తారు కూడా. సర్వాధికారాలకు అధికారిగా ఉండే ఇంద్రుడిని నా సంపదలను అర్థించడానికి ఒక హక్కున్న కొడుకు లాగా కోరతానని దీని అర్థం).

*24. ప్రచండచండీ ప్రమదే పురాణే*
*పురాణ వీరస్య మనోధినాథే ।*
*ప్రయచ్ఛ పాతుం పటుతాంపరాం మే*
*పుణ్యామిమా మార్యనివాస భూమిం ॥*

ఓ ప్రచండ చండీ! నీవు ఈ పుణ్యభూమియైన భారతదేశాన్ని రక్షించడానికి నాకు ఎక్కువ పటుత్వాన్ని ఇచ్చెదవు గాక!

*25. ప్రపంచ రాజ్ఞీ ప్రథిత ప్రభావాం*
*ప్రచండచండీం పరికీర్త యంత్యః ।*
*ఏతాః ప్రమోదాయ భవంతు శక్తే*
*రుపాసకానా ముపజాతయో నః ॥*

ఈ ప్రపంచానికే రాణియై, అధిక ప్రభావాన్ని కలిగిన ప్రచండచండిని కీర్తించే నా ఈ ఉపజాతి వృత్తాలు ఆ ఇంద్రాణీదేవిని ఉపాసించేవారికి సంతోషాన్నిచ్చు గాక!

త్రైష్టుభం శతకంలోని మొదటిదైన ఉపజాతి స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 6.2. రథోద్ధతాన స్తబకం

1. క్షాలనాయ హితాం విభూతయే
విష్టపస్య మదనాయ వజ్రిణః ।
తజ్జయంత జననీ ముఖాబ్జతో
నిర్గతం స్మిత మఘం ధునోతు నః ॥

దిక్కులను శుభ్రం చేయడానికి, లోకాలకు ఐశ్వర్యం ఇవ్వడానికి, ఇంద్రుడికి సంతోషాన్నివ్వడానికీ ఇంద్రాణీదేవి ముఖంనుంచి వెలువడే చిరునవ్వు మా పాపాలను తొలగించుగాక!

2. అన్నలోపకృశ భీరుక ప్రజాం
భిన్నభావ బలహీన నేతృ కాం ।
వాసవస్య వరవర్ణినీ పరై
రర్దితా మవతు భారతావనిం ॥

అన్నం లేకపోవడంవల్ల కృశించి, భయభ్రాంతులై ఉన్న ప్రజలూ, భిన్న భావం తో దుర్బలులలైన నాయకులూ ఉన్న ఈ భారత భూమిని పీడిస్తూ ఉన్న శత్రువులనుండి ఆ ఇంద్రాణీదేవి రక్షించుగాక!

3. పాణిపాద మనిమేష రాజ్ఞి తే
పారిజాత నవ పల్లవోపమం ।
అక్షపా విరహ మంగభా సరి
ద్వాసి చక్రమిథునం కుచద్వయం ॥

4. పూర్ణిమా శశి యశోఽ పహారకం
సంప్రసాద సుషమాస్పదం ముఖం ।
జ్ఞానశక్తిరుచి శేవధీ దృశౌ
రక్త వర్ణకసుధా ఘనోఽ ధరః ॥

5. మర్దయత్తిమిర ముద్ధతం దిశా
మల్ప మప్యధిక వైభవం స్మితం ।
ప్రావృడస్త యమునాతరంగ వ
న్నీలచారురతి పావనః కచః ॥

6. వల్లకీంచ పరుషధ్వనిం వద
న్దుఃఖితస్యచ ముదావహాః స్వరః ।
చారుహో వశ బలాऽ లసాగతిః
కాయ ధామ వచసాం నపద్ధతౌ ॥

7. యోగసిద్ధి మతులాం గతా మతి
శ్చాతురీచ బుధమండలస్తుతా ।
విష్టపత్రితయ రాజ్యతోऽ ప్యసి
త్వం సుఖాయ మహతే బిడౌజసః ॥

ఓ తల్లీ! నీ చేతులూ, కాళ్లూ కొత్తగా విరబూయనున్న పారిజాతపు మొగ్గలను పోలి ప్రకాశిస్తూ ఉన్నాయి. నీ కుచద్వయం రాత్రి పూట విరహం లేనివై, శరీర కాంతి అనే నదిలో నివసించే చక్రవాక పక్షుల జంటలా ఉన్నాయి. పున్నమి చంద్రుని కీర్తిని అపహరించే నీ ముఖము ప్రసన్నతాశోభను సంతరించుకున్నది. నీ దృష్టి అనేది జ్ఞానశక్తి కాంతికి నిధి. నీ పెదాలు మెరుపు రంగుగల అమృతం గడ్డకట్టినట్లుంది. నీ నవ్వు, దిక్కుల్లో అధికంగా ఉండే చీకటిని చెండాడుతూ కొద్దిగా వెలువడుతూన్నా కూడా అధికమైన వైభవాన్ని కలిగి ఉంది. నీ కొప్పు శరత్కాలంలోని యమునా తరంగంలాగా, నీలి రంగుతో పావనిగా ఉంది. నీ స్వరం వీణ పలికించే స్వరంకన్నా మృదువుగా ఉండి వీణాస్వరమే పరుషమైనట్లు అనిపిస్తూ ఉండి, దుఃఖించేవారికి ఆనందాన్నిస్తూ ఉంది. మనోహరమైన విలాసమైన నీ నడక మందగమనంగా ఉంటే, నీ శరీరకాంతి వర్ణనాతీతమైంది. ఇక నీ బుద్ధి సంగతికి వస్తే, అది అసమాన మైన యోగ సిద్ధులను కలిగి ఉంది. నీ చాతుర్యం పండితుల స్తుతికి కారణంగా ఉంది. దేవేంద్రుడికి ముల్లోకాలపై ఆధిపత్యం వల్ల కలిగే సుఖంకన్నా నీవే ఎక్కువ సుఖాన్నిస్తున్నావు.

8. త్వాముదీక్ష్య ధృత దేవతాతనుం
దీక్ష పక్ష్మల విశాలలోచనాం ।
ఆదితో జనని జన్మినా మభూ
ద్వాసవస్యరతి రాది మేరసే ॥

9. ఆదిమంరస మసాదివాసనా
వాసితౌ ప్రథమ మప్య గృహ్ణతాం ।
సమ్మదస్యనిధి మాది దంపతీ
సోऽ చల త్రిభువనే తతః క్రమః ॥

10. జ్యాయసా దివిషదాం పురాతనీ
నీలకంజ నయనా విలాసినీ ।
యద్విహారమతనో ట్రృరోచనం
తత్సు తా మభవ దాదిమేరసే ॥

ఓ తల్లీ! దేవతా శరీరాన్ని ధరించి, ప్రకాశించే కనురెప్పల వెంట్రుకలతో కూడిన కళ్లను కలిగిన నిన్ను చూడగానే దేవేంద్రుడికి శృంగారరసం పుట్టింది. అనాదియైన వాసనతో ఉండే ఆదిదంపతులు సంతోషనిధియైన ఆ శృంగారరసాన్ని మొదట్లో పొందారు. అందువల్లే ముల్లోకాల్లో ఆ క్రమం విస్తరించింది. నల్లకలువల్లాంటి కన్నులున్న ఆ పురాతన స్త్రీ, దేవతల ప్రభువైన ఇంద్రుడితో ఏ కారణంగా విహరిస్తూ ఉండిందో ఆ కారణంవల్లే సత్పురుషులకు కూడా ఆ శృంగారరసంలో కోరిక కలిగింది.

11. సత్వదంబ నళినాననాఽధికా
నాపి నాకపతితోఽధికః పుమాన్ ।
నాధికంచ వనమస్తి నందనా
న్నాది మాదపి రసోఽధికోరసాత్ ॥

12. నాయికా త్వమసమాన చారుతా
నాయకః స మరుతాం మహీపతిః ।
నందనంచ రసరంగభూః కథం
మన్మథస్య నభ వేదిహోత్సవః ॥

13. దేవి వాం మృతికథైవ దూరతో
జాతు చిద్గళతినైవ యౌవనం ।
కాంక్షితః పరికరో నదుర్లభః
కిం రసః పరిణమేదిహన్యదా ॥

అమ్మా, నీకంటే గొప్ప పద్మముఖి లేదు. ఇంద్రుడి (నాకపతి) కంటే గొప్ప పురుషుడు లేదు. నందనవనం కంటే గొప్ప వనం లేదు, శృంగారరసం కంటే గొప్ప రసం వేరే లేదు. సాటిలేని సౌందర్య నాయికవు నీవు. దేవతాప్రభువైన ఇంద్రుడు నీ నాయకుడు. నందనవనం అనేది రసానికి రంగస్థలం. ఇక అక్కడ మన్మథుడికి పండగకాక మరింకేమిటీ? మీ నాయికానాయకులిద్దరికీ మృత్యువనేది లేదు. మీ యౌవనం ఎప్పటికీ జారిపోదు. కోరినవన్నీ లభిస్తాయి. ఇక రస లోపమెక్కడుంటుందీ?

14. విష్టపస్య యువరాజ కేశవే
త్రాణభారమఖిలం నిధాయ వాం ।
క్రీడతో రమరరాజ్ఞి నందనే
క్రీడితాని మమ సంతు భూతయే ॥

ఓ దేవీ! యువరాజైన విష్ణువుకు సకల లోక భారాన్ని అప్పగించి నందన వనంలో మీరు క్రీడించడం నాకు ఐశ్వర్యాన్ని కలుగజేయుగాక!

15. యద్యువామమరరాజ్ఞి నందనే
కుర్వతో రహపి దేవి మంత్రణం ।
తత్రచేన్మమ కృతిర్మనాగియం
స్పర్శమేతి భువి కోను మత్కృతీ ॥

తల్లీ! నందన వనంలో మీరిద్దరూ రహస్యాలోచనలు చేసేటపుడు నా యీ సప్తశతి మిమ్మల్ని కొంచెం తాకితే, మీకు వినిపిస్తే ఇక నాకంటే ధన్యుడు ఈ లోకంలో వేరే ఎవరూ ఉండరు.

16. క్రందనం యది మ మేహ వందినో
నందనే విరహతో స్సవిత్రి వాం ।
అంతరాయకృదధాబ్జకాంతి తే
సంప్రగృహ్యా చరణం క్షమాపయే ॥

తల్లీ! ఇపుడు నా నమస్కారాలతో కూడిన ఈ మూర్ఖత్వం నందన వనంలో మీ విహారానికి భంగం కలిగిస్తూ ఉండేట్లయితే నీ పాదాలను పట్టుకుని క్షమాపణ వేడతాను.

17. యోషి తామపి విమోహనాకృతి
ర్మోహనం పురుష సంహతే రపి ।
ఇంద్రమంబ రమాయాం బభూవిథ
త్వం రసార్ద్ర హృదయా లసద్రసం ॥

18. దివ్య చందన రసానులేపనైః
పారిజాత సుమతల్పకల్పనైః ।
చారుగీతకృతిభిశ్చ భేజిరే
నాకలోక వన దేవతాశ్చ వాం ॥

19. స్వర్ణదీసలిలశీకరోక్షితాః
పారిజాత సుమగంధ ధారిణః ।
నందనే త్రిదశలోకరాజ్ఞి వాం
కేపి భేజు రలసాః సమీరణాః ॥

తల్లీ! నీ ఆకారం స్త్రీలను సైతం సమ్మోహన పరిచేదిగా ఉంది. రసార్ద్రమైన హృదయమున్న నీవు పురుషులనే సమ్మోహితులను చేసే ఇంద్రుడినే రమింప జేశావు. స్వర్గంలో ఉండే వనదేవతలు మీ దివ్య చందన రసానులేపనలతో, పారిజాత పుష్పాలతో చేసిన పాన్పులతో చక్కని గానాలతో మిమ్మల్ని అలరిస్తూన్నారు. నందన వనంలోని పిల్లగాలులు ఆకాశగంగలో స్నానంచేసి పారిజాత సుమదళాల సువాసన లను ధరించి మిమ్మల్ని సేవిస్తున్నాయి.

20. ఆదధాసి సకలాంగ నాదికే
పద్మగంధిని సుధాధరాధరే ।
మంజువాణి సుకుమారి సుందరి
త్వం సురేంద్ర సకలేంద్రియార్చనం ॥

21. ఆదిదేవి వదనం తవాభవ
త్కాంతిధామ మదనం దివస్పతేః ।
ఆననాదపి రసామృతం కిర
న్నిర్భ్రమం విలసితం కలం గిరాం ॥

22. చారువాగ్విలసితాచ్చ నిస్తుల
ప్రేమవీచిరుచిరం విలోకితం ।
వీక్షి తాదపి విలాస విభ్రమ
స్థాన మల్పమలసం శుచిస్మితం ॥

23. భాసు రేంద్ర దృఢ బాహుపంజరీ
లజ్జయా సహజయా నమన్ముఖీ ।
తద్విలోచన వికర్ష కాలకా
పాతుమా త్రిదివలోక నాయికా ॥

ఓ తల్లీ! నీవు ఇంద్రుడికి రసార్చన (అన్ని ఇంద్రియాలకూ అర్చన) కలుగజేస్తు న్నావు. పద్మగంధివి కావడంవల్ల వాసనకూ, సుధాధరాలను కలిగి ఉండటం వల్ల

జిహ్వకూ, మంజులవాణిని కలిగి ఉండటంవల్ల వినడానికీ, సుకుమారి కావడంవల్ల స్పర్శకూ, సుందరివి కావడంవల్ల కళ్లకూ సంతృప్తినివ్వగలుగుతున్నావు. నీ ముఖ వర్చస్సు ఇంద్రుడినే మదింపజేస్తూ, కాంతినిధియై ఉంది. నీ ముఖ వర్చస్సుకన్నా నీ వాగ్విలాసం అధిక రసాన్నిస్తూ మరింత మధురంగా ఉంది. ఆ సొగసైన వాగ్విలాసం కన్నా కూడా నీ చూపులు పోల్చలేని ప్రేమతో నిండి ఉంది. నీ చూపుల కన్నా నీ మందహాసం ఎంతో నిర్మలంగా, విలాస విశ్రాంతికి స్థానమై ఉంది. దేదీప్యమానమైన ఇంద్రుడి బిగికౌగిలిని పొంది, సహజమైన సిగ్గుతో వాలిన ముఖంతో ఇంద్రుని చూపును ఆకర్షిస్తూ ఉండే ముంగురులతో ఉన్న ఇంద్రాణీదేవి నన్ను రక్షించుగాక!

*24. భారతక్షితి విషాదవారణే*
*తత్సుతం గణపతిం కృతోద్యమం ।*
*ఆదధాతు పటుమర్జున స్మితా*
*దుర్జన ప్రమథనక్షమా శచీ ॥*

దుష్టులను శిక్షించడంలో పటుత్వం గల ఓ శచీదేవీ! నీ తెల్లని చిరునవ్వు భారతదేశ విషాదాన్ని నివారించే విషయమై ప్రయత్నిస్తూ ఉన్న ఈ గణపతి (ముని) ని సమర్థునిగా చేయుగాక!

*25. చారుశబ్ద కలితాః కృతీరిమాః*
*సత్కవిక్షితిభుజో రథోద్ధతాః ।*
*సాశృణోతు సుర మేదినీపతే*
*ర్నేత్ర చిత్తమదనీ విలాసినీ ॥*

ఇంపుగా ఉండే శబ్దాలతో గణపతి పేర్చిన ఈ రథోద్ధతా వృత్తాలను ఇంద్రాణీ దేవి వినుగాక!

త్రైష్టుభం శతకంలోని రెండవదైన రథోద్ధతాన స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



# 6.3. మౌక్తికమాలా స్తబకం

1. నిర్మలభాసాం దిశిదిశి కర్త్రా
పుణ్యమతీనాం హృదిహృది ధర్త్రా ।
పాలయతా న్మామనఘవిలాసః
శక్రమహిష్యాః సితదరహాసః ॥

అన్ని దిశలకూ నిర్మలమైన కాంతులనిచ్చేదీ, ప్రతి హృదయంలోనూ పుణ్యకరమైన బుద్ధులను ధరించేదీ, పాపకళంకం లేని విలాసాలు కలిగిన ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు నన్ను రక్షించుగాక!

2. పుణ్య చరిత్రా మునిజనగీతా
వాసవకాంతా త్రిభువన మాతా ।
వత్సలభావా దవతు విదూనాం
భారతభూమిం ధనబలహీనాం ॥

పుణ్యచరిత్ర కలిగిందీ, మునులంతా కీర్తించేదీ ఇంద్రాణీదేవినే. ఆమె త్రిభువనాలకూ జనని. ఆ ఇంద్రాణీదేవి ధనమూ, బలమూ రెండూ కోల్పోయి దుఃఖిస్తూ ఉన్న భారతభూమిని వాత్సల్యంతో రక్షించుగాక!

3. కోటితటిద్వత్తవ తనుకాంతిః
పూర్ణ సమాధౌ తవహృది శాంతిః ।
వాసవభామే భగవతి ఘోరః
శత్రువిదారీ తవభుజసారః ॥

4. ఆశ్రయభూతం సుమధురతాయాః
ఆలయభూతం జలధిసుతాయాః ।
వాసవదృష్టే స్తవముఖమబ్జం
కింకరదృష్టే స్తవపదమబ్జం ॥

ఓ భగవతీ! నీ శరీరం వెదజల్లే కాంతి కోటి మెరుపుల కాంతినిపోలి ప్రకాశిస్తూ ఉంది. పూర్ణసమాధిలో ఉన్న నీ హృదయంలో శాంతి ఉంది. నీ భుజబలం ఘోరమైన శత్రువులను సంహరించేదిగా ఉంది. ఎంతో మాధుర్యాన్ని కలిగి లక్ష్మీనివాసంగా ప్రసిద్ధికెక్కిన పద్మం ఆ ఇంద్రుడి దృష్టిలో నీ ముఖమే అవుతోంది. కానీ భక్తుల దృష్టిలో మాత్రం నీ పాదమే ఆ పద్మమవుతోంది.

5. పాదసరోజం వృజినహరం తే
యో భజతే నా సురపతికాంతే ।
తత్రకటాక్షా అయి శతశస్తే
తస్యసమస్తం భగవతి హస్తే ॥

ఓ తల్లీ! పాపాన్ని తొలగించే నీ పాదపద్మాన్ని ఎవరు పూజిస్తారో వారికి నీ ముఖపద్మానుగ్రహం (నీ కటాక్షం) లభించడమే కాదు. సమస్తం అతని చేతిలోకి (అధీనంలోకి) వెళ్లిపోతోంది.

6. జ్ఞాపకశక్తిః ప్రతినరమస్తం
కారకశక్తిః ప్రతినరహస్తం ।
వాసవ చక్షు స్సుకృతఫలశ్రీ
ర్భాతు మమాంతః సురభవనశ్రీః ॥

మానవులందరి మెదడుల్లో జ్ఞాపకశక్తిగా ఉంటూ, ప్రతి మానవుని చేతిలో కారకశక్తిగా ఉండి, ఆ ఇంద్రుడి కళ్లకు చక్కని ఫలసంపదగా ఉండే ఇంద్రాణీదేవి నా అంతరంగంలో ప్రకాశించుగాక!

7. మంత్రపరాణాం వచసి వసంతీ
ధ్యానపరాణాం మనసి లసంతీ ।
భక్తిపరాణాం హృది విహరంతీ
భాతి పరాంబా నభసి చరంతీ ॥

మంత్రవేత్తలకు వాక్కులో ప్రకాశించేదీ, ధ్యానంలో ఉండేవారికి మనస్సులో వికసించేదీ, భక్తుల హృదయాల్లో విహరించేదీ, ఆకాశంలో విహరించేదీ అయిన ఆ పరాదేవియైన అంబ ప్రకాశిస్తూ ఉంది.

8. సేవక పాపప్రశమన నామా
దిక్తిమిరౌఘ ప్రమథన ధామా ।
ఉజ్వలశస్త్రా రణభువి భీమా
పాతు నతం మాం హరిహయ రామా ॥

తనను సేవించే వాళ్ల పాపాలను హరించే పేరుగలదీ, దిక్కులలోని చీకట్లను నశింపజేసే తేజస్సు గలదీ, యుద్ధ భూమిలో భయాన్ని కలిగించే ఉజ్వలమైన శస్త్రం కలదీ అయిన ఆ ఇంద్రాణీదేవి వినయశీలినైన నన్ను రక్షించుగాక!

9. యోగినిశక్తి ర్విలససి దాంతిః
యోషితిశక్తి ర్విలససి కాంతిః ।
జ్ఞానినిశక్తి ర్విలససి తుష్టి
ర్ధన్వినిశక్తి ర్విలససి దృష్టిః ॥

యోగికి శక్తివై నీవు ఇంద్రియశక్తిగా, స్త్రీకి శక్తివై నీవు కాంతిగా ఉంటే, జ్ఞానికి శక్తివై నీవు అతని తృప్తిగా ఉన్నావు. ధనస్సును ధరించిన వానికి శక్తివై నీవు లక్ష్యశుద్ధిగా ప్రకాశిస్తూ ఉన్నావు.

10. సంగినిశక్తి ర్విలససి నిద్రా
ధ్యాతరిశక్తి ర్విలససి ముద్రా ।
వాసవకాంతే గగననిశాంతే
భాషితుమీశః క్వను విభవంతే ॥

అమ్మా! సంగదోషం కలవారిలో నీవు నిద్రాశక్తిగా ఉన్నావు. ధ్యానించేవారిలో ముద్రాశక్తిగా ఉన్నావు. నీ వైభవాన్ని వర్ణించడం ఎవరి తరమూ?

11. యద్దితిజానాం దమనమవక్రం
కేశవహస్తే విలసతి చక్రం ।
తత్రకళా తే భగవతి భద్రా
కాచన భారంవహతి వినిద్రా ॥

12. దుష్టనిశాట ప్రశమన శీలం
యత్పిత భూభృత్పతికరశూలం ।
తత్ర మహోంశస్తవ జగదీశే
రాజతి కశ్చిత్పటు రరినాశే ॥

అమ్మా! రాక్షసులను ఖండించేదీ, విష్ణువు చేతిలో అజేయంగా ప్రకాశించేదీ అయిన చక్రం ఏదైతే ఉందో, అది భద్రంగా, జాగ్రత్తగా ఉండే నీ కళాభారాన్నే వహిస్తోంది. దుష్టరాక్షస సంహారమే శీలంగా కలిగి ఉండే ఆ కైలాసాధిపతి చేతిలో ఉండే ఏ శీలమైతే ఉందో, దానిలో శత్రువులను నాశనం చేసే శక్తి నీ తేజానికి చెందిన కాంతే గానీ వేరొకటి కాదు (అటు విష్ణువు చేతిలోని చక్రాయుధంలోనూ, ఇటు శివుని చేతిలో శూలంలోనూ ఉండే శస్త్ర శక్తీ కూడా ఆ దేవి వైభవమే అని అర్థం).

13. యన్నిజరోచి ర్వ్యాత రిపుసారం
వాసవహస్తే కులిశ ముదారం ।
తత్ర తవాంశో విలసతి దివ్యః
కశ్చన భాసో భగవతి భవ్యః ॥

14. అంబరదేశే సుమహతి గుప్తా
పంకజ బంధౌ విలసతి దీప్తా ।
రాజసి మాత ర్హిమరుచిశీతా
వేదికృశానౌ క్రతుభృతిపూతా ॥

ఇంద్రుడి చేతిలోని వజ్రాయుధం తన జ్వాలలతో శత్రువులను సంహరించేదే కాదు. ఉదార లక్షణం కలిగింది కూడా. ఆ వజ్రాయుధంలో కూడా దివ్యమైన నీ తేజస్సుకు చెందిన అంశయే ఉంది.

15. సూక్ష్మరజోభి ర్వ్యిహితముదారం
యజ్జగదేత ద్గగన మపారం ।
తత్తవ వేదః ప్రవదతి కాయం
పావని భానుస్తవ తనుజోఽయం ॥

16. ఈశ్వరి నైకస్తవ ఖరతేజా
స్తేపిచ సర్వే జనని తనూజాః ।
ఉజ్వల ఖేటాః కువదతికాయాః
పావని కస్తే ప్రవదతు మాయాః ॥

17. యామహిమానం ప్రధయతి భూమిః
పావనకీర్తిర్జలనిధి నేమిః ।
సేయమపీశే భవతి సుపుత్రీ
వాసవజాయే తవ జనధాత్రీ ॥

దేవీ! అతి సూక్ష్మమైన రజస్సులతో నిండి శ్రేష్ఠమైన ఏ ఈ అపార గగనమనే (సూక్ష్మ) జగత్తుందో, అదే నీ శరీరం. ఇది వేదవాక్కు. అట్టి నీకు ఆ సూర్యుడు పుత్రుడే. ఐతే, తీక్షణమైన తేజస్సును కలిగిన సూర్యుడొక్కడే నీ పుత్రుడు కాదు. భూమిలాగా పెద్ద దేహాన్ని కలిగి ఆకాశంలో ప్రకాశించే జ్యోతిర్గోళాలెన్నో ఆకాశంలో ఉన్నాయి. ఈ జ్యోతిర్గోళాలూ నీ పుత్రులే. నీమాయలను ఎవరు చెప్పగలరు? అమ్మా,

పావనమైన కీర్తితో సముద్రానికమ్మిగాగల విశాలమైన భూమి సైతం నీ పుత్రికయే.

*18.* *అంగ! సఖాయో! విరమత సంగా*
*ద్దుర్విషయాణాం కృతమతి భంగాత్ ।*
*ధ్యాయత చిత్తే ధుతభయబీజం*
*వాసవజాయా చరణ సరోజం ॥*

*19.* *పాపమ శేషం సపది విహాతుం*
*శక్తిమనల్పామపి పరిధాతుం ।*
*చేతసి సాధో కురు పరిపూతం*
*వాసనజాయా పదజలజాతం ॥*

మిత్రులారా! మతిని భ్రష్టుపట్టించే దుర్వ్యసనాలను వదిలి, జన్మభయబీజాన్ని నశింపజేసే ఇంద్రాణీదేవి పాదపద్మాలను మీ మనస్సులో ధ్యానించండి. ఓ సాధువా! వెంటనే సకల పాపాలనుండి విముక్తుడవటానికి, అధిక శక్తిని పొందడానికీ నీవు ఇంద్రాణీదేవి పవిత్ర చరణాలను నీ మనస్సులో ఉంచుకో.

*20.* *ఈశ్వరి వంద్యద్యుతి భృతి మేఘే*
*కాంక్షిత నీరాణ్యసృజతి మోఘే ।*
*నిర్మలకీర్తేస్తవ శచి గానం*
*శక్నృతి కర్తుం తదుదక దానం ॥*

*21.* *ఆమయ వీర్యా ద్విగళతి సారే*
*జీవతి కించిద్రసనగనీరే ।*
*రక్షతి జంతుం తవ శచినామ*
*ప్రాజ్ఞజనైర పృగణితధామ ॥*

*22.* *మధ్యమలోకేస్మతి శుచి రుగ్రా*
*రాజసి నాకే విభవ సమగ్రా ।*
*ప్రాణి శరీరే భవసి విచిత్రా*
*వాసవజాయే వివిధ చరిత్రా ॥*

*23.* *వ్యోమ్నివపుస్తే వినిహతపాపం*
*విశ్రుత లీలం తవ దివిరూపం ।*
*కర్మవశాత్తే భవతి సభోగః*
*ప్రాణిశరీరే భగవతి భాగః ॥*

ఓ శచీదేవీ! అందరూ పూజించే కాంతిని ధరించే మేఘం వ్యర్థమై, కోరిన జలాన్ని ఇవ్వలేనపుడు, నిర్మలమైన నీ కీర్తి గానమే జలాన్నిస్తూ ఉంది. అమ్మా! రోగ బలంవల్ల రోగికి ఉండే బలం తగ్గిపోయి, నాలుకపై ఉన్న కొద్దిపాటి నీటితో జీవించి ఉండగా, ప్రాజ్ఞులకు సైతం లెక్కింపలేని ఉత్తమస్థితిని ఇచ్చే నీ నామమే ఆ జీవిని ఇక రక్షించగలదు. ఓ దేవీ ఇంద్రాణీ! నీవు మధ్యమలోకమైన ఆకాశంలో అత్యంత పవిత్రంగానూ, ఉగ్రంగానూ ఉంటావు. స్వర్గంలో అత్యంత వైభవంతో విరాజిల్లుతూ ఉంటావు. ప్రాణుల శరీరాల్లో విచిత్రాలతో కూడి వివిధ చరిత్రలను కలిగి ఉన్నావు. నీ శరీరం ఆకాశంలో పావనమై (పాపాలను పారద్రోలి) సూర్యుడిలో విశ్రుతలీలలను కలిగి ఉన్నావు. ప్రాణి శరీరంలో నీ రూపభాగం కర్మవశాత్తూ భోగయుక్తంగా ఉంది.

*24.* *భారతభూమేః శుచ మపహంతుం*
*శ్రేష్ఠముపాయం పునరవగంతుం ।*
*వాసవజాయే దిశ మమబుద్ధిం*
*పావని మా యే కురుకురుసిద్ధిం ॥*

ఓ మాయారూపిణీ! శచీదేవీ! ఈ భారతభూమి దుఃఖాన్ని తొలగించడానికి, ఏదన్నా శ్రేష్ఠమైన ఉపాయాన్ని తిరిగి (వేదాల్లోంచి) కనుగొనడానికి నాకు శక్తినివ్వు.

*25.* *సమ్మదయంతీ ర్బుధజనమేతాః*
*స్వర్గధరిత్రీపతిసతి! పూతాః ।*
*మౌక్తిక మాలాః శృణు నుతికర్తు*
*ర్భక్తినిబద్ధాః కవికులభర్తుః ॥*

ఓ ఇంద్రాణీదేవీ! తెలివైన జనాలను సంతోషపెట్టేదీ, పవిత్రమైందీ, భక్తి కలిగిందీ, కవికులపతి (గణపతిముని) స్తుతించిన ఈ మౌక్తికమాలను నీవు చక్కగా విను.

త్రైష్టుభం శతకంలోని మూడవదైన మౌక్తికమాలా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



# 6.4. సుముఖీ స్తబకం

1. అజితమినాగ్ని తటి చ్ఛశిభి
   ర్మమహృదయస్య తమః ప్రబలం ।
   అమరపతిప్రమదా హసితం
   విమల ఘృణిప్రకరై ర్హ రతు ॥

సూర్యుని చేతగానీ, అగ్నిచేతగానీ, విద్యుత్తు చేతగానీ, చంద్రుని చేతగానీ జయింపలేని నా హృదయంలోని చీకటిని ఇంద్రాణీదేవి చిరునవ్వు తన నిర్మలమైన కాంతికిరణాలు ప్రసరించి హరించుగాక!

2. సురనృపతేర్దయితా వినతా
   హితశమనీ లులితా మితరైః ।
   వరకరుణా వరుణాలయ దృ
   క్శమజననీ మవతా దవనిం ॥

వినయంగా ఉండేవారికి ఇష్టంలేని దానిని నశింపజేసేది కరుణా సముద్రమనే ఇంద్రాణీదేవి దృష్టి. ఆ కరుణామృత దృష్టి నేడు అన్య మతస్థులు (దేశంలో కల్లోలాలు, హింసలు సృష్టించేవారు కూడా అన్యమతస్థులే. మతం అంటే మానవత్వాన్ని పెంచేది.) సృష్టిస్తూన్న చికాకులతో సతమతమవుతున్న నా భారతభూమిని రక్షించుగాక!

3. పటుతపసో జమదగ్నిమునే
   రిహ సహధర్మచరీం భువనే ।
   తనయ నికృత్తశిరఃకమలాం
   వరమతి మావిశ దింద్రవధూః ॥

4. యదుకులకీర్తి విలోపభియా
   బత వినిగుహ్యా ఋతం కవయః ।
   మునిగృహిణీ వధహేతుకథా
   మితర పథేన భణంతి మృషా ॥

5. న సురభి రర్జునభూమిపతి
   ర్భృగుతిలకస్య జహార స యాం ।
   ఇయమమృ తాంశు మనోజ్ఞముఖీ
   పరశుధరస్య జనన్య నఘా ॥

6. అతిరథ మర్జునభూమిపతిం
సహపృతనం జమదగ్ని సుతః ।
యుధి సవిజిత్య విశాలయశాః
పునరపి మాతర మాహృతవాన్ ॥

ఈ లోకంలో పుత్రుడు ఖండించిన శిరస్సును కలిగి, ఉత్తమమైన బుద్ధిని కలిగిన జమదగ్నిపత్నిని ఇంద్రాణీదేవి ఆవేశించింది. యదుకులానికి (కార్తవీర్యార్జునుడు యదుకులానికి చెందినవాడే) అపకీర్తి వస్తుందేమో అని ఈ రేణుకా వృత్తాంతాన్ని వేరేగా చెబుతున్నారు. ఆ కార్తవీర్యార్జునుడు భృగుకుల తిలకుడి సురభిని (గోవును) అపహరించనే లేదు. అతని పత్నీ, చంద్రముఖీ, పాపరహితురాలూ అయిన పరశరామ జననినే అపహరించాడు. ఆ జమదగ్ని పుత్రుడైన పరశురాముడు అతిరథుడైన అర్జున మహారాజును సేనాసమేతంగా యుద్ధంలో జయించి విశాల కీర్తి కలిగి తన తల్లిని తిరిగి వెనక్కి తీసుకుని వచ్చాడు.

7. పరగృహవాస కళంకవశా
న్ని జగృహిణీం జమదగ్ని మునిః ।
బత వినిహంతుమనాకలయం
స్తనుభవమాదిశ దుగ్రమనాః ॥

8. పితృవచనాదతి భక్తిమతా
ప్యసురవదాత్మసుతేన హతాం ।
మునిగృహిణీ మనఘేతి వదం
స్తవ వరదేఽ విశదంశ ఇమాం ॥

9. ఇదమవికంప్య మతిప్రబలం
ప్రభవతి కారణ మార్యనుతే ।
మునిగృహిణీ మనఘాం భణితుం
శచికలయా యదిమామవిశః ॥

10. ఖలజన కల్పిత దుష్టకథా
శ్రవణవశా ద్వ్యథితం హృదయం ।
అధచరితేఽ వగతే విమల
స్మృతి వశతో మమ యాతి ముదం ॥

11. తవ మహసావిశతా కృపయా
మమ శచి సూక్ష్మశరీరమిదం ।
నృపరిపుమాతృ పవిత్రకథా
స్మరణపథం గమితా సపది ॥

12. విదధతు రాసురకృత్య ముభౌ
బహుళగుణామపి యద్గృహిణీం ।
సముని రఘూత యదచ్ఛకథాం
దశరథజశ్చ ముమోచ వనే ॥

తన భార్య వేరే వారి ఇంట్లో నివసించి తనకు కళంకాన్ని తెచ్చిందనుకున్న ఆ ఉగ్రుడైన జమదగ్ని, ఆమెను చంపాలనుకున్నాడు. ఐతే, ఏమాత్రమూ ఆలోచించ కుండా, ఆశ్చర్యంగా ఆ పనికి తన కుమారుడిని ఆజ్ఞాపించాడు (తన భార్యను తాను చంపకుండా, కుమారుడిని ఆ పనికి ఆజ్ఞాపించడం ఆశ్చర్యంకాక మరేమిటీ?). అతి భక్తిపరుడైనా, తండ్రిమాటలను జవదాటని కొడుకు తనను చంపగా ఈ రేణుకా దేవి ఎంతో పుణ్యాత్మురాలని ఎంచి నీ అంశ ఆమెలో ప్రవేశించింది. ఏ కారణంవల్ల నీ కళ ఆమెలో ప్రవేశించిందో, మునిపత్ని పవిత్రురాలని చెప్పడానికి ఆ కళే ప్రబలమైన కారణం అవుతోంది. దుర్మార్గులు కల్పించిన ఈ కథను విన్నపుడు నా హృదయం ఎంతో బాధపడ్డా, ఆ తర్వాత నిర్మలమైన బుద్ధితో నిజమైన నీ కథను తెలుసుకుని సంతోషం వేసింది. ఓ శచీదేవీ! నీవు ఎంతో దయ తలిచి నా యీ సూక్ష్మ శరీరంలోకి నీ తేజస్సును ప్రవేశపెట్టావు. అందువల్ల పరశురాముడి తల్లియైన రేణుకాదేవి పవిత్రమైన కథను వెంటనే నా స్మృతికి తట్టేలా చేశావు. అనేక గుణాలున్న భార్యను ఆ జమదగ్నిముని ఏ కారణంగా చంపించాడో, స్వచ్ఛమైన చరిత్ర కలిగిన తన భార్యను ఆ దశరథరాముడు ఏ కారణంగా అడవులపాలు చేశాడో, ఆ కారణంవల్ల ఆ ఇద్దరూ రాక్షసత్వానికే పాలుపడ్డారనిపిస్తోంది.

13. అపి వినికృత్తశిరాః శచి తే
వరమహసా విశతా సపది ।
అలభత జీవిత మంబ పున
ర్భువన శుభాయ మునేస్తరుణీ ॥

14. యది శిరసా రహితే వపుషి
ప్రకటతయా విలసంత్యసవః ।

యది హృదయం సహభాతిధియా
కిమివ విచిత్ర మితశ్చరితం ॥

ఓ తల్లీ! శిరస్సులేనిదైనా కూడా ఆ జమదగ్ని భార్యయైన రేణుక తనలో ఆ క్షణమే ప్రవేశించిన గొప్పదైన నీ తేజస్సుతో లోకానికి శుభాన్నివ్వడానికై తిరిగి జీవితాన్ని పొందింది. శిరస్సులేని శరీరంలో స్పష్టంగా ప్రాణాలు ప్రకాశించిన హృదయం బుద్ధితో కలిసి ప్రకాశించింది. ఇంతకంటే విచిత్రం ఇంకేముంటుందీ?

15. పరశుధరస్య సవిత్రి కళా
త్వయి పురుహూత సరోజదృశః ।
స శిరసి కాచిదభూద్రుచిరాఽ
విశిరసి భీమతమా భవతి ॥

16. పరశుధరోర్జున భూమిపతిం
యదజయ దంబ తపోఽత్ర తవ ।
అభజత కారణతా మనఘే
వరమునిగేయ పవిత్రకథే ॥

ఓ రేణుకాదేవీ! శిరస్సుతో ఉన్నపుడు నీలో శచీదేవి సంబంధమైన ఒకానొక సమ్మోహనమైన కళ ఉండేది. ఐతే, శిరస్సులేని నీలో భీకరమైన ఆమె కళ ఉండింది. అమ్మా! పరశురాముడు కార్తవీర్యుని జయించినపుడు ఆ విజయానికి నీ తపస్సే కారణమైంది.

17. భగవతి కృత్తశిరా భవతీ
మధితవతీ నృపతీ నశుభాన్ ।
ప్రధన భువి ప్రగుణం భుజయోః
పరశుధరాయ వితీర్య బలం ॥

18. శుభతమ కుండల పూ ర్వసతిః
పదనతపాతక సంశమనీ ।
దిశతు నికృత్తశిరాః కుశలం
మమ సురపార్థివశక్తికళా ॥

19. నిజసుత రంగపతే ర్నికటే
కృతవసతి ర్నత సిద్ధికరీ ।

*దళితశిరాః ప్రతనోతు మమ*
*ప్రియ మమ రేశ్వరశక్తికళా ॥*

*20. భువితతసహ్యా నగాంతరగే*
*శుభతమ చంద్రగిరౌ వరదా ।*
*కృతవసతిః కురుతాన్మమ శం*
*భృగుకుల రామజన న్యజరా ॥*

ఓ దేవీ! ఛేదించిన శిరస్సున్న నీవు యుద్ధభూమిలో పరశురాముని భుజాలకు అమితమైన బలాన్నిచ్చి, దుర్మార్గ రాజులను చంపిన దానివైనావు. శుభప్రదమైన కుండలీపురంలో నివసిస్తూ, తన పాదాలకు నమస్కరించేవారి పాపాలను పరిహరిస్తూ, ఛేదించిన శిరస్సున్న (కృత్త శిరస్సున్న) ఆ ఇంద్రాణీదేవి కళ నాకు క్షేమాన్నిచ్చుగాక! తన పుత్రుడైన రంగపతికి సమీపంలోనే ఉండి, భక్తులకు కార్యసిద్ధిని కలుగజేస్తూ, ఛేదించిన శిరస్సును కలిగిన (కృత్త శిరస్సున్న) ఆ ఇంద్రాణీదేవి కళ నాకు ప్రియాన్ని చ్చుగాక (ఇక్కడ కుండలినీపురం అంటే, నేటి తమిళనాడులోని వేలూరు సమీపంలోని పడైవీడు క్షేత్రమే. ఆ క్షేత్రానికి సమీపంలో రఘురామ ఆలయం ఒకటి ఉంది. అదే వింత. ఒకప్పుడది పరశురామ ఆలయం అయి ఉండాలి లేదా పరశురాముని తర వాతి చరిత్రే అయిన ఆ రఘురాముని చరిత్రన్నా కావాలి)! సహ్య పర్వతాల్లో నివసించే ఓ తల్లీ! శుభప్రదమైన చంద్రగిరిలో ఉంటూ వరాలిస్తూన్నావు. ముసలితనమేలేని భార్గవరాముని తల్లి సకల శుభాలనిచ్చుగాక!

*21. అవతు నికృత్తశిరాః పదయో*
*ర్భజక మనింద్య విచిత్ర కథా ।*
*దినకరమండలమధ్య గృహా*
*సురధరణీపతిశక్తి కళా ॥*

ఛేదించిన శిరస్సు కలిగి, పవిత్రమైన, విచిత్రమైన కథ కలిగి, సూర్యమండల మధ్యభాగాన్నే ఇల్లుగా కలిగిన ఆ ఇంద్రాణీదేవి కళ (దేవయాన మార్గాన్నించి సూర్యుని పొందేది ఇంద్రాణీ కళ), ఆమె పాదాలను పూజించే నన్ను రక్షించుగాక!

*22. గగన చరార్చిత పాదుకయా*
*పదనత సన్మతి బోధికయా ।*
*మమ సతతం శుచి రేణుకయా*
*పరవదిదం కుల మంబికయా ॥*

*23.* *శమయితు ముగ్రతమం దురితం*
*ప్రథయితు మాత్మ నిగూఢ బలం ।*
*గమయితు మగ్ర్య దశాం స్వకులం*
*తవచరణాంబుజ మంబ భజే ॥*

దేవతలందరూ పూజించే పాదుకలు కలిగి, పాదాలకు నమస్కరించినవారికి మంచి బుద్ధులనిచ్చే అంబికయైన ఆ రేణుక (ఇంద్రాణీదేవి) నా ఈ (భారత) కులాన్ని ఎల్లప్పుడూ శుచిగా ఉండేలా చూచుగాక! ఓ అంబా! తీవ్రమైన పాపాలను ధ్వంసం చేయడానికీ, ఆత్మబలాన్ని ప్రకటించడానికీ, స్వకులంలో (భారతదేశంలో, నా సుషమ్న నాడిలో) ఉచ్ఛదశను పొందడానికి నేను నీ పాదాలను సేవిస్తున్నాను.

*24.* *పరవశగా మశివేనవృతాం*
*భరతధరాం పరిపాతుమిమాం ।*
*పటుమతి వాక్క్రియ మాతనుతా*
*ద్గణపతి మగ్ర్యహయప్రమదా ॥*

ఇతరులకువశమైపోయి, అమంగళంతో కూడిన ఈ భారతభూమిని రక్షించ డానికి ఇంద్రాణీదేవి ఈ గణపతి (ముని) కి పటుతరమైన వాక్కునూ, క్రియనూ కలిగేలా చేయుగాక!

*25.* *గణపతిదేవ మహోంశజుషో*
*గణపతినామ కవి ప్రకవేః ।*
*సురపతి జీవసఖీ శృణుయా*
*ద్దశశత పత్రముఖీ సుముఖీః ॥*

విఘ్నేశ్వరుని తేజస్సును పొంది ఆ గణపతి నామాన్నే కలిగిన కవి వ్రాసిన ఈ సుముఖీ వృత్తాలను ఆ ఇంద్రాణీదేవి వినుగాక!

త్రైష్టుభం శతకంలోని నాలుగవదైన సుముఖీ స్తబకం ఇక్కడితో పూర్తి అయింది.

దీనితో ఇంద్రాణీ సప్తశతిలోని ఆరవదైన త్రైష్టుభం శతకం పూర్తి అయింది.



# 7. జాగతం శతకం

జాగతం శతకం అనేది ఇంద్రాణీ సప్తశతిలోని చివరిదీ, ఏడవదీ అయిన శతకం. ఈ జాగతం అనే శతకంలో ధృతవిలంబిత, జలోద్ధతగతి, ప్రమితాక్షర, సులలిత తామరస అనే 4 స్తబకాలు ఉన్నాయి. ఈ శతకంలో తొలి స్తబకం పేరు ధృతవిలంబిత స్తబకం. ఇందులో ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వునే వర్ణిస్తూ, ఆమె మన్మధుడికి జన్మనిచ్చిందనీ, ఇంద్రుడికి అర్ధాంగి అనీ, అటువంటి **ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు ప్రకాశించి తన మదిలోని చీకట్లను తొలగించుగాక!** అంటూ కవి తన శతకాన్ని ఆరంభిస్తాడు. ఈ మొదటి స్తబకంలోని మొదటి పది పద్యాలలోనూ ఆ తల్లికి దశావతారాలను గుర్తుచేస్తాడు.

## 7.1. ధృతవిలంబిత స్తబకం

*1.* *సురమహీరమణస్య విలాసినీ*
*జలచరధ్వజ జీవితదాయినీ ।*
*హరతు బోధదృగావరణం తమో*
*హృదయగం హసితేన సితేన మే ॥*

మీనధ్వజుడైన మన్మధుడికి జన్మనిచ్చి తల్లిగా, ఇంద్రుడికి అర్ధాంగిగా ఉన్న ఇంద్రాణీదేవి తన ప్రకాశవంతమైన చిరునవ్వుతో (మీనావతారానికి పోలిక) నా బుద్ధిని ఆవహించి, నా మదిలోని చీకట్లను తొలగించుగాక!

*2.* *నమదమర్త్య కిరీటకృతైః కిణైః*
*కమఠపృష్ఠనిభే ప్రపదేంకితా ।*
*పరిధునోతు శచీ భరతక్షితే*
*ర్వృజినజాల మజాలమకంపనం ॥*

నమస్కరించే దేవతల కిరీటాల తాకిడివల్ల కాయలు కాచిన శచీదేవి పాదాలు తాబేలుపై డిప్పతో సరిపోలి (కూర్మావతారానికి పోలిక) ఉన్నాయి. అటువంటి శచీదేవి, ఈ భారత భూమిలో ఎక్కువైపోయి, తొలగించడానికి వీల్లేకుండా పోతున్న పాపాలను వెంటనే నశింపజేయుగాక!

3. అతితరాం నతపాలన లోలయా
విబుధనాథ మనోహరలీలయా ।
కిరిముఖీ ముఖ శక్త్యుపజీవ్యయా ఽ
విదితయాఽ దితయా గతిమానహం ॥

వినయవంతులైన తన భక్తులను పాలించడంలో ఆసక్తిని చూపేదీ, ఇంద్రుడి చిత్తాన్ని దోచే విలాసం కలిగిందీ, వరాహముఖివంటి శక్తిమాతృకల స్వరూపాలకు జీవనాధారమైన, అవ్యక్త మహిమగల ఆదిమ స్త్రీ నాకు జ్ఞానాన్ని ప్రసాదించుగాక (ఇది వరాహావతారానికి పోలిక. వరాహమూర్తితో కూడిన ఆ మహాలక్ష్మి నన్ను సన్మార్గంలో పెట్టుగాక! అని ఇక్కడ కవి వరాహావతారాన్నే గుర్తు చేస్తున్నాడు)!

4. ఘనహిరణ్య మదాపహ రోచిషా
వనరుహాననయాఽ వన దక్షయా ।
గతిమదింద్ర మనోరథ నాథయా
భువనమేవ న మే కులమత్రకా ॥

హిరణ్య సంబంధమైన మదాన్ని హరించే ఘనమైన తేజస్సు గలదీ, పద్మముఖీ, రక్షణనివ్వడంలో దక్షురాలూ అయిన ఇంద్రాణీదేవి వల్ల ఈ భూమిపై నా కులం (దేశం, సుషమ్న) మాత్రమే కాక భువనమంతా జ్ఞానాన్ని పొందుతూంది (ఇక్కడ కవి నారసింహావతారాన్ని గుర్తుకు తెస్తున్నాడు).

5. తనుషు వామనమూర్తిధరే విభౌ
తమనుయా చ విరాజతి వామనీ ।
శరణవా ననయాంబికయా లస
త్కరుణయాఽ రుణయా పదయోరహం ॥

తన విభుడైన ఇంద్రుడు వామనావతారాన్ని ధరించినపుడు, అతన్ని అనుసరించి ఆమె వామనిగా వెలుగొందింది (మూర్తి చిన్నదైనపుడు అందులోని శక్తి సైతం చిన్నదవుతుంది - ఇక్కడ కవి వామనావతారాన్ని గుర్తుకు తెస్తున్నాడు.

అనంతాకాశంలో అనంతశక్తిగా ఉన్నా, ప్రతిమనిషిలో తిరిగీ శక్తిగా ఉండేలా చిన్న రూపాన్ని ధరించిందా దేవి). ప్రకాశించే దయగలదీ, ఎర్రని పాదాలున్నదీ అయిన ఆ ఇంద్రాణీ దేవిని నేను శరణు వేడుతున్నాను.

6. సకరుణా కుశలం మమరేణుకా
తనురజా తనుతా దుదితో యతః ।
యుధి ముని ర్వ్యదధౌ పరశుం దధ
జ్జనపతీ నపతీవ్ర భుజామదాన్ ॥

ఏ రేణుకాదేవికి పుట్టిన పరశువును ధరించిన ముని యుద్ధంలో రాజుల కుండిన తీవ్రమైన భుజగర్వాన్ని హరించిందో, దయామయియైన ఆ రేణుకాదేవి నాకు సంతోషాన్ని ఇచ్చుగాక (ఇది పరశురామావతారాన్ని గుర్తుచేసే శ్లోకం. ఐతే, ఇక్కడ పరుశువు అంటే గొడ్డలి కాదు. అది అస్త్ర విద్యన్నా అయుండాలి లేదా వేదభాషలో చెప్పే కపాల భేదనా వైభవాన్ని కలిగిన సుషమ్న అయినా అయుండాలి).

7. సుజన శత్రురమాధి ఘనధ్వనిః
శచి స రాత్రిచర స్తవ తేజసా ।
జనని రామసహోదర సాయకం
ప్రవిశతావిశతా దధికౌజసః ॥

అమ్మా! శచీదేవీ! శ్రీరాముడి తమ్ముడైన లక్ష్మణుడి బాణంలో ప్రవేశించి సూర్య తేజస్సు కన్నా వందల రెట్ల తేజస్సుతో నీ జ్యోతి సజ్జనులకందరికీ శత్రువైన (రావణుడి కొడుకైన) ఇంద్రజిత్తుని చంపింది (ఇది రామావతారాన్ని గుర్తుచేస్తుంది).

8. తవ మహః కళయాబలమాప్తయా
జనని శుంభనిశుంభ మదచ్ఛిదా ।
జగదరక్ష్యత గోపకులేశితు
స్తనుజయానుజయార్జునసారథేః ॥

ఓ తల్లీ! బలాన్ని పొంది, శుంభనిశుంభులనే రాక్షసుల మదాన్ని సంహరించి, గోకులంలో ప్రభువైన నందుడికి జన్మించి, మాయాదేవిగా శ్రీకృష్ణుడికే సోదరియై పుట్టిన నీ తేజస్సు కళ ఈ ప్రపంచాన్ని రక్షించింది (ఇది శ్రీకృష్ణావతార ఘట్టం).

9. న వినిరూపయితుం ప్రబభూవ
యాం కలిజనో వివిధం కథయన్నపి ।
ముని హృదంబుజ సౌధతతేందిరా
జయతి సా యతిసాధుజనావనీ ॥

ఈ కలికాలంలో జనాలు దేనిని గురించైతే ఎన్ని రకాలుగా చెప్పినా అర్థం

చేసుకోలేకపోతున్నారో, మునిహృదయ పద్మసౌధాలపై (సంగబుద్ధి రూపంలో) విహరిస్తూ యతులైన సాధువులను రక్షిస్తూ ఆ దేవి ప్రకాశిస్తూ ఉంది.

(బుద్ధి గురించి శక్తిని శుద్ధమైన బుద్ధి లక్షణాన్నిక్కడ బుద్ధావతారాన్ని వర్ణించారు కవి. ఇక్కడ వర్ణించిన దశావతారాల్లోని బుద్ధావతారం).

*10.* ఇమమయి త్రిదివేశ్వరి కల్కినం
రుషమపోహ్యా సవిత్రి విలోకితైః ।
సురపతే ర్ద్విషతోఽ ఘనతో లస
న్మదనకైరవ కైరవలోచనే ॥

ఓ త్రిభువనలోకేశ్వరీ! కోపాన్ని వదిలి ఇంద్రుడిని పరవశుని చేసే దృష్టితో పాపాత్ముడనైన నన్ను (భారతీయుని), పరమ పాపియైన ఆ శత్రువునుండి కాపాడు తల్లీ (కల్కి - కల్కము లేదా కపటం గలవారు. కల్కి అవతారాన్ని గుర్తుచేస్తుందీ శ్లోకం)!

*11.* స్మరదమర్త్య నృపాల విలాసినీం
ప్రబలపాతకభీతి వినాశినీం ।
ప్రవణయాంత రనన్య ధియా లస
ద్వినయయా నయ యామవతీర్మనః ॥

ఓ మనసా! ప్రబలమైన పాపభీతిని తొలగించే ఇంద్రాణీదేవిని నీ అంతరంగంలో నిశ్చలంగా, వినయంగా, అనన్యంగా ప్రకాశించే బుద్ధితో తలుచుకుంటూ రాత్రులు వెళ్లబుచ్చు.

*12.* భగవతీ గగనస్థలచారిణీ
జయతి సంగరరంగ విహారిణీ ।
సుకృత శత్రు మతిభ్రమ కారిణీ
హరిహయారి హయాది విధారిణీ ॥

గగనంలో సంచరించేదీ, యుద్ధంలో విహరించేదీ, పుణ్యం నుండి శత్రువుల మతి భ్రమింపజేసేదీ ఇంద్రుడి శత్రువులైన హయుడు మొదలైన రాక్షసులను సంహరించినదీ అయిన భగవతి ప్రకాశించుగాక!

*13. శరణవానహ మర్జునహాసయా*
*భువనభూపతిహారి విలాసయా ।*
*దివి పులోమజయా ధవళాచలే*
*గిరిజయాఽరిజయా వితదేవయా ॥*

తెల్లనైన నవ్వుతో ఇంద్రుడిని ఆకర్షించే విలాసంతో స్వర్గంలో ఇంద్రాణీ రూపిణి గా, ధవళాచలంలో (కైలాసంలో) గిరిజాంబగా ఉంది. శత్రువులను జయించి దేవత లను రక్షించిన ఆ అంబికను నేను శరణుపొందుతున్నాను.

*14. చరణయోర్ధృతయా విజయామహే*
*నయమ శేష జగన్నృప జాయయా ।*
*దివిపులోమజయా ధవళాచలే*
*నగజయా గజయానవిలాసయా ॥*

తన పాదాలవద్ద మమ్మల్ని శరణార్థులుగా కలిగిన ఆ తల్లి, స్వర్గంలో ఇంద్రాణి గానూ, కైలాసంలో పార్వతిగానూ ఉంది. ఏనుగు నడకను పోలిన గమన విలాసాన్ని (గజ గమన) కలిగిన ఆ దేవి వల్లనే మేమంతా ప్రకాశిస్తూ ఉన్నాం.

*15. అరివధాయ విధాయ బుధాధిపం*
*పటుభుజాబల భీషణమాజిషు ।*
*న భవతీ శచి గచ్ఛతి దుర్గతః*
*క్వచన కాచన కాతర ధీరివ ॥*

*16. సపది మానసధైర్యహృతో జగ*
*జ్జనని వజ్రతనోర్జ్వలితార్చిషః ।*
*అరిజనే ప్రథమం తవవీక్షయా*
*సురపతే రపతేజసి విక్రమః ॥*

ఓ శచీదేవీ! యుద్ధంలో శత్రువులను వధించడం కోసం దేవేంద్రుడ్ని సమర్థమైన భుజబలాన్ని కలిగినవాడిగా చేశావు. కానీ, నీవు మాత్రం ఒక పిరికిదానిలాగా కోటను దాటి ఎక్కడికీ పోవు (అంటే, శత్రు నాశనానికి నీ శక్తి చాలు. నీవు స్వయంగా వెళా ల్సిన పనిలేదు. పైకి పిరికిదానిలా కనిపిస్తావంతే! అని కవి చమత్కారం). అమ్మా, జగజ్జననీ, ప్రజ్వలించే తేజస్సుగల ఓ వజ్రశరీరిగా ఉన్న శత్రువును నీవు కేవలం తీక్షణంగా ఒకసారి చూశావంటే చాలు. బలహీనుడైపోతాడు. వాడికి ధైర్యం నశించి

పోతుంది. అప్పుడు దేవేంద్రుడు వాడిమీద తన భుజబలాన్ని చూపిస్తాడు.

> *17.* న మనసోచితమస్తి పరం నృణాం
> విబుధరాజవధూపద పద్మతః ।
> జగతి దర్శనయోగ్యమిహోఽపరం
> న రమణీ రమణీయ ముఖాబ్జతః ॥

> *18.* శరణవానహమస్మి పురాతన
> ప్రమదయా మునిగేయ చరిత్రయా ।
> స్వబలచాలిత నాకజగన్నభో
> వసుధయా సుధయా సురరాడ్దృశాం ॥

ఓ ఇంద్రాణీదేవీ! ఈ జగత్తులో మానవుల మనస్సులో తలవడానికి నీ పాదపద్మాలకంటే అర్హత కలిగింది మరొకటి లేదు. చూడటానికి రమణీయమైన నీ ముఖ పద్మాన్ని మించినది లేదు. మునులంతా కీర్తించే చరిత్ర కలిగి, స్వర్గ, మధ్య, పాతాళ లోకాలను (ఇక్కడ స్వర్గం అనేది దివ్య తేజోలోకం, ఆకాశం అనేది మధ్య లోకం, పాతాళమంటే భూమి అని అన్వయించుకోవాలి) నీ నిజబలంతో చలింపజేస్తూ, ఇంద్రుడి చూపులకు అమృతప్రాయమైన నిన్ను (ఇంద్రాణీదేవినే) నేను శరణు కోరు తున్నాను.

> *19.* అయమహం గతిమా నతి శాంతియా
> త్రిదివభూమిపతి ప్రియకాంతయా ।
> మనసి మే నిజనై రతి భక్తితః
> నిహితయా హితయా సుకృతాత్మనాం ॥

> *20.* వినయతః స్మృతయా గమయామ్యహం
> జనిమతాం దినయుత్రి నిశాస్త్వయా ।
> ప్రసృతయా కులకుండ ధనంజయా
> ద్భృతతనూ తత నూతన వేగయా ॥

> *21.* సకృదమోఘ సరసివతు సాధుధీ
> హృదయవేద్య పదాంబుజ సౌష్ఠవే ।
> మమ శివం సుమనః పృథివీపతే
> స్సువదనే వదనేత్రలసద్దయే ॥

22. దురవగాహపథే పతితం చిరా
జ్జనని గమ్య విలోకన లాలసం ।
స్వయ మమర్త్య నృపాలమనోరమే
సునయనే నయ నేయమిమంజసం ॥

ఓ శాంతిస్వరూపిణీ! పుణ్యాత్ములకు హితవు చేకూర్చేదీ, సంతత భక్తితో మనస్సులో ఉండే ఆ ఇంద్రాణీదేవి నన్ను జ్ఞానంగల వానిగా చేయుగాక. అమ్మా, కులకుండాగ్ని నుంచి ప్రసరించేదీ, కృశించిన శరీరాల్లో వినూత్నమైన వేగంతో వ్యాపించేదీ అయిన నీ కళ - వినయ విధేయతలతో స్మరింపదగినది. నీ కళతోనే (ఆ ధ్యానంతోనే) నేను ఈ రాత్రిళ్లను గడిపేస్తాను.

అందుచేత, ఓ దేవీ, ఒక్కసారైనా ఒక మంగళవాక్యాన్ని నాకు వేగంగా చెప్పు. దుర్లభంగా ఉండే ఈ మార్గంలో చిరకాలంగా పడిపోయి, గమ్యాన్ని చేరాలనే (నీ అనుగ్రహానికై) ఆసక్తి కలిగిన నన్ను (ఈ కవిని) ఆ స్థానాన్ని వేగంగా అందుకునేలా నీవే స్వయంగాచూడు.

23. అవతు నః స్వయమేవ పటూన్ విప
ద్వివధనాయ విధాయ బుధేశ్వరీ ।
సకలమర్మసు వీతదయైః పరై
ర్వినిహతానిహ తాపవతః శచీ ॥

విబుధేశ్వరి అయిన ఓ శచీదేవీ! నిర్దయులైన శత్రువులు మమ్మల్ని అన్ని మర్మస్థలాల్లోనూ కొట్టడంతో మేము దిగులుపడిపోయి ఉన్నాం. ఈ విపత్తులను నాశనం చేసేందుకు (తగిన శక్తినిచ్చి) మమ్మల్ని సమర్థులను గావించి స్వయంగా రక్షించమ్మా!

24. సురధరాపతి జీవితనాథయా
స్వజనవక్షితి రక్షణ కర్మణి ।
పటుతమో జన ఏష విధీయతా
మిహ తయా హతయాతు సమూహయా ॥

రాక్షసులగుంపును హతమార్చిన ఆ ఇంద్రాణీదేవి, ఈ భారతభూమిని రక్షించ డానికి ఈ మనుజుని సమర్థుని చేయుగాక!

*25. గణపతేః శృణుయాదిమముజ్జ్వలం*
*ద్రుతవిలంబితవృత్తగణం శచీ ।*
*సలిలరాజసుతా భవనీభవ*
*ద్భువనపావన పాదసరోరుహా ॥*

అన్ని సంపదలకూ నిలయమై, అన్ని లోకాలనూ పావనం చేసే పాదపద్మాలను కలిగిన శచీదేవి, ఈ గణపతి (ముని) వ్రాసిన ఉజ్జ్వలమైన ఈ ద్రుతవిలంబిత వృత్తాలను వినుగాక!

జాగతం శతకంలోని మొదటిదైన ద్రుతవిలంబిత స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



# 7.2. జలోద్ధతా స్తబకం

1. హరిత్సు పరితః ప్రసాదమధికం
దధానమమల త్విషాం ప్రసరణైః ।
మహేంద్ర మహిళా విలాస హసితం
మదంతర తమో ధునోతు వితతం ॥

స్వచ్ఛమైన కిరణాలను ప్రసరింపజేసి అన్ని దిక్కుల్లోని మలినాలను తొలగిస్తూ, తేజః ప్రసాదాన్ని అధికంగా ధరిస్తూ ఉన్న ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు, నా మనస్సులో (అంతర్యంలో) అలుముకుపోయి ఉన్న చీకట్లను తొలగించుగాక!

2. ప్రసూ స్త్రిజగతః ప్రియామఘవతః
కృపాకలితయా కటాక్ష కళయా ।
నితాంతమగతే ర్వికుంఠితమతే
ర్ధునోతు భరతక్షి తే రకుశలం ॥

ముల్లోకాలనూ కన్న ఇంద్రాణీదేవి, గతిలేక, అత్యంత దీనావస్థలో ఉండి, నష్టపోతూ ఉన్న ఈ భారతదేశపు దుస్థితిని తన (కన్నబిడ్డను అనుగ్రహించే తల్లిగా) కృపా కరుణాకటాక్ష కళతో తొలగించుగాక!

3. పురా శచి మతిస్త్వ మీశితు రథో
నభస్తను మితా పృథఙ్మతిమతీ ।
అనంతర మభూః సరోజ నయనా
తనుః సురప తేర్విలోచన సుధా ॥

ఈ విశాలమైన విశ్వ సృష్టికి మునుపు **సత్, చిత్,** ఆనంద స్వరూపుడైన ఈశ్వరుని **చిత్** వై ఉండిన నీవు ఈ విశ్వసృష్టి కోసం భూమాతవైనావు.

ఇక్కడ గణపతిముని ఆ దేవి ధరించిన నాలుగు రూపాల గురించి చెప్పారు. 1. కర్తయైన ఈశ్వరునిలో వేరుగా ఉండి తత్స్వరూపంలో ఉన్న **చిత్**, తానే రూపకర్తగా ప్రభుత్వ స్వరూపిణిగా మూలంలో ఉంది. 2. ఆపైన సృష్టి కోసం ఈశ్వర స్వరూపం తన మహిమతో వ్యాపించడంవల్ల అందులో ఈశ్వరుడినే కర్తగా చేయడానికి అహం, అహం అని స్ఫూర్తినివ్వడానికి **సగుణబ్రహ్మ** లక్షణంగా వెలుగొందింది. 3. తన మహిమ వెదజల్లే ఆ ఈశ్వరసంపదను ధరించేందుకు **ఆకాశశరీరిణి** అయిందామె. 4. ఆ తరువాత ఈశ్వర చైతన్యం లేక జడస్థితిని కలిగి ఆకాశ గర్భంలోఉండగా,

**అహం** అనే చైతన్యాన్ని ప్రవేశపెట్టి, మాతగా అనుగ్రహించి, ఆ ఇంద్రుడికి కనువిందు చేసే పద్మ నేత్రగా, ఇంద్రాణీదేవిగా అయింది. ఇదీ ఆ ఇంద్రాణీదేవి అనుగ్రహా దేవతా స్వరూపం.

4. *పరత్ర విగుణా సతోఽసి ధిషణా*
*నభస్తనురిహా ప్రపంచ మవసి ।*
*అసి స్వరబలా ప్రయా సురపతే*
*రియత్తవ శచి స్వరూప కథనం ॥*

పరాకాశ రూపంలో గుణంతో కూడక నీవు 'సద్' రూపునకు బుద్ధిలక్షణ వయ్యావు (ఇదే కర్త ప్రచురణ బుద్ధి). ఇక్కడ ఉన్న ఆకాశ శరీరంతో ప్రపంచాన్ని పోషిస్తూ రక్షిస్తూ ఉన్నావు. స్వరమనే గుణానికి బలాన్నిచ్చే ప్రాణేశ్వరిగా నీవు స్వర్గంలో ఇంద్రుడి ప్రియురాలవైనావు. ఓ శచీదేవీ! నీ స్వరూపం వెనుక కథ ఇదీ!

5. *ప్రజాపతిపదే పురాణపురుషే*
*స్మృతా త్వ మదితిః సురాసురను తే ।*
*జనార్ధన పదే రమాసి పరమే*
*సదాశివపదే శివా త్వమజరే ॥*

6. *ఉషా ఇనపదే స్వధానలపదే*
*పురందరపదే త్వమీశ్వరిశచి ।*
*యథా రుచి విదుః పదాని కవయ*
*శ్శ్రుతిశ్చ చితిమా న్యువామృజుగిరా ॥*

7. *అమేయ మమలం పురాణ పురుషం*
*తదీయ విభవాభిదాయిభిరిమే ।*
*వదంతి కవయః పదైర్బహువిధై*
*స్తథైవ భవతీం తతో మతభిదా ః ॥*

దేవ దానవులను బ్రోచే తల్లీ! పురాణ పురుషుడైన ప్రజాపతి స్థానంలో నీవు **అదితి**గా, ఉత్కృష్టమైన జనార్దనుని స్థానంలో నీవు **లక్ష్మి**గా, నాశరహితుడైన పరమ శివుని స్థానంలో నీవు **శివ** (గౌరి) గా ఉన్నావు. సూర్యుని స్థానంలో నీవు **ఉష**గా, అగ్ని స్థానంలో **స్వధ**గా, ఇంద్రుడి స్థానంలో **శచి**గా – ఇలా ఆయా స్థానాల్లో నిన్ను సముచితంగా కవులు వర్ణించారు. వేదవాక్కులో మీరిద్దరూ జ్ఞానానికి తండ్రిగా,

జ్ఞానంగా ఉంటారు. అమేయుడూ, చింతల్లేనివాడూ అయిన ఆ ఇంద్రుడిని కవులు అతనికి సంబంధించిన వైభవాలను తెలిపే పదాలతో పిలుస్తున్నారు. అందువల్ల నీ స్థానాన్నిబట్టి నిన్నూ అలానే పిలుస్తున్నారు. ఆ పేర్లలోని తేడావల్లనే నిన్ను ఆ విధంగా తలిచారే తప్ప మరేమీ లేదు.

*8.* నభశ్చపవనః స్వరశ్చ పరమ
స్తటీచ్ఛ వితతా పతిశ్చ మహసాం ।
సుధాంశురనలో జలంచ పృథివీ
సవిత్రి యువయో ర్విభూతిపటలీ ॥

ఓ సవిత్రీ! ఆకాశం, గాలి, పరావాక్కు వ్యాపించిన మెరుపూ(లేదా విద్యుత్తూ), సూర్యుడూ, చంద్రుడూ, అగ్నీ, నీరూ, భూమీ – ఇవన్నీ మీ ఇద్దరి ఐశ్వర్య స్వరూపమే తప్ప వేరొకటి కాదు.

*9.* అపార బహుళ ప్రమోదలహరీ
సతః కిలచితిః పరత్ర వితతా ।
పునర్వియదదిం పరీత్య నిఖిలం
జగంతి దధతీ పరా విజయతే ॥

*10.* నయద్యపి పరాత్పరే నభసితే
సరోజనయనా వపుః పృథగజే ।
తధాపి సమతాంమతీ రనుసుర
న్యమేయ విభవే దధాసిచ తనూః ॥

అతి విపులంగా, ఆనంద లహరిగా పరలోకంలో సద్వస్తువు నుండి వ్యాపించిన 'చిత్', తిరిగి అనంతమైన ఈ ఆకాశంలో వ్యాపించి, ఈ జగత్తును ధరిస్తూ ఉంది. అటువంటి పరాశక్తి ప్రకాశించుగాక (పైన 4వ శ్లోకంలో చెప్పిన శచీదేవి స్వరూపం వెనుక కథ ఇదేనని మనం గ్రహించాలి)!

ఓ పరాత్పరా! ఆ కారణంవల్ల ఆకాశమూ, నీ పద్మనేత్ర శరీరమూ వేర్వేరు కాదు. అయినా సరే. ఎవరు ఎలా తలిస్తే వారికి అలా దర్శనమిస్తావు. అంతే (శక్తి రూపమొక్కటే. దేవుడొక్కడే. ఎంత మాత్రమున ఎవ్వరు తలిచిన – అన్న అన్నమయ్య కీర్తించిన రీతి కూడా ఇదే)!

11. సహ(త్రిభువన (ప్రపాలన కృతా
సమస్తమరుతాం గణస్య విభునా ।
సదా శశి ముఖీ శరీర భృదజా
జగత్యదురితే శచీ విజయతే ॥

12. కులం బహు భిదం బలం నభుజయోః
కథంను విపద స్తరీమ భరతాః ।
సమర్థ మధునా విపద్విధుతయే
తవాంబచరణం (వ్రజామిశరణం ॥

ముల్లోకాలను పాలిస్తూ, సకలదేవతలకూ (ప్రభువైన ఇం(ద్రుడితో సహా చం(ద్రముఖియై, పుట్టుకే లేని శరీరధారిణియైన శచీదేవి స్వర్గమనే పాపరహితమైన లోకంలో సదా (ప్రకాశిస్తూ ఉంది. నేడు ఈ భారతజాతి అనేక భేదాలు కలిగి ఉంది. భుజబలం అసలు లేదు. ఇక ఈ భారతీయులు విపత్తులనెలా దాటగలరూ? అందువల్ల ఓ తల్లీ! ఇపుడు ఈ ఆపదను తొలగించడానికి సమర్థమైన నీ పాదాలను నేను ఆ(శయిస్తున్నాను.

13. సమస్తమపిచ స్వదేశ విదుషాం
విధానపటలం బభూవ విఫలం ।
అభాగ్య దమన క్షమం తదధునా
తవాంబచరణం (వ్రజామిశరణం ॥

స్వదేశంలోని పండితులంతా కలిసికట్టుగా కూడి ఎన్ని ఉపాయాలను చేసినా, విఫలురై పోయే పరిస్థితి నెలకొంది. కాబట్టి ఈ దౌర్భాగ్యాన్ని తొలగించడానికి నాకేదైనా ఒక కొత్త ఉపాయాన్ని ఇవ్వమని నీ పాదాలను వేడుతున్నాను.

14. నిజో మమజనో నితాంతమగతి
ర్న కుక్షి భరణే వ్యయం (ప్రభవతి ।
మహేశ్వరి కృపా మరంద మధునా
తవాంబచరణం (వ్రజామిశరణం ॥

ఓ మహేశ్వరీ! నా (దేశ) (ప్రజలు అంతులేని దుర్గతిని పొంది, వారి పొట్టపోసు కోవడానికి కూడా వీల్లేనంత బలహీనమైనస్థితిలో ఉన్నారు. ఓ తల్లీ! ఇపుడు నీ దయామకరందం కోసం, నేను నీ పాదాలను ఆ(శయించి శరణు కోరుతున్నాను.

15. అదృష్ట కనకం కులం మమ చిరా
న్ని రాయుధమిదం నిరాశమభితః ।
స్వభావత ఇవ ప్రభుద్ధమభవ
త్తవాంబచరణం వ్రజామిశరణం ॥

16. అవీర చరితం విపాలక కథం
నిరార్ష విభవం చిరాన్మమకులం ।
ఇదం మమమనో నికృంతతి ముహు
స్తవాంబచరణం వ్రజామిశరణం ॥

17. చిరాత్స్మృతిపథాదపి చ్యుత మజే
తపోబలభవం తమార్ష విభవం ।
స్వదేశమధునా పునర్గమయితుం
తవాంబచరణం వ్రజామిశరణం ॥

బంగారం అదృశ్యమైన నా ఈ (భారత) కులం చాలాకాలంనుండీ నిరాయుధమై, అన్నిటా నిరాశ పొందింది (నాలో యోగశక్తి తగ్గిపోయింది అని కూడా ఇక్కడ చెప్పుకోవచ్చు). అమ్మా! స్వభావం చేతనే మేల్కొన్నట్లు ఉన్న బుద్ధితో, వికాసంకోసం నీ పాదాలను శరణువేడుతున్నాను. వీరుల చరిత్ర నశించి, పరిపాలకుల కథ పోయి, ఋషి వైభవమే శూన్యమైన నా ఈ భారతకులం చాలాకాలంగా నా మనస్సును మాటిమాటికీ వేధిస్తూ ఉంది. అందుకే, నీ పాదాలను శరణువేడుతున్నాను. చాలా కాలంగా నిజ స్మృతిమార్గాన్నుండి భారతీయ ఋషివైభవం పక్కదారి పట్టిపోయింది. తపోబలంవల్లకానీ పుట్టని ఋషివైభవాన్ని ఇపుడు తిరిగి నా స్వదేశం పొందేలా చూడు. దానికోసం నేను నీ పాదాలను శరణు వేడుతున్నాను.

18. హతంచ విహతం ధుతంచ విధుతం
రుదంత మభితో విశిష్ట కరుణే ।
ఇమం స్వవిషయం శివం గమయితుం
తవాంబచరణం వ్రజామిశరణం ॥

19. క్షయాయ సుకృత ద్విషాం విహరతాం
శివాయచ సతాం ప్రపంచ సుహృదాం ।
నిజస్య మనసో బలాయచ పరే
తవాంబచరణం వ్రజామిశరణం ॥

*20. జయతు సుకృతం ద్విషతు పరితః*
*సతామపి కులే బలేన రహితే ।*
*ఖలప్రియయుగే కలౌ పరిణతే*
*తవాంబచరణం వ్రజామిశరణం ॥*

కరుణామయీ! నా ఈ దేశాన్ని శత్రువులు కొట్టి, అణిచివేసి, కదిలించివేసి, కల్లోలానికి గురిచేశాయి. భారతమాత రోదిస్తూ ఉంది. నా భారతదేశం తిరిగి మంగళ మయం కావాలి. ఓ పరాదేవీ! విచ్చలవిడిగా విహరిస్తున్న ఈ పాపాత్ములను నాశనం చేయడం కోసం, ప్రపంచానికి మిత్రులైన సత్పురుషులకు శుభం కలగడం కోసం, మా మనోబలాన్ని మేము పొందాలి. అన్నిచోట్లా పాపాత్ములే విజయాన్ని పొందుతూ ఉన్నారు. పుణ్యాత్ములు బలహీనులై పోతున్నారు. దుర్మార్గులకే ప్రియమైన ఈ కలి యుగం పక్వమై ఉంది. నీవు మాత్రమే ఈ కాలాన్ని మార్చగలవని, నేను నీ పాదాలను శరణు వేడుతున్నాను.

*21. అభాతి సుకృతే నిగూఢ విభవే*
*విభాతి దురితే ఫలాని దిశతి ।*
*విధాన వికలే మనస్య భయదే*
*తవాంబచరణం వ్రజామిశరణం ॥*

*22. పటౌ ప్రతిభటే గదే ప్రతిభయే*
*న తావన విధావతీవ నిపుణం ।*
*సుపర్వ భువన క్షితీశదయితే*
*తవాంబచరణం వ్రజామిశరణం ॥*

*23. అమర్త్య పటలీ కిరీట మణిభా*
*భుజంగ కిరణం నితాంతమరుణం ।*
*విపత్తి దమనం తమః ప్రశమనం*
*తవాంబచరణం వ్రజామిశరణం ॥*

నిగూఢమైన వైభవం కలిగిన పుణ్యాలు ప్రకాశించడం లేదు. కానీ ఫలాలనిచ్చే పాపాలు ప్రకాశిస్తున్నాయి. అందువల్ల నా మనస్సంతా వికలమైపోయింది. శత్రువు బలశాలి. రోగం భీకరం. నీకు మొక్కుతున్న వారిని రక్షించే నైపుణ్యం నీకుంది. అమ్మా, దేవతలంతా కిరీట మణికాంతులనే కుండలినీ కిరణాలను పొంది, బాగా ఎర్రగా ఉండి, విపత్తులను తొలగించి, అజ్ఞానాన్ని తొలగించేవే నీ పాదాలు. అటువంటి

నీ పాదాలను నేను శరణు వేడుతున్నాను.

*24.* వినష్టవిభవా మిమాం పునరపి
శ్రియావిలసితాం విధాతుమజరే ।
స్వజన్మపృథినీం స్వరీశదయితే
దిశేర్గణపతేః కరాయపటుతాం ॥

ఓ ఈశ్వరీ! వైభవాన్ని కోల్పోయిన నా ఈ జన్మభూమిని తిరిగి లక్ష్మీప్రదం చేయడానికి ఈ గణపతి (ముని) చేతులకు బలాన్నివ్వు.

*25.* సుపర్వ వసుధాధి నాథసుదృశో
జలోద్ధతగతి స్తవోయమనఘః ।
కృతిర్గణపతేః కరోతు విధుతిం
భయస్య భరతక్షమాతల జుషాం ॥

ఇంద్రాణీదేవి మీద గణపతి (ముని) రచించిన నిర్దుష్టమైన జలోద్ధత గతి కలిగిన ఈ శ్లోకాలు భారతదేశ ప్రజల భయాన్ని పోగొట్టి వారిని రక్షించుగాక!

జాగతం శతకంలోని రెండవదైన జలోద్ధతా స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



# 7.3. ప్రమితాక్షర స్తబకం

1. ఉదితం మహేంద్రమహిళా వదనే
ప్రసృతం కరైర్దిశిదిశి ప్రగుణైః ।
అహితం తమః ప్రశమయ ద్యమినాం
హసితం కరోతు మమభూరిశివం ॥

ప్రతి దిక్కునూ తన విశేష కాంతులతో ప్రకాశవంతంగా జేసే ఆ ఇంద్రాణీదేవి చిరునవ్వు నాలోని అతితీవ్రమైన అమంగళమైన చీకట్లను తొలగించి, నాకు అధిక మంగళాలను ఇచ్చుగాక!

2. భరతక్షి తే స్తిమిర మాశుహర
త్వరిచాతురీకృత విమోహమతేః ।
రవిలక్షతో ప్యమధికమంశుమతీ
పవిపాణి చిత్తదయితా వనితా ॥

3. శశిలక్ష శీతలకటాక్ష సుధా
తరుణార్కకోటి రుచిపాదయుగా ।
హృది మే విభాతు మునిగేయగుణా
విబుధేంద్ర చిత్తరమణీ తరుణీ ॥

లక్ష సూర్యులనుంచి వచ్చే కాంతికన్నా ఎన్నోరెట్లు అధికమైన కాంతులు గల ఇంద్రాణీదేవి, శత్రువుల చాతుర్యం అనే మోహంలోపడిన ఈ భారతభూమి మోహాంధ కారాన్ని వెంటనే తొలగించుగాక! లక్ష చంద్రులనుంచి వచ్చే చల్లని వెన్నెలకన్నా ఎన్నోరెట్లు అధికమైన కాంతులు గలదీ, కోటి సూర్యప్రభలతో కూడిన పాదాలు కలిగిందీ, మునులంతా కీర్తించేదీ, ఇంద్రుడి చిత్తాన్ని రంజింపజేసేదీ అయిన స్త్రీ (ఇంద్రాణీదేవి), నా హృదయంలో ప్రకాశించుగాక!

4. కమనీయదీప్త సుకుమార తను
ర్మననీయ పావనపదాంబురుహా ।
విదధాతు మే శివ మసద్విముఖీ
విబుధేంద్ర జీవితసఖీ సుముఖీ ॥

కళ్లకు ఇంపైన కాంతితో ప్రకాశించే సుకుమారమైన శరీరం కలదీ, స్మరింప దగిన పాదాలు కలదీ, ఇంద్రుడికి ప్రాణసఖీ, సుముఖురాలూ, అసత్యవాదులకు

విముఖురాలూ అయిన ఆ (ఇంద్రాణీ) దేవి నాకు శుభాలొసగుగాక!

5. అనుమాన మూఢ పితృవాఖ్యవశా
త్తనయేన దేవి వినికృత్తశిరాః ।
తవ రేణుకా విలసితాకళయా
గణనీయశక్తి రభవద్దశసు ॥

6. సకలామయప్రశమనం దురిత
క్షయకారి కాంక్షింతకరంచ భవేత్ ।
సురసుందరీ జనసమర్చితయో
ర్హృది రేణుకా చరణయోః కరణం ॥

ఓ తల్లీ! భార్యను అనుమానించిన జమదగ్ని మూఢవాక్యం వల్ల పరశురాముడు తన తల్లి (రేణుక) శిరస్సును ఖండించాడు. అటువంటి రేణుకలో నీకళ ప్రకాశించే టప్పటికి, ఆమె చెప్పుకోదగ్గ శక్తి (రూపిణి) అయింది (అలా ఆ రేణుక ఇంద్రాణీదేవి అవతార స్వరూపిణి అయింది). దేవతలంతా పూజించే రేణుకాదేవి పాదాల సేవ (లేదా ధ్యానం) సకల రోగాలనీ పోగొడ్తుంది. సకల పాపాలనీ హరించి వేస్తుంది. మనోవాంఛలను సిద్ధింపజేస్తుంది (ఈ ఇంద్రాణీ సప్తశతి పారాయణ ఫలం అటువంటిదే అని మనం ఇక్కడ గ్రహించాలి).

7. వినిహంతి పాపపటలం స్మరణా
ద్విధునోతి రోగనివహం భజనాత్ ।
విదధాతి వాంఛితఫలం స్తవనా
న్మనుజస్య రామజననీ చరణం ॥

పరశురాముని తల్లి అయిన ఆ రేణుక పాదాలను స్మరించడం వల్ల మనుష్యుల పాపాలు తొలగిపోతున్నాయి. వాటిని పూజించడంవల్ల అనుకున్న ఫలితాలు కలుగు తున్నాయి.

8. శరణం వ్రజామి నవరవ్యరుణం
చరణం తవాంబ నృపజాతిరిపోః ।
భరతక్షితే రవనతః ప్రథమం
మరణం మమేహ నభవత్వధమం ॥

9. స్మరణం చిరాదవిరతం విదధ
చ్ఛరణస్య తే తరుణభానురుచః ।
అయమస్తు రామజనయిత్రి పటుః
సురకార్య మార్యవినుతే చరితుం ॥

ఓ రేణుకాదేవీ! మొదటగా ఈ భారతభూమి శ్రేయస్సును కోరి చేతులు జోడించి (ఆ దేవిని సేవించే) నేను, బాలభానుడిని పోలి ఉండే నీ చరణాలను శరణు పొందుతున్నాను. నాకు (ఈ దేశవిముక్తి పోరాటంలో) నీచమైన చావు రాకుండు గాక! భారతీయులకు పూజనీయమైన రామజననీ! బాలభానుని మాదిరి ప్రకాశించే నీ చరణాన్ని ఎంతో కాలం నుంచీ నిరాటంకంగా స్మరిస్తున్న నన్ను ఈ దేవకార్యంలో పాల్గొని నిర్వహించే సమర్థతను పొందేలాగా చేయి.

10. అవ భారతక్షితి మమోఘ దయే
కరణం భవత్విహ తవైషజనః ।
నిజయోః సవిత్రి చరణాంబుజయో
ర్న విహాతుమర్హ సి చిరాద్భుజకం ॥

11. అవిశ స్త్వమింద్రదయితే కిలతా
మపి యజ్ఞ సేన తనయాం కళయా ।
అనఘవ్రతా సుకవయః ప్రథమాం
ప్రవదంతి యాం బహుళవంద్యగుణాం ॥

12. భువి భారతంపరతి యః సుకృతీ
కలుషం ధునోతి సకలం కిల సః ।
ఇయమంబ శక్తికులరాజ్ఞి తవ
ద్రుపదస్యనందిని కథా మహిమా ॥

13. అభిమన్యుమాతర మనల్పగుణా
మతిలంఘ్య చైక్షత హరి ర్భవతీం ।
అతి సౌహృదేన యదిహార్యనుతే
తవ హేతు రీడ్యతమ శక్తికళా ॥

అమోఘమైన దయను కురిపించే ఓ దయామయీ, ఈ భారతభూమిని రక్షించు. అందుకు నన్ను సాధనంగా చేయి. నీ నిజ (పాద) పద్మాలను ఎంతో

కాలంగా పూజిస్తూ వస్తున్న నన్ను విస్మరించకు. పూజ్యనీయమైన సకల గుణరాశియని ఎవరినైతే కవులు పతివ్రతల్లో ప్రథమురాలనీ, శ్రేష్ఠురాలనీ పొగడుతున్నారో, ఆ ద్రౌపదిలో కూడా నీ కళ ప్రవేశించింది కదా (రేణుకా శిరస్సును ఖండించినపుడు ఆమెలో ఆవేశించినట్లే, ద్రౌపది పరాభవాన్ని పొందిన సందర్భంలో ఇంద్రాణీ శక్తి ఈమెలో ఆవేశించింది)! పుణ్యాత్ముడైన వాడు ఈలోకంలో భారతాన్ని ఎవడైతే పఠిస్తాడో, వాడు అన్ని పాపాలనూ కడిగేసుకుంటాడు. ఓ అంబా! ద్రౌపదీ! ఇదంతా నీ కథ మహిమే కదా! భారతీయులకు పూజనీయురాలైన ఓ ద్రౌపదీ! శ్రీకృష్ణుడు సుగుణాల రాశియైన తన చెల్లెలు సుభద్రకన్నా నిన్ను ఎంతో ప్రేమగా చూసిన విషయానికి కూడా (పొగడదగిన) నీ శక్తి కళనే కారణమై ఉండాలి.

14. *గృహకార్యతంత్ర చతురాగృహిణీ*
*సకలేంద్రియామృతఝరీ రమణీ ।*
*వరనీతి మార్గకథనే సచివో*
*పృభవస్త్వమంబ కురువంశభృతాం ॥*

15. *న యుధిష్ఠిరస్య వరఘోరతపో*
*న ధనంజయస్య పటుబాహుబలం ।*
*అరిసంక్షయం కృతవతీ బహుళం*
*తవవేణికాఽపచరితా ఫణినీ ॥*

16. *అసితాపి కాంతి వసతి ర్మహతీ*
*వనితాజనస్యచ విమోహకరీ ।*
*కుశలం మమాభ్రవతిశక్తికళా*
*ద్రుపదక్షి తీంద్ర దుహితా దిశతు ॥*

ఓ తల్లీ! ద్రౌపదిగా నీవు పాండవులకు భార్యవై, ఇంటి పనులు చక్కబెట్టడంలో చతురతను కలిగి, అన్ని ఇంద్రియాలకూ అమృతఝరిలాటి రమణిగా నీతిమార్గ కథనంలో ముఖ్య నాయికవయ్యావు. (మహాభారత యుద్ధంలో) శత్రునాశనం చేసింది ఆ ధర్మరాజు చేసిన తపస్సు కాదు, అర్జునుడి పటుతరమైన బాహుబలం కాదు. కేవలం(దుష్ట దుశ్శాసనుడు) అపచారం చేసిన ఆ నల్లని పామును పోలిన నీజుట్టు (వేణీ పన్నగం - పామును బోలిన జడ) మొత్తం శత్రువులనంతా నాశనం చేసేసింది. నల్లనిదైననూ, కాంతివంతమై, ఎంతో మహిమ కలిగి స్త్రీ జనాన్ని మోహింపజేసిన ఆ ద్రౌపదీదేవి ఇంద్రశక్తి కళాభరితమై నాకు క్షేమాన్ని కలుగజేయుగాక (ఇక్కడ

ద్రౌపదీదేవిని ఇంద్రాణీశక్తితో కవి పోల్చడం ఎంతైనా సమంజసమే! ఎందుకంటే అర్జునుడు ఇంద్రుడి అంశగలవాడు. అందువల్ల ద్రౌపదిలో ఉన్నది ఇంద్రాణీ అంశనే. సందేహం లేదు).

*17. శిరసా సమస్తజనపాపభరం*
*వహతాఽభయాయ భువియా మవృణోత్ ।*
*అమరాధిపః పతితపావని తాం*
*భువి కన్యకాం తవ వివేశ కళా ॥*

ఓ పావనీ! సమస్తజనుల పాపభారాన్ని వహించి శిరస్సుకు సంబంధించి ఏ వేణి (జడ) లో (కృష్ణుడైన) ఇంద్రుడు అభయం ఇవ్వడానికి భూమిమీద కారణమ య్యావో, ఆ జడ కలిగిన కన్యకలో భూమిపై నీకళే ప్రవేశించింది (ధర అంటే భూమి అనీ, మెదడు అనీ అర్థం ఉంది. అందువల్ల ద్రౌపది శిరస్సు సమస్త ప్రజల భారాన్ని వహించే భూమికి ప్రతీక అయింది. అభయమిచ్చిన ఆ నల్లని జడ భూమిమీద పాపాలతో పీడించబడుతున్న కోట్ల సంఖ్యలో ఉండే జనాభాను సూచిస్తుంది. ఆవిధంగా నిరూపించే లక్షణాలను శిరస్సులో తన జడలో పొంది పుట్టిన ద్రౌపదికి అభయాన్నిచ్చి నపుడు ఆమెలో ఇంద్రాణీ కళ ఆవహించిందన్నమాట. అలాంటి ఆవేశావతరణానికి ఉపాధి కావడానికి పుట్టిన పవిత్ర వ్యక్తి ఆ ద్రౌపది అని కవి వర్ణించడాన్ని మనం ఇక్కడ అర్థం చేసుకోవాలి).

*18. కళయా తవాతిబలయా కలితా*
*పురుషస్య యోగమఖిలాంబ వినా ।*
*అఖిలేశ్వర ప్రహితతేజ ఇయం*
*సుతజన్మనే కిల దధావనఘా ॥*

*19. సురరక్షకస్య మదయిత్రి దృశాం*
*నరరక్షకస్య జనయిత్రి పరే ।*
*కులరక్షణాయకృతబుద్ధిమిమం*
*కురు దక్ష మద్భుతపవిత్ర కథే ॥*

ఓ అఖిలాండేశ్వరీ! అత్యంతబలం కలిగిన నీ కళతో కూడిన అనఘ చరిత్రు రాలైన ఆ రేణుకాదేవి వేరే పురుషావతరణం లేకుండానే ఆ పరమపురుషుడైన అఖిలేశ్వరుని తేజస్సును కలిగి ఉన్నట్లు ఆ తేజాన్ని తన కుమారునిలో పొందగలిగింది. నరులందరినీ రక్షించే తల్లిగా నీవు, కులరక్షణలో బుద్ధికలిగి ఉన్న నన్ను (అంటే ఈ

కవిని, ఈ కుమారుని) సమర్థునిగా చేయి.

> 20. ముముచః కులే మమ సుపర్వపతే
> స్తవచాభిదేయ మిహ మందధియః ।
> అపరాధమేత మతిఘోర తరం
> జనని క్షమస్వ మమవీక్ష్య ముఖం ॥

ఓ తల్లీ! ఈ దేశంలోని మూఢులైన భక్తజనులు ఇంద్రనామాన్నీ, నీ నామాన్నీ విడిచి పెట్టారు. ఇది ఘోరమైన అపరాధమే! ఐతే, నా ముఖాన్ని చూసి నీవు వారందరినీ క్షమించు!

> 21. ఇహ శారదేతి యతిభిర్వినుతా
> ప్రథితాసురేశ్వర మనోదయితా ।
> భువిభాతి కీర్తి వపుషా శచి యా
> సుకథాపి సా తవ సవిత్రి కళా ॥

ఓ శచీదేవీ! ఈ లోకంలో **శారద** అని యతులంతా ఏ దేవినైతే కీర్తిస్తున్నారో, ఇంద్రుడి భార్యగా ఎవరైతే ప్రకాశిస్తున్నారో, శుభ చరిత్ర కలిగిన ఆమె కూడా నీ కళగానే ఉంది (ఆదిశంకరాచార్యులవారు శారద అని విద్యారూపిణిగా అమ్మవారిని ప్రతిష్ఠించారు. అమె సైతం ఇంద్రాణీదేవి కళే అని కవి భావన).

> 22. అరుణాచలేశ్వరదరీ వసతే
> స్తపతో మునేర్గణపతేః కుశలం ।
> వివిధావతార విలసచ్చరితా
> వితనోతు సా విబుధరాడ్వనితా ॥

వివిధ అవతారాల్లో ప్రకాశించే చరిత్ర గల ఇంద్రాణీదేవి, అరుణాచలేశ్వర గుహను నివాసంగా చేసుకుని, అక్కడ తపస్సు చేస్తున్న ఈ గణపతి (ముని) ని కాపాడుగాక.

> 23. అరుణాచలస్య వరకందరయా
> ప్రతిఘోషితం కలుషహారి యశః ।
> విభుధాధినాథరమణీ శృణుయా
> ద్గణనాథగీతమతిచారు నిజం ॥

ఓ రమణీ! అరుణాచలగుహలో ప్రతిధ్వనించే ఈ కథాస్తవం కలుషాన్ని హరించడం కోసం గణపతి (ముని) వ్రాశాడు. ఇది సుందరమై (చారుతరమై), నిజమై, నీ యశస్సుకు సంబంధించినదై నీవు విందువుగాక!

24. *భరతక్షి తేః శుభవిధాయితషు సా*
*విబుధక్షి తీశదయితా దయయా ।*
*ధనశక్తి బంధుబలహీనమపి*
*ప్రథమం కరోతు గణనాథమునిం ॥*

ఆ ఇంద్రాణీదేవి ధన, శక్తి, బంధు, బలాలన్నిటిలో హీనుడై ఉన్న ఈ గణపతి (ముని) ని కృపతో జూసి ఈ భారతదేశానికి శుభాలను చేకూర్చేవారిలో ప్రథమునిగా జేయుగాక!

25. *ముదితామిమా విదధతు ప్రమదాం*
*త్రిదివాధిపస్య నిపుణశ్రవణాం ।*
*అమిత ప్రకాశగుణశక్తిమజాం*
*ప్రమితాక్షరాః సుకవిభూమిపతేః ॥*

చక్కని కవిరాట్టైన ఈ గణపతి (ముని) వ్రాసిన ప్రమితాక్షర వృత్తాలను అధిక కాంతి గుణ శక్తులు కలిగిన ఇంద్రాణీదేవి సంతోషంగా, నేర్పుగా వినేలాగా చేయుగాక!

జాగతం శతకంలోని మూడవదైన ప్రమితాక్షర స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.



## 7.4. సులలిత తామర స్తబకం

1. దిశతు శివం మమ చంద్రవలక్ష
స్తిమిరసమూహా నివారణదక్షః ।
కృతగతి రోధక పాతక నాశః
సురధరణీశవధూ స్మితలేశః ॥

చంద్రుడిలాగా తెల్లగా ఉండేదీ, చీకట్లను సమర్థవంతంగా తొలగించేదీ, ఎన్నిజన్మల పాపాలనైనా ఇట్టే నశింపజేసేదీ – ఆ ఇంద్రాణీదేవి మందహాసం. అటు వంటి మందహాసంలో కొద్ది భాగమైనా సరే నాకు శుభాలనిచ్చుగాక!

2. అవిదిత మార్గతయాతి విషణ్ణాం
గతిమపహాయ చిరాయ విషణ్ణాం ।
భరతధరా మని మేష ధరిత్రీ
పతి గృహిణీ పరిపాతు సవిత్రీ ॥

ఇంద్రుడి రాణిగా ఉన్న సవిత్రి – శోకంలో మునిగిపోయి, చాలాకాలంగా దారితప్పి స్తంభించిపోయి ఉన్న భారత భూమిని రక్షించుగాక!

3. భువన మిదం భవతః కిల పూర్వం
యదమలరూపమనాకృతి సర్వం ।
ప్రకృతిరియం కురు తాద దరిద్రా
మతిమతి శాతతరాం మమ భద్రా ॥

ఈ భూమిని సృష్టించడానికి పూర్వం ఏదైతే నిరాకారంగా, నిర్మలంగా సర్వత్రా ఏది ఉండేదో, అటువంటి మంగళప్రదమైన ప్రకృతి (పర దేవత) నా బుద్ధిని తీక్షణం చేయుగాక!

4. సృజతి జగంతి విభై పరమే యా
సు బహుళ శక్తిరరాజత మాయా ।
ప్రదిశతు సా మమ కంచన యోగం
ఝటితి నిరాకృత మానసరోగం ॥

ఈ జగత్తును సృజిస్తూ, ఇంద్రుడిలో అధికశక్తి గల ఏ మాయ ప్రకాశిస్తూందో ఆ మాయ నా మనస్సులోని రోగాలను తొలగించి నాకు మాటల్లో చెప్పలేని (అనిర్వాచ్య

మైనట్టి) యోగాన్ని ప్రసాదించుగాక!

5. ప్రతి విషయం విక్కృతీ తవ సత్తా
విలసతి యా మతి మద్బిరుపాత్తా ।
ఇయమనఘా పరిపాలిత జాతిం
వితరతు మే వివిధాంచ విభూతిం ॥

ప్రతి విషయంలోనూ బుద్ధిమంతులంతా స్వీకరించే (విక్కృతి భిన్నమైన) 'సత్' ఏదైతే ఉందో, ఆ పుణ్యప్రదమైన 'సత్' అనేది అన్నిజాతులనూ పాలించడానికి సమర్థ వంతమైన, నానావిధాలైన వైభవాన్ని నాకు ఇచ్చుగాక (మార్పులకు భిన్నమైన విషయ రూపాల నుండి నిర్విషయమైన బుద్ధి, విక్కృతజాతుల సర్వాన్నీ వశపర్చుకునే వైభవాన్ని కలిగి ఉంటుంది. అదే బుద్ధియోగం. దాని ద్వారా గణపతిముని తన కపాలభేదనతో కూడిన యోగసిద్ధినీ పొందాడు)!

6. ప్రతి విషయగ్రహణం పరిపూతా
మతిరఖిలస్య జనస్యచ మాతా ।
మమ విదధాతు శుభం శుభనామా
త్రిదివ నివాసి నరేశ్వర రామా ॥

7. గగన తనుర్జగతో విపులస్య
ప్రభుపదమగ్ర్యమితా సకలస్య ।
ప్రతిజన దేహమజా ప్రవహంతీ
మమహృది నందతు సా విహరంతీ ॥

ప్రతి విషయాన్నీ గ్రహించే సామర్థ్యాన్నివ్వడానికై జనులందరికీ తల్లి మాదిరి వారిలో బుద్ధి రూపిణిగా ఉంది. శుభాన్ని కలిగించే పేర్లను కలిగిన ఆమె ఇంద్రాణీ దేవియే. అట్టి ఇంద్రాణీదేవి నాకు శుభాన్నిచ్చుగాక! ఆకాశశరీరిణియై, ఆమె బాగా వ్యాపించిన జగత్తులకన్నా శ్రేష్ఠమైన ప్రభుపదాన్ని పొంది ఉంది. ప్రతి మానవదేహం లోనూ ప్రవహిస్తూ, విహరిస్తూ ఉన్నా, ఆమెకు పుట్టుక అనేది లేదు. ఆ ఆకాశరూపిణి నా మనస్సులో క్రీడించుగాక!

8. పటు కులకుండ ధనంజయ కీలా
సముదిత హార్ద విభాకర లీలా ।
ద్రుత శిర ఇందు కళామృత ధారా
జన మవతా న్నిజభక్త ముదారా ॥

9. విషయ సమాకృతి ర(త్ర పురస్తా
ద్విమలతమా కిల తత్ర పరస్తాత్ ।
భవన మయీ భువనాచ్చ విభక్తా
మతిరనఘాఽవతు మా మతిశక్తా ॥

సమర్థవంతమైన కులకుండాగ్ని జ్వాలలను కలిగి, బాగా ఉదయించిన సూర్యుని వంటి హృదయ ప్రభావమే లీలగా కలిగి, శిరస్సులో ద్రవించే చంద్రకళామృత ధారలను కలిగి, ఉదారంగా ప్రవర్తించే ఆ దేవి తన భక్తులను రక్షించుగాక! సృష్టిలో (లేదా శరీర క్రియల్లో) విషయాకృతిగా ఉండి, అక్కడ ఆకాశంలోని నిర్గుణపరాస్థితిలో ఎంతో నిర్మలంగా ఉంటూ – ఈ విశ్వాన్నే ఇల్లుగా చేసుకుంది. ఐతే, భువనాలకంటే వేరేగా ఉండి, ఎలాంటి దోషాలూ లేని అతి శక్తివంతమైన ఆమె (బుద్ధిసంబంధమైన) రూపం నన్ను రక్షించుగాక!

10. విషయ పరిగ్రహణేష్వతి సక్తా
విషయ విధూతిషు కాపి వివిక్తా ।
అఖిలపతేర్మయి దీవ్యతు శక్తి
ర్విమలతమా విధుతేతర సక్తిః ॥

11. దృశిదృశి భాతి యదీయమపాపం
దిశిదిశి గంతృచ వేత్తృచ రూపం ।
భవతు శివాయ మమేయ మనింద్యా
భువనపతేర్గృహిణీ మునివంద్యా ॥

విషయాన్ని తెలుసుకోవడంలో ఎక్కువ ఆసక్తి కలదీ, వాటిని వదిలేయడంలో చెప్పలేని పవిత్రత కలదీ, ఎంతో నిర్మలమైందీ, ఎలాటి ఆపేక్షలూ లేనిదీ అయిన అఖిలలోకాధిపశక్తి నాలో ప్రకాశించుగాక. ప్రతి దృష్టిలోనూ ఎవరైతే నిర్దోశ రూపంతో (దృశ్యాన్ని వీడిన దృష్టి) ప్రకాశిస్తూ ఉందో, అన్ని దిక్కులా ఎవరైతే (బుద్ధి రూపంలో) వ్యాపించి తెల్సుకుంటూన్నారో – వారంతా పూజించే శక్తియైన ఆ ఇంద్రాణీదేవి, నాకు శుభాలనిచ్చుగాక!

12. జడకులకుందదరీషు శయానా
బుధకులవహ్నిషు భూరి విభానా ।
హరిహయశక్తి రమేయ చరిత్రా
మమ కుశలం విదధాతు పవిత్రా ॥

13. దహరగతాఖిల మాకలయంతీ
ద్విదళగతా సకలం వినయంతీ ।
దశశతపత్రగతా మదయంతీ
భవతు మయింద్రవధూ ర్విలసంతీ ॥

మూర్ఖుల కులకుండలాల్లో శయనించేదీ, పండితులలో నిర్మలబుద్ధితో కూడి అదే కులకుండాగ్నిలో విశేషంగా ప్రకాశించేదీ (అంటే, అజ్ఞానులలో నిద్రించేదీ, విజ్ఞానుల్లో ప్రకాశించేదీ అని అర్థం), పవిత్రమైన చరిత్రకలదీ అయిన ఇంద్రాణీదేవి నాకు సంతోషాన్నిచ్చుగాక! హృదయం (దహర గుహ) లో ఉండి సర్వాన్నీ పోషిస్తూ ఉంది. ఆజ్ఞచక్రంలో ఉండి సర్వాన్నీ శాసిస్తూ (శిక్షిస్తూ) ఉంది. సహస్రారంలో ఉండి అమృతానందాన్ని (నిర్విషయ నిరతిశయానందాన్ని) ఇస్తూ ఉంది (ఇలా మూడు రకాల విలాసాలను చూపేదే ఇంద్రాణీశక్తి).

14. గృహయుగళీ శ్రియ ఆశ్రితగమ్యా
పదకమల ద్వితయీ బహురమ్యా ।
మమహృది భా త్వవికుంఠితయానా
హరి సుదృశస్తరుణారుణ భానా ॥

సకలసంపదలకీ ఉండటానికి రెండు గృహాల్లాగా ఉండేవి ఆ ఇంద్రాణీ పాదాలు. అవి ఆశ్రిత భక్తజనులు చేరదగ్గవీ, ఎంతో రమ్యమైనవీ కూడా. వాటి గమనానికి అడ్డులేదు. బాలభానుడి ప్రకాశంతో సమానమైన ప్రకాశాన్ని కలిగి ఉన్న ఆ ఇంద్రాణీ పాదాలు నా మదిలో ప్రకాశించుగాక!

15. ఉపరి తతా కులకుండ నిశాంతా
జ్వలిత ధనంజయ దీధితి కాంతా ।
హరిహయ శక్తిరియం మమ పుష్టా
ద్రవయతు మస్తక చంద్ర మదుష్టా ॥

శరీరంలో స్థూల (లేదా పై) భాగంలో వ్యాపించి, కుండలినినే ఇల్లుగా చేసుకున్నదీ, మండే అగ్నికాంతులతో మనోహరంగా ఉండేదీ, పుష్టి కలిగిందీ, పవిత్రమైందీ అయిన ఆ ఇంద్రాణీదేవి, నా శిరస్సులో ఉండే చంద్రుడిని ప్రకాశింపజేయుగాక!

16. నభసి విరాజతి యా పరశక్తి
ర్మమ హృది రాజతి యా వరశక్తిః ।

ఉభయ మిదం మిళితం బహువీర్యం
భవతు సుఖం మమ సాధిత కార్యం ॥

17. త్రిభువనభూమిపతేః ప్రియయోషా
త్రిమలహారీ సురవిష్టప భూషా ।
మమ వితనోతు మనోరథపోషం
దురిత విపత్తి తతేరపి శోషం ॥

ఏ పరాశక్తి అయితే ఆకాశంలో విరాజిల్లుతూ ఉందో, ఏ శక్తి అయితే నా మదిలో ప్రకాశిస్తూ ఉందో - ఎంతో తేజోమయమైన ఆ రెండు శక్తులూ నా మదిలో మిళితమై, నా కార్యసాధన చేస్తూ నాకు సుఖాన్నిచ్చుగాక (అహంకారాన్నీ, మమకారాన్నీ దేవి తొలగించాలన్నదే కవి ప్రార్థన)! మనోవాక్కాయ కర్మలు మూడింటినీ హరించే ఇంద్రాణి నా కోరికను మన్నించి నెరవేర్చుగాక! నా పాపాలను పోగొట్టుగాక!

18. పవన జగత్ప్రభు మోహనమూర్తి
ర్జలధర చాలన విశ్రుతకీర్తిః ।
మమ కుశలాయ భవ త్వరిభీమా
జననవతాం జననీ బహుధామా ॥

మేఘాలను చలింపజేయడంవల్ల గొప్ప కీర్తిని సంపాదించుకుని, విస్తారమైన తేజస్సు కలిగి, జన్మగలవారికందరికీ తల్లిగా ఉంటూ, ఆ ఇంద్రుడిని మోహింపజేసే మూర్తి (అయిన ఇంద్రాణీదేవి) నాకు బలమిచ్చుగాక!

19. మమ సుర రాజవధూ కళయోగ్రా
ఖలజన ధూనన శక్త నఖాగ్రా ।
దమయతు కృత్తశిరాః కలుషాణి
ప్రకటబలా హృదయస్య విషాణి ॥

20. కులిశివధూకళయా పరిపుష్టా
బుధనుత సద్గుణజాల విశిష్టా ।
మమ పరితో విలసద్విభవాని
ద్రుపదసుతా విదధాతు శివాని ॥

21. సురజనరాడ్దయి తాంశ విదీప్తే
పదకమలాశ్రిత సాధుజనాప్తే ।

*దురితవశాదభితో గతభాసం*
*మనుజకుమారజనన్యవ దాసం ॥*

ఉగ్రకళ, శాంత కళ అని ఇంద్రాణీదేవి కళలు రెండు రకాలు. ఉగ్రమైనదీ, దుష్టజనులను నాశనమొనర్చే పటుత్వంగల గోళ్లు కలదీ, అతి బలమైనదీ, ఛేదించబడిన శిరస్సుగలదీ అయిన 'ప్రచండచండి' నా మదిలోని విషతుల్యమైన పాపాలను సంహరించుగాక! ఇంద్రాణీ (శాంత) కళతో కూడి, పండితుల పొగడ్తలను అందుకునే సద్గుణరాశియైన ద్రౌపది నాకు అన్నిటా వైభవంతో కూడిన శుభాలను చేకూర్చుగాక! ఓ మనుజ కుమారుని తల్లీ! పాపవశుడనై అన్నిటా నిస్తేజాన్ని పొంది దాసుడనైన నన్ను రక్షించు!

*22. అమరనరేశ్వర మందిర నేత్రీ*
*సుమశరజీవన సుందరగాత్రీ ।*
*భవతు శచీ వితత స్వయశస్సు*
*ప్రతిఫలితా గణనాథ వచస్సు ॥*

ఇంద్రుడి మందిరానికి నాయకురాలై, మన్మథుని పోషించే సుందర శరీరిణియైన ఆ శచీదేవి కీర్తి, గానం ద్వారా వ్యాపించిన గణపతి (ముని) వాక్కులో ప్రతిఫలించుగాక!

*23. వికసతు మే హృదయం జలజాతం*
*విలసతు తత్ర శచీస్తుతిగీతం ।*
*స్ఫురతు సమస్తమిహేప్సిత వస్తు*
*ప్రథితతమం మమ పాటవమస్తు ॥*

ఈ స్తుతి గీతం వల్ల నా హృదయమనే పద్మం వికసించుగాక! అందులో ఈ శచీదేవి సంబంధమైన ఈ గీతం ఆమెకు వినోదాన్ని కలిగించుగాక! ఇహంలో అన్ని కోరికలూ సఫలమగుగాక! కోరుకున్నవాటిని పొందడంవల్ల నా సామర్థ్యం ఎక్కువగుగాక!

*24. కురు కరుణారససిక్త నిరీక్షే*
*వచనపథాతిగ సద్గుణలక్షే ।*
*శచి నరసింహజ మాహితగీతం*
*భరతధరా మవితుం పటుమేతం ॥*

ఓ కరుణామయీ! నీ గుణాలు లక్షలకొలదీ ఉన్నాయి. అవి వర్ణించడానికి

అతీతంగా ఉన్నాయి. తల్లీ, భారతదేశ రక్షణార్థం ఈ గీతాలను వ్రాసిన నరసింహ సుతుడనైన ఈ గణపతి (ముని) ని సమర్థుని గావించు.

25. సులలిత తామరసైః ప్రసమాప్తం
వరనుతి బంధమిమం శ్రవణాప్తమ్ ।
జనని నిశమ్య సుబద్ధ మశేషం
హరిలలనే మమ కుర్వభిలాషమ్ ॥

ఓ ఇంద్రాణీమాతా! సులలిత తామరస వృత్తాలతో సమాప్తమయి, చెవులకు ఇంపుగా నిబద్ధమైన ఈ వరనుతి బంధాన్ని నీవు పూర్తిగా విని నా కోరికను నెరవేర్చు.

జాగతం శతకంలోని నాలుగవదైన సులలిత తామర స్తబకం
ఇక్కడితో పూర్తి అయింది.

దీనితో ఇంద్రాణీ సప్తశతిలోని ఏడవదైన జాగతం శతకం
పూర్తి అయింది.

కావ్యకంఠ శ్రీ వాశిష్ఠ గణపతిమహాముని ప్రణీతమైన
ఇంద్రాణీ సప్తశతి కావ్యానికి శ్రీవత్సగోత్రుడూ, వజ్ఝల వేంకటనారాయణ
కనిష్ఠపుత్రుడూ అయిన వజ్ఝల వేంకటరమణ అందించిన సరళమైన
తాత్పర్యం ఇక్కడితో సంపూర్ణమయింది.

శుభమస్తు



## వజ్జల వేంకటనారాయణ వేంకటరమణ



తల్లి : శ్రీమతి రాజేశ్వరి
తండ్రి : శ్రీ వి.ఎస్. వేంకటనారాయణ
జననం: 22 జూలై 1961
స్వస్థలం: తిరుపతి
వృత్తి : సైంటిస్ట్
ప్రవృత్తి : రచనా వ్యాసంగం

**రచనలు:**

వివిధ పత్రికల్లో వందలకొద్దీ కార్టూన్లు, కంప్యూటర్ వ్యాసాలు,
సైన్స్ వ్యాసాలు, కవర్ స్టోరీలు, 'ఆంధ్రజ్యోతి' వార పత్రికలో
కంప్యూటర్ క్లాస్, ఆధ్యాత్మిక జ్యోతి శీర్షికలు,
'ఆంధ్రజ్యోతి' దిన పత్రికలో సైన్స్ క్లబ్,
'ఆంధ్రప్రభ' దిన పత్రికలో ఐటి పేజీ,
'కంప్యూటర్ విజ్ఞానం' మాస పత్రికలో వందలకొద్దీ కంప్యూటర్ వ్యాసాలు,
'ఆంధ్రభూమి' దిన పత్రికలో కంప్యూటర్ కబుర్లు,
యువ-ఐటి లోకం శీర్షిక, బుక్ రివ్యూలు,
'కథాకేళి' మాస పత్రికలో నమ్మాల్సిందేనండోయ్... శీర్షికన
ఆధ్యాత్మికతను పంచే వ్యాసాలు- ఇలా ఎన్నో...

**పుస్తక రూపంలో వచ్చినవి:**

'తెలుగు అకాడమి'కి ఎంఎస్ ఆఫీస్, డిబిఎంఎస్,
సి-ప్రోగ్రామింగ్, పిసి అసెంబ్లింగ్ పుస్తకాలు
కంప్యూటర్‌క్లాస్ - వ్యాస సంకలనం
శ్రీనివాసం - పద్యగానం
శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం - సరళమైన తెలుగు వ్యాఖ్యానం
జే.పి.ఎల్. గ్విన్ (ఆంగ్లం) - మోనోగ్రాఫ్
శిరిడీ సాయి దివ్య చరిత - బుర్ర కథ
మామిడిపూడి వేంకటరంగయ్య - జీవిత చరిత్ర
చదలువాడ సుందరరామశాస్త్రి - జీవిత చరిత్ర
అంతరిక్షంలో అద్భుతాలు (5 సైన్స్ రూపకాలు)

**ఆడియో క్యాసెట్:**

జైగణనాథా క్యాసెట్‌కై గణపతిపై 10 పాటలు

**అముద్రిత రచనలు:**

సాయిబాబాపై వందకు పైగా పాటలు
అయ్యప్ప, రాఘవేంద్ర స్వామిలపై 20 పాటలు

**ముద్రణలో ఉన్న రచనలు:**

వావిళ్ల సంస్థ వైభవం
ఇంగ్లీషు-తెలుగు కంప్యూటర్ నిఘంటువు